# ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు - కార్యవర్గం





ఆచార్య బిరుదురాజు రామరాజు
గౌరవ అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు



డా.సి. వసుంధర
అధ్యక్షురాలు



డా.రావిప్రేమలత
ఉపాధ్యక్షురాలు



ఆచార్య ఎన్.భక్తవత్సలరెడ్డి
ఉపాధ్యక్షులు



ఆచార్య వై.ఎ. సుధాకర్ రెడ్డి
ఉపాధ్యక్షులు



డా.బిట్టు వెంకటేశ్వర్లు
ఉపాధ్యక్షులు



డా.ఎమ్.అండమ్మ
ఉపాధ్యక్షురాలు



డా. చిగిచర్ల కృష్ణారెడ్డి
ప్రధాన కార్యదర్శి



డా.పగడాల చంద్రశేఖర్
సంయుక్త కార్యదర్శి



డా.పి.సరస్వతి
కోశాధికారి



డా.వై.రెడ్డి శ్యామల
సాహిత్య కార్యదర్శి



లింగా శ్రీనివాస్
సాంస్కృతిక కార్యదర్శి

# జానపద సరస్వతి - 2008

సంపాదకులు

**డా॥ సి. వసుంధర**

అధ్యక్షురాలు, ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు

కార్యనిర్వాహక సంపాదకులు

**డా॥ పగడాల చంద్రశేఖర్**

సంయుక్త కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు

సహాయ సంపాదకులు

**డా॥ వై. రెడ్డి శ్యామల**

సాహిత్య కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు

ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు
హైదరాబాద్

జానపద సరస్వతి - 2008
ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు

**jaanapada saraswati-2008 by**
Andhra Pradesh Janapada Sahitya Parishat

ముద్రణ : సెప్టెంబర్ 2008



ప్రతులు : 500

వెల : రూ. 60/-

ప్రతులకు : అధ్యక్షులు
జానపద సాహిత్య పరిషత్తు
16-10-159/1/ఇ, మలక్‌పేట
హైదరాబాద్ - 500 036

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్** - అన్ని కేంద్రాలలో

**నవోదయ బుక్ హౌస్**, ఆర్యసమాజ్ ఎదురుగా, హైదరాబాద్.

డి.టి.పి. : **పుష్పరాజ్ గ్రాఫిక్స్**, నల్లకుంట, హైదరాబాద్.
ఫోన్ : 9390466071

లేఅవుట్ : **మను గ్రాఫిక్స్**, చిక్కడపల్లి, హైదరాబాద్.
ఫోన్: 040 - 27633574

ముద్రణ : **వేణు గ్రాఫిక్స్**, నల్లకుంట, హైదరాబాద్.
ఫోన్ : 9246332717, 040-27605769

# ముందుమాట

"ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు" హైద్రాబాద్ కేంద్రంగా 1972లో ఆచార్య బిరుదురాజు రామరాజుగారు గౌరవాధ్యక్షులుగా, ఆచార్య నాయని కృష్ణకుమారి గారు అధ్యక్షులుగా, డా॥గోపులింగారెడ్డిగారు ప్రధాన కార్యదర్శిగా ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖ ఎం.ఏ. (ద్వితీయ సంవత్సరం)లో మొట్టమొదటి సారిగా ప్రవేశపెట్టిన "జానపద సాహిత్యం"ను ఐచ్ఛికాంశంగా (1972)చేపట్టిన విద్యార్థి బృందం కార్యవర్గ సభ్యులుగా స్థాపించబడింది.

జానపద సాహిత్య పరిషత్తును ప్రారంభించింది మొదలు ప్రధాన కార్యదర్శులుగా వరుసగా డా॥గోపులింగారెడ్డి, డా॥కసిరెడ్డి వెంకటరెడ్డి, డా॥సి.వసుంధర, డా॥పులికొండ సుబ్బాచారి గార్లు పరిషత్తు అభ్యున్నతికి విశేషమైన కృషిచేసారు. ప్రస్తుతం ప్రధాన కార్యదర్శిగా డా॥చిగిచర్ల కృష్ణారెడ్డి సమర్థతతో వ్యవహరిస్తున్నారు.

పరిషత్తును స్థాపించింది మొదలు వీలైనంతవరకు నెలానెల సభ్యులతో కూడిన సమావేశాలను ఏర్పాటుచేసి, అందులో జానపద, గిరిజన విజ్ఞానాంశాలపై పరిశోధన పత్రాల పఠనం, వాటిపై చర్చలు నిర్వహించబడుతున్నాయి.

పరిషత్తు సభ్యులు సేకరించిన, పరిశోధించిన నూతనాంశాలను 'పత్రిక' రూపంలో పదిమందికి తెలియజేయాలన్న ప్రయత్నంతో 'జానపద సరస్వతి' పేరున ఒక పత్రికను పరిషత్తు స్థాపనతో బాటుగా ప్రారంభింపబడింది. మొదట ఇది 'చేతిరాత ప్రతి'గా ప్రారంభం అయింది. తరువాత సైక్లోస్టైల్ పద్ధతిలో కొంతకాలం కొనసాగింది. ఆ తరువాత అచ్చులో త్రైమాసిక పత్రికగా 1986 వరకు ప్రచురింపబడి, ఆర్థిక లోపం కారణంగా ఆపివేయబడింది. ఆ పత్రికను పునరుద్ధరించే ప్రయత్నం ఒకవైపు జరుపుతూనే మరొకవైపు 1996, 2003 సంవత్సరాలలో "జానపద సరస్వతి"ని ప్రత్యేక సంచికలుగా తీసుకురాగలిగాం. 2005సం॥పు ప్రత్యేక సంచిక 33వ వార్షికోత్సవంలో ఆవిష్కరించాం. ప్రత్యేక సంచికలలోని వ్యాసాలన్నీ "జానపద సాహిత్య పరిషత్తు" నిర్వహించిన సాహిత్య గోష్ఠులలో సమర్పించినవే. అంతేకానీ ప్రత్యేక సంచికల నిమిత్తం ఆహ్వానింపబడినవి కావు.

జానపద సాహిత్య పరిషత్తు ఈ కార్యక్రమాలతోబాటుగా -

- వార్షికోత్సవాలను ఘనంగా జరపడం;
- ప్రత్యేకించిన సాంస్కృతిక, సాహిత్య కార్యక్రమాలను నిర్వహించడం;

- నూతన గ్రంథాలను ఆవిష్కరించడం;
- జానపద కళాకారులను సన్మానించడం;
- ముఖ్యమైన కార్యక్రమాలను ఆడియో, వీడియో ద్వారా భద్రపరచడం;
- 1976లో ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖతో కలిసి జానపద వస్తు ప్రదర్శనశాలను ప్రారంభించడం;
- ఆచార్య బిరుదురాజు రామరాజుగారు జానపద సాహిత్యానికి చేసిన పరిశోధనకు గుర్తింపుగా 1988 సంవత్సరం మొదలుకొని ప్రతి సంవత్సరం "రామరాజు జానపద విజ్ఞాన బహుమతి" అనే పేరున జానపద సాహిత్య పరిశోధనలో పోటీని నిర్వహించి, పోటీలో ఎంపికైన ఉత్తమ గ్రంథానికి బహుమతిగా రూ.1116/- లతో గ్రంథకర్తను సత్కరించడం (2008 సంవత్సరం నుండి రూ.3000కు పెంచబడింది);
- పరిషత్తు సభ్యులు ప్రపంచ తెలుగు మహాసభలు, Indian Folklore Congress, Fossils, మొదలయిన సంస్థలు నిర్వహించిన సభలలో పాల్గొనడానికి మలేషియా, మైసూరు, బెంగుళూరు, సిమ్లా, కలకత్తా, వారణాసి, కేరళ, ఉడిపి, మధుర, తిరువనంతపురం, పాటియాల, గుజరాత్ మొదలయిన ప్రదేశాలకు వెళ్ళి ఉత్తమమైన పరిశోధన వ్యాసాలను సమర్పించడం;
- వెబ్‌సైట్‌ను రూపొందించడం;

మొదలయిన కార్యక్రమాలను నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమాలన్నీ ఆచార్య నాయని కృష్ణకుమారిగారు జానపద సాహిత్య పరిషత్తుకు అధ్యక్షులుగా ఉండి సాధించినవి; కార్యవర్గం ఉడుతాభక్తిగా సహకరించింది.

ఆచార్య నాయని కృష్ణకుమారి మేడమ్ ఎంతో అపురూపంగా కంటికి రెప్పలా కనిపెట్టుకొని కాపాడుకుంటూ వచ్చిన జానపద సందపను వారసత్వసంపదగా 12-9-2004 నాటి ఎన్నికలలో నాకప్పగించారు.

కృష్ణకుమారి మేడమ్ గారు 32 సంవత్సరాలతోనే సరిపెట్టుకోకుండా, ఇప్పటికీ జానపద సాహిత్య పరిషత్తుకు అధ్యక్షురాలిగా కొనసాగే ఓపిక ఉన్నా కూడా, తన నేతృత్వంలో శిక్షణ పొందిన శిష్యవర్గం పరిషత్తును ఎలా నడిపిస్తారో చూడాలనే ఆసక్తితో అధ్యక్ష పదవినుండి తప్పుకున్నారు. అందుకు నా బాధ్యత మరింతగా పెరిగినట్లుగా అనిపిస్తుంది.

నాకు సన్నిహితులు, మిత్రులు అయిన నాతోటి కార్యవర్గ సభ్యులు సహాయసహకారాలతో జానపద సాహిత్య పరిషత్తును అభివృద్ధి మార్గంలో ముందుకు నడిపించడానికి ప్రయత్నిస్తున్నాను.

ఆచార్య నాయని కృష్ణకుమారిగారు జానపద సాహిత్య పరిషత్తుకు అందించిన సేవలకు కృతజ్ఞతగా 2005 సంవత్సరంలో "కృష్ణకుమారి జానపద కళా బహుమతి"ని నెలకొల్పి ప్రతి వార్షికోత్సవంలో శాలువ, రూ.1116/-లతో ఒక ఉత్తమ జానపద కళాకారుని లేదా కళాకారిణిని సన్మానించడం జరుగుతున్నది.

"జానపద సరస్వతి - 2008" ను చదువబోయే ముందు పాఠకులకు చిన్న విజ్ఞప్తి. ఇందులో ప్రచురించిన ప్రతిభావంతులైన పరిశోధకుల వ్యాసాలు సరేసరి, నూతన పరిశోధకులను ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో పరిశోధక విద్యార్థులకు కూడా అవకాశం ఇవ్వడం జరిగింది. వారు కూడా ఈ అవకాశాన్ని సద్వినియోగ పరచుకొని, కేవలం ముద్రిత గ్రంథాలలోని సమాచారంపైననే ఆధారపడి వ్యాసాలను తయారు చేయకుండా, తాము స్వయంగా క్షేత్రపర్యటన (field work) గావించి కనుగొన్న విషయాలను తెలియచేయటానికి ప్రయత్నించారు. కనుక పాఠకులు వారి కృషిని సహృదయంతో ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

జానపద సరస్వతి - 2008 సంచిక ప్రచురణకు ఆర్థిక సహకారాన్ని అందజేసిన జానపద సాహిత్య పరిషత్తు జీవిత సభ్యురాలు, నా స్నేహితురాలు, కె.ఆర్.ఆర్. విజ్ఞాన కళాశాలల అధ్యక్షురాలు డా॥కె.సుమతి గారికి హృదయపూర్వక కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాం.

హైదరాబాద్
23-11-2008

**డా॥ సి. వసుంధర**
ఎం.ఏ., పిహెచ్.డి. (తెలుగు)
ఎం.ఏ. (సోషియాలజి)
ఎం.ఏ. -AIHCA, ఎం.ఇడి.
పరిషత్తు అధ్యక్షురాలు

# విషయ సూచిక



# జానపద విజ్ఞానంలో జరగవలసిన పరిశోధన

- ఆచార్య నాయని కృష్ణకుమారి
విశ్రాంతాచార్యులు
పూర్వ ఉపాధ్యక్షులు, పొ.శ్రీ.తె.విశ్వవిద్యాలయం
హైదరాబాదు

రాష్ట్రంలో ఉన్న ఎనిమిది విశ్వవిద్యాలయాలలో స్నాతకోత్తర స్థాయిలో పరిశోధన తెలుగు భాషాసాహిత్యాలపైన కొనసాగుతూ ఉంది. నేటికి ఈ విశ్వ విద్యాలయాల తెలుగు శాఖల నుండి వెలువడిన సిద్ధాంత వ్యాసాలు దాదాపు 1125 వరకూ ఉన్నాయి. అందులో ప్రాచీన సాహిత్యంపైన 340, ఆధునిక సాహిత్యం పైన 450, జానపద సాహిత్యంపైన 100, భాషాశాస్త్రంపైన 90, వ్యాకరణం, అలంకారాలు, ఛందం వంటి విషయాలపైన దాదాపు 35, పత్రికా రచన, స్థల వ్యక్తి నామాదికాలపైన 45, తులనాత్మక పరిశీలనపైన 15, ఈ రకం సంఖ్య చాలా ఆకర్షణీయంగా కనబడుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయాలలో మాత్రమేకాక రాష్ట్రేతరా లయిన బెంగుళూరు, మైసూరు, మదరాసు, బెనారస్ యూనివర్సిటీల నుండి తెలుగు పరిశోధనలు వెలువడుతున్నాయి. ఈ పరిశోధన వ్యాసాల పరంపర ఇంత ముమ్మరంగా కనపడడానికి కారణం-పరిశోధన అనేది ఉద్యోగావకాశాలను మెరుగు పరిచే విషయంగానూ, ఉద్యోగులు మరో పైమెట్టు ఎక్కడానికి సాధనంగానూ విద్యా విధానంలో నెలకొనడం వల్లనే. 1956 ప్రాంతాలలో అంతఃపుర కాంతలా ముసుగులో దూరి, కనీకనపడని పరిశోధన సుందరి మరో ముప్పైయేళ్ళు గడిచేసరికి, రంగస్థలం మీద గజ్జెకట్టి నాట్యం చేసే పద్ధతిలో ఎక్కడ చూచినా తనే అయి నర్తించసాగింది.

జానపద సాహిత్యాన్ని విషయంగా గ్రహించి 1956లో వెలువడిన తొలి సిద్ధాంత గ్రంథం డాక్టర్ బి. రామరాజుగారిది, యక్షగాన ప్రక్రియ మీద రెండవ సిద్ధాంత వ్యాసం 1957లో వెలువడ్డది. ఆ తరువాత పన్నెండేళ్ళు జానపద సాహిత్యం నిద్రపోయింది. 1969లో తంగిరాల సుబ్బారావు సిద్ధాంత గ్రంథం 'తెలుగు వీరగాథా కవిత్వము', 1970లో ఈ వ్యాసకర్త తెలుగు జానపద గేయ గాథలు రెండు మాత్రమే

వెలుగు చూడగలిగాయి. 70 నుండి మరో పదేళ్ళ పాటు ప్రవాసాన్ననుభవించి 80 నుండి మెల్లమెల్లగా జానపద సాహిత్యం గుర్తింపును పొందనారంభించింది. అప్పటి నుండి సగటున ఏడాదికి పిహెచ్.డి.లుగాని, ఎం.ఫిల్ గానీ రాష్ట్రంలో, బయటా, తెలుగులో ఏడాదికి 8 చొప్పున వస్తున్నాయి. ఈ సమాచారం జానపద సాహిత్యంలో పరిశోధనకు సంబంధించిన పూర్వరంగం.

దాదాపు 75 వరకూ ఉన్న జానపద సిద్ధాంత వ్యాసాలను పరిశీలిస్తే, తీసుకునే విషయాన్ని బట్టి వాటిని కొన్ని విభాగాలు చేయవచ్చు. అవి : 1. స్థలాలను పరిమితం చేసుకొని, ఆ స్థలాలలో లభించే జానపద సాహిత్యాధ్యయనం ఉదాహరణకు కర్నూలు జిల్లా వీరగాథా కవిత్వం (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం), 2. మహబూబ్‌నగర్ జిల్లాజానపదకథ (ఉస్మానియా విశ్వవిద్యాలయం), 3. అనంతపురం జిల్లా స్త్రీలపాటలు (శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం), 4. శ్రీకాకుళం జిల్లా రామాయణ జానపద గేయాలు (నాగార్జున విశ్వవిద్యాలయం), 5. తణుకు తాలూకా గ్రామదేవతలు (బొంబాయి విశ్వవిద్యాలయం), 6. తూర్పుగోదావరిజిల్లా గ్రామదేవతలు (ఆంధ్ర విశ్వవిద్యాలయం). ఇట్లా దాదాపు అన్ని విశ్వవిద్యాలయాలలో ఏదో ఒక జానపద ప్రక్రియ మీద పరిశోధన జరగడం మొదలైంది. ఇది ఆరంభమే అవడం వల్ల ఆయా విశ్వవిద్యాలయాల పరిధుల్లోని అన్ని జిల్లాలో ఈ పరిశోధన ఇంకా పూర్తికాలేదు. ఆ పని జరగవలసి ఉంది. ఇది పూర్తయితే రాష్ట్రమంతటా కల వివిధ జానపద ప్రక్రియల భాషలో, నిర్మాణంలో, వస్తువులో కల భేదాలను గుర్తుపట్టి సంపూర్ణమైన పద్ధతిలో జానపద సాహిత్య చరిత్రను వ్రాయడానికి వీలు కలుగుతుంది. అందువల్ల తెలుగు జాతి ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, చారిత్రక సామాజికాంశాలు, సాంస్కృతిక పద్ధతి, చిన్న చిన్న భేదాలు - వీటినన్నిటినీ పూర్తిగా వివరించడానికీ, వ్యాఖ్యానించడానికీ వీలుకలుగుతుంది.

## జాతి, సంస్కృతిని తెలియజేసే సిద్ధాతం గ్రంథాలు:

జానపద ప్రక్రియను దానిలో సౌందర్యాన్ని శిల్పాన్నో బహిర్గతం చేయాలన్న దృష్టితోకాక, లోతుగా దిగి ఇప్పటి సంస్కృతికి మూలభూతాలయిన అంశాలను వెలికితీసి, మతం, సంఘం, మనస్తత్వం వంటి విషయాలకు ప్రాధాన్యమిచ్చే ఈ విభాగంలో కూడా చాలా సిద్దాంత గ్రంథాలు వెలువడ్డాయి. 1. తెలుగు జానపద గేయగాథలు (ఉ.వి) 2. తెలుగు వారి నమ్మకాలు విశ్లేషణ, 3. తెలుగు జానపదసాహిత్యం పురాగాథలు, 4. తెలుగు గిరిజన గీతాలు, 5. తెలుగు సామెతలు జానపద సంస్కృతి, 6. తెలుగు జానపద సాహిత్యం. స్త్రీల గేయాల్లోని సంప్రదాయం



వంటివి మచ్చుకి కొన్ని మాత్రమే. పురాచరిత్రను వెలికితీసే ప్రయత్నం కల ఇటువంటి విశ్లేషణ ఉస్మానియా యూనివర్సిటీలో ఎక్కువగా జరిగింది. ఈ పరిశోధన వలన జానపదుల పురాచరిత్ర, సాంఘిక వ్యవస్థ, కులాలు, వృత్తులు, మత వ్యవస్థ, సాంఘిక వ్యవస్థ, కులాలు వృత్తులు స్త్రీల ప్రతిపత్తి వంటి అంశాలు స్పష్టంగా అవగతం కావడానికి వీలుకలుగుతున్నది. ఇందులో గేయాలు, కథా గేయాలు, సామెతలు, పొడుపు కథలు పురాగాథలు వంటి ప్రక్రియలు కూడా వేరు వేరుగా విశ్లేషణ పొందడం కనిపిస్తుంది. కాని ఇవేవీ సంపూర్ణం కాలేదు. మానవ సంస్కృ తి చరిత్ర వ్రాయాలంటే పూర్తిగా గిరిజన తెగల సాహిత్యాన్ని అధ్యయనం చేయాలి. కులాలవారీగా, వృత్తుల వారీగా వారివారి మౌఖిక వాఙ్మయాన్ని ఆశ్రయించి జానపద ప్రక్రియలనూ అధ్యయనం చేయడం పూర్తికావాలి.

## భాష

ఈ రంగంలో ఎక్కువ పరిశోధన శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో జరిగింది. అక్కడ కడప, అనంతపురం, నెల్లూరు, చిత్తూరు మొదలైన జిల్లాల గ్రామ నామ పరిశీలనం జరిగింది. ఇతరత్రా కూడా, మద్రాసు నగర స్థల నామాలు, గుంటూరు పేటల నామాలు, నిఘంటువుల కెక్కని జానపదుల భాష, మద్రాసులో బంధు వాచకాలు వంటి సిద్ధాంత వ్యాసాలు వెలువడ్డాయి. ఈ పరిశోధన అన్ని ప్రదేశాలకూ విస్తరించి సంపూర్ణమైతే, తెలుగు భాషకు సంబంధించిన జానపద మాండలికాలకు చరిత్ర వ్రాయడంవీలవుతుంది. అంతేకాక తెలుగులో ప్రచారంలోలేక మారుమూలల్లో ఒదిగిపోయిన తెలుగు పలుకుబడి వెలికివస్తుంది. పారిభాషిక పదాలు, సాంకేతిక పదాలు వంటివి ఉన్నవని మనం గ్రహించి వాటిని వాడుకునే స్థితి లభిస్తుంది. ఉదాహరణకు 'రైల్వేసిగ్నల్'' అనే మాటకు సంస్కృతీకరణం చేసి "ధూమశకట యాతాయాత సూచనాపట్టిక" అని తయారు చేయడం మనకు తెలుసు. ఇది చాలా కృతకంగా వినిపించే మాట. దీనికి కొన్ని ప్రాంతాలలో గ్రామాలలో 'రెక్కమాను' అని పిలుస్తారు. ఇటువంటి పదాలను గ్రహించి వాటిని వాడుకలో స్థిరపరచవచ్చు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 1956లో ఏర్పడిన తర్వాత కీ.శే. బెజవాడ గోపాలరెడ్డిగారి ఆధ్వర్యంలో పనిచేసిన కార్యకలాపాల్లో మాండలిక వృత్తి పదకోశాల ప్రణాళిక ఒకటి. దీనిద్వారా మొత్తం ఆంధ్రప్రదేశ్ అంతటా వ్యవసాయం, నేత, వడ్రంగం వంటి వృత్తులలోని మాండలిక పదాలను సేకరించి ప్రచురించింది. కానీ

దేశంలోని అన్ని వృత్తులకు ప్రణాళిక కొనసాగక, సంపూర్ణస్థితి పొందడం జరగలేదు. అది మన దురదృష్టమని భావించవచ్చు. అదే జరిగి ఉంటే మన భాషాసంపదకు దేశీయమైన ఎన్నో మారుమూల పదాలు వచ్చి చేరి ఉండేవి.

## జానపద దృశ్య కళారూపాలు

ఈ విషయంలో జరిగిన పరిశోధన తక్కువ - 1. యక్షగాన చరిత్ర, 2. బుర్రకథలు, 3. బయలాటలు, 4. అనంతపురం జిల్లా జానపద నృత్యకళ, 5. పల్నాటి సీమలో కోలాటాలు వంటి కొన్ని సిద్ధాంత వ్యాసాలు తప్ప ఈ రంగంలో విస్తృత పరిశోధన కనిపించదు. తోలుబొమ్మలాటలు, పగటి వేషాలు, వీధి నాటకాలు, సామూహిక నృత్యాలు, వ్యష్టినృత్యాలు, జంతువుల ఆటలు, వంటి ఎన్నో దృశ్యప్రక్రియలపై పరిశోధన వ్యాసాలు రావలసిఉంది. ఆంధ్రదేశంలో 90కి మించి పగటి వేషాలున్నాయని లెక్క కట్టబడింది. బొమ్మలాటలలో ఎన్నో రకాలున్నాయి. సాంకేతిక రంగంలో పరాకాష్ఠ నందుకున్నట్లు మనం గ్రహించవచ్చు. బొమ్మలు చేసే వైనం, రంగులద్దడం, ఆడించే పద్ధతి విదేశాలలో వీటికి కల వ్యాప్తి, ఇవన్నీ వెదికి తీసుకురావలసిన అంశాలే.

## తులనాత్మక పరిశీలన

మన రాష్ట్రానికి 5 భాషలు పొరుగున కనిపిస్తున్నాయి. ఆయా భాషలలో కల జానపద ప్రక్రియలకు తెలుగు ప్రక్రియలకూ గల సామ్యభేదాలను సూచించే సిద్ధాంత వ్యాసాలు కొన్ని రాకపోలేదు. అవి 1. తెలుగు కన్నడ భాషల తులనాత్మక పరిశీలన, 2. తెలుగు తమిళ జానపద సాహిత్య తులనాత్మక పరిశీలన, 3. హిందీ తెలుగు సాహిత్యాలలో వీర భావన, 4. హిందీ తెలుగు జానపద కథలు వంటి స్వల్పసంఖ్యాకాలయిన పరిశోధనలు మాత్రమే వెలువడ్డాయి. ఈ రంగంలో ఎంతో పనిజరగవలసి ఉంది. ఒక్కొక్క ప్రక్రియ రెండు భాషలలో ఎలా ఉందో గ్రహించే పరిశోధనలు రావాలి. అప్పుడే భారతీయ భాషల మధ్య కల సంస్కృతి బంధం ఎంతగట్టిదో లేక ఎన్ని విభేదాలతో కూడి ఉందో ఆకళింపుకు రావడం జరుగుతుంది.

## పొడుపు కథలు - సామెతలు

ఈ ప్రక్రియలపైన కొన్ని సిద్ధాంత వ్యాసాలు రాకపోలేదు. కాని మొత్తం తెలుగు భాషలో కనిపించిన సామెతలు పొడుపుకథలపై చేసిన పరిశోధనలేకాని స్థలాన్ని బట్టి, వస్తువునో బట్టి, సూక్ష్మ విభాగానికి లోనుచేసి చేసిన పరిశోధనలు కావు. పాశ్చాత్య



ప్రపంచంలో ఈ ప్రక్రియలపై వెలువడుతున్న పరిశోధక వ్యాసాలు విస్మయాన్ని కలిగించే విధంగా ఉంటాయి. ఉదాహరణకు 'చిన్న చేపను పెద్ద చేప మింగుతుంది' అన్న నుడికారాన్ని గ్రహించి దాని వెనక ఉండే మనస్తత్వం, సాంఘిక ప్రతిపత్తి, ప్రకృతి వ్యవస్థ వంటి విషయాలను గ్రహించి పరిశోధక వ్యాసాల్ని వెలువరించారు. అట్లాగే 'సిండరిల్లా కథ' వంటి కథలు ఇతర దేశాలలో భాషలలో ఎక్కడెక్క ఉన్నాయో వెతకడం ఆరంభించారు. పురాణాది కాలంలో అన్ని మతగ్రంథాలలోనూ కనిపించే యుగాంత జల ప్రళయగాథల మీద దృష్టిసారించాయి. ఇట్లా విషయం లోతులలోకి పోతున్నకొద్దీ అన్నీ పరిశోధనకు పాత్రమయ్యే అంశాలుగానే కనిపిస్తాయి. అటువంటి వాటిని పట్టుకుని అధ్యయనాన్ని విస్తృతం చేసుకోవలసిన పద్ధతిని ఇంకా జానపద వాఙ్మయపరిశోధన రంగంలో ప్రారంభించవలసి ఉంది.

## విచిత్రంగా జానపద కథానిర్మాణాన్ని గురించి

కొన్ని వ్యాసాలు తప్ప, సిద్ధాంత వ్యాసాలు రాలేదు. ప్రక్రియ నిర్మాణం విషయంలోనూ అంతే ముఖ్యంగా ఎన్నో దృశ్యప్రక్రియలకు కాణాచి అనిపించు కుంటున్న తెలుగు జానపద సాహిత్యాధ్యయంలో నిర్మాణ పరమైన విశ్లేషణకు కొరత ఏర్పడిందనే చెప్పక తప్పదు శతాధిక కథల నిర్మాణం గురించి పాశ్చాత్యదేశాలలో అద్భుతమైన అధ్యయనం జరిగింది. మౌఖిక కథల్లో ఉండే నమూనాలను విశ్లేషించవచ్చు. స్విత్‌థాంసన్, ఆంటీ ఆర్నేలు జానపద కథల నమూనాల గురించి ఒక గ్రంథాన్ని ఆవిష్కరించి ఉన్నారు. అయితే అందులో వాళ్ళు గ్రహించిన కథలన్నీ యూరోపియన్ కథలు కావడం వలన అక్కడి మాదిరులూ, మన తెలుగు కథల మాదిరులూ కొంతవ్యత్యాసంతో కనిపించక తప్పదు.

1. తెలుగులో సేకరించిన మాదిరులతో, రాష్ట్రానికి తమిళం, కన్నడం, మరాటీ, హిందీ, ఒరియాలూ పొరుగు భాషలుగా ఉండడం వలన, వాటి మాదిరులను బేరీజు వేసి తులనాత్మక అధ్యయనం చేయవచ్చు.

2. తెలుగులో పెద్దవాళ్ళు పిల్లలకు చెప్పే నీతికథలు సాధారణంగా జంతువు లనూ, పక్షులనూ జడవస్తువులనూ నాయకులుగా కలిగి ఉంటాయి. ఈ నీతి కథలను మాత్రమే గ్రహించి అధ్యయనం చేయవచ్చు.

ఈ కథలను సేకరించి ఒక స్పష్ట విభాగానికిలోను చేయడం కూడా పరిశోధనలో భాగమే. ఆ విభాగాలు ఇలా ఉండవచ్చు.

1. అడవి జంతువులు.
2. క్రూరజంతువులు-పెంపుడు జంతువులు.

3. క్రూరజంతువులు-మనుష్యులు.
4. పక్షులు.
5. ఇతర వస్తువులు .

జంతు నాయకాలైన కథలేకాక, మూర్ఖుల కథలు, అతిమానుషశక్తి కల వీరకథలు, మాంత్రికుల కథలు, రాక్షసుల కథలు అనే విభాగాలను గ్రహించి కూడా మొత్తం తెలుగుకు కానీ పొరుగు భాషలకు కానీ అనుసంధానం చేసి పరిశోధనకు ఉపక్రమించవచ్చు.

3. జానపద కథానిర్మాణాన్ని గురించి కూడా విస్తృతమైన పరిశోధన జరగవలసి ఉంది. ప్రాప్ సిద్ధాంతం ప్రకారం ఒక కథ నిర్వహింపబడే విధానం ఆ కథలో జరిగే సంఘటనల పరంగానే అర్థం చేసుకోవలసి ఉంటుంది. కథను ఎన్ని మలుపులు తిప్పి ఎంత సాగదీసినా, అందులో జరిగే సంఘటనలు పరిమిత సంఖ్యలోనే ఉంటాయి. ఈ పరిమిత కార్యాల సమాహార విశ్లేషణానికి 'మార్ఫాలజీ ఆఫ్ ఫోక్ టేల్' అని పేరు పెట్టుకున్నాడు. జానపద కథలోని గరిష్ఠ కార్యాలసంఖ్య ప్రాప్ లెక్కలో 31 మాత్రమే. ఈ రకమైన పద్ధతివలన ప్రభావితమై ఎలన్‌డండిస్ మరొక నిర్మాణ సూత్రాన్ని ప్రతిపాదించాడు. ఇక్కడ కథానిర్మాణాన్ని ఆయన అభావం, అభావ మధ్య; ముందుకూ, వెనక్కూ జరిగే సంఘటనల సమాహారంగా వివరించాడు. Bremond ఫ్రెంచ్ కథలనూ తీసుకొని మరొక నిర్మాణాన్ని సూచించాడు.

ఒకపని తృప్తికరంగా జరుగుతూ ఉండగా దానికి అడ్డంకి కలిగి లోపం ఏర్పడుతుంది. ఆ లోపాన్ని చక్కదిద్దడం, తిరిగి తొంటి పరిస్థితిని నెలకొల్పడం, ఇక్కడి కథానిర్మాణంలో విశేషం. దాన్ని ఒక పటంగా అమరిస్తే ఇట్లా ఉండవచ్చు.




అంటే కథ తృప్తికరమైన పరిస్థితి నుండి విస్తరించి, ఎగుడు దిగుడుల్ని సంతరించుకుని, అక్కడ నుండి మెరుగుపడిన పరిస్థితులతో తొల్లిటి మంచి స్థితిని



అందుకుంటున్నది. ఇట్లా నిర్మాణ పరమైన ఆలోచనల్ని ప్రాచీన ఆలంకారికులు చేయక పోలేదు. నాటక కథను గురించి అవస్థలుగా చెప్పిన కథ యొక్క బీజ, బిందు, పతాక, ప్రకరి, ప్రాప్త్యాశలనే అవస్థలు కథా నిర్మాణ స్వరూపాన్నే సూచిస్తాయి. పోతే అక్కడ వాళ్ళు దాన్ని నాటక కథకు మాత్రమే పరిమితం చేసుకున్నారు, కాని ఈ అవస్థలు ఏ కథకైనా అన్వయించవచ్చు. ఇట్లా నిర్మాణాన్ని గురించి ఆలోచించి కొత్తతెన్నులు వెదకవలసిన అవసరం ఎంతో ఉంది.

4. జానపద సాహిత్యానికి సంబంధించి మౌఖికమైన సాహిత్య విమర్శ ఎంతో లభిస్తుంది. ప్రతి పరిశోధకుడు క్షేత్రకార్యం ద్వారా అటువంటి మౌఖిక విమర్శను సేకరించవచ్చు. ఈ విమర్శ పరిశోధనకు పాత్రమే అవుతుంది Oral Literary criticism అనే పేరున పాశ్చాత్య దేశాలలో ఎంతో పరిశోధన జరుగుతూ ఉంది. అదే విధంగా జానపద ప్రక్రియల్లో ఒక ప్రక్రియలో అంతర్గతంగా మరొక ప్రక్రియ ఇమిడి ఉండవచ్చు, ఉదాహరణకు సామెతలో జానపద కథ - ఒక జానపద పురాణంలో ఎన్నో జానపద ప్రక్రియల ప్రసక్తివంటివి మనం గుర్తుపట్టవచ్చు. వాటిని సేకరించి విశ్లేషించడం కూడా పరిశోధనకే పాత్రమైన విషయాలే. యూంగ్ ఆర్కిటైపల్ సిద్ధాంతం కూడా పరిశీలింపవలసిన విషయమే.

ఈ రకంగా జానపద సాహిత్యానికి అనుబంధంగా, భూవాతావరణ శాస్త్రం, వ్యవసాయం, నృత్య శాస్త్రం, భూభౌతిక శాస్త్రం, వృక్ష జంతు శాస్త్రాలు, మనస్తత్వశాస్త్రం, ప్రాచీన చరిత్ర వంటి శాస్త్రవిషయాలలో గ్రహించి, సిద్ధాంత విషయాన్ని పటిష్ఠం చేసుకోవలసిన అవసరం నేటి జానపద పరిశోధకునికి ఎంతైనా ఉంది. అటువంటి సిద్ధాంత వ్యాసాలు ముందు ముందు ఎన్నో రావాలని ఆశిద్దాం.

**తాజాకలం**

ఈ వ్యాసం1989లో ఒక సమావేశంలో చదివిన పత్రం. అప్పటి నుండే ఈ నాటికి 19 సంవత్సరాలు గడిచి పోయాయి. అందువలన ఇక్కడ. విశ్వవిద్యాలయాలను గురించీ, పరిశోధక విషయాలను గురించీ ఇచ్చిన లెక్కలు 19 సంవత్సరాలు వెనుకటివని గుర్తించగలరు. అప్పుడు రాష్ట్రంలో విశ్వవిద్యాలయాలు ఉండగా, ఈనాడు అవి అసంఖ్యాకంగా పెరిగాయి. వాటితోపాటు తెలుగు శాఖలో పరిశోధక విద్యార్థులూ పెరిగారు. కాని వారు ఎన్నుకుంటున్న విషయంలో విశ్లేషణలో కొత్త దారులూ మెరుపులూ కనిపించడం లేదు. అది తెలియజేయడానికి ఈ వ్యాసం.

# యక్షగానం-పుట్టుక-చరిత్ర ప్రదర్శన

- ఆచార్య చిగిచర్ల కృష్ణారెడ్డి
జానపద కళలశాఖ, పొట్టిశ్రీరాములు
తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు

## పుట్టుక

తెలుగువారి ప్రసిద్ధ కళారూపం 'కొరవంజి'. ఇది దక్షిణ దేశమంతటా పేరెన్నికగన్నది. ఇది జానపద దృశ్యకావ్యం. కొరవంజి అంటె 'ఎరుకులసాని' అని అర్థం. ఎరుకలసానికి ఈనాటికీ పల్లెల్లో గౌరవం ఉంది. విజయనగర రాజుల కాలంలో ఎరుకలసానికి ఎంతో ప్రాముఖ్యం ఉండేది. ఈ ఎరుకలసాని వినోద కాలక్షేపానికి ఆటపాటలు జోడించి ఆరంభించిన కళారూపం కొరవంజి. ఈ కొరవంజి కంటే ముందుగా మరో యితర కళారూపం ఉందనటానికి నిదర్శనాలు చారిత్రాకాధారాలు కూడా లేవని తెలుస్తోంది. ఆంధ్ర, కర్నాటక, తమిళనాడు ప్రాంతాల్లో బహుముఖాల వ్యాప్తిలోకి వచ్చింది.

కొరవంజి అంటే నృత్యవిశేషంతో కూడిన 'అడుగు'. అడవుల్లో నివసించే కురవల అడుగు కాబట్టి, దీనిని 'కొరవంజి' లేక 'కురవంజి' అని పిలిచేవారు. గంతలు-చిందులు-గాండ్లి-అంజె-అంగ-అనేవి నృత్య విశేషానికి సంబంధించిన పర్యాయపదాలు. కొరవంజి ఆటవిక నృత్యం. ఆదిమానవులు అడవుల్లో నివసించే కాలంలో ప్రచారం పొందింది. ఆనాటికీ, ఈనాటికీ మన పుణ్యక్షేత్రాలను దర్శించే యాత్రికులను ఆనంద పరచేటందుకు అటవికులైన కురవలు ప్రదర్శనలు ఇచ్చేవారు. ఈ ప్రదర్శనకు యాత్రికులు మెచ్చుకొని, దానధర్మాలు కళాకారులకు ఇచ్చేవారు.

ఆరంభంలో కొరవంజి ఏమాత్రం నిర్మాణపటుత్వంలేని అడుగులతో ప్రారంభమైంది, ప్రేక్షకుల అభినందనలతో కొరవంజి అడుగు కళారూపంగా అభివృద్ధి సాధించింది. ఇతివృత్తం పుణ్యక్షేత్రాలను గూర్చి చెప్పటంవల్ల ఒక కళగా రూపొందింది.

## వేషం

అడవిజంతువుల చర్మాలు, నెమలి ఈకలు, పందిముళ్ళు, కోరలు, పులిగోళ్ళు, ఎలుగుబంటి చర్మం ధరించి, ప్రదర్శనలో కాలితో రకరకాల చిందులు తొక్కి, నోటికివచ్చిన పాటలు పాడి ఆడటం ప్రత్యేకం.



## కథ

కురవలు ఆంధ్రదేశంలో ప్రతి పుణ్యక్షేత్రం దగ్గరకు వచ్చే యాత్రికులకు ఆ పుణ్యక్షేత్ర మాహాత్యాన్ని కొరవంజిలో ఆడిపాడేవారు. రక్తికి రక్తీ, భక్తికి భక్తిగా శివలీలలు, విష్ణుకథలను ఇతివృత్తంగా తీసుకున్నారు. వీటిని గేయగాథలుగా రచన చేయించి, వాటికి క్రమమైన అడుగులు అమర్చి, కురవంజి అడుగును ఒక కళారూపంగా అభివృద్ధిలోకి తెచ్చారు కురవజాతివారు. ఇలా మరోరీతిలో అదే కథను చెపుతూ సాగిన కళారూపాన్ని జక్కుల(యక్షులు)వారు అనే కళావంతులు మొదలగువారు కూడా నేర్చుకొని ప్రదర్శించారు. కురవల తర్వాత యక్షులు అనే జాతివారు కొరవంజి కళారూపాన్నే కొంత గానం,వచనం పేరుతో ప్రచారంచేశారని, ఈ విధంగా యక్షగానం పుట్టుకకు కురవంజి కారణమైందని పరిశోధకులు అంచనా వేశారు.

## ప్రదర్శన

కొరవంజి కళారూపం ఒక క్రమంలేకుండా పుణ్యక్షేత్రాల్లో అనువైన స్థలంలో అంటే గట్టుపై లేదా ఎత్తైన రాతిపై నిలబడి అన్ని పాత్రలను ఒకడే ప్రదర్శించేవాడు. రానురాను యక్షగానం నాటికల్లో నాందీప్రస్తావనలు, సూత్రధారుడు, నటి, నర్తకి, నటుడు-విదూషకుడు, చేటకుడు-సింగి, సింగడు-ఇలాంటి పాత్రల ద్వారా ప్రేక్షకుని నిద్రమత్తు వదిలించటానికి ఉపయోగించేవారు. ఆంధ్రదేశంలో ఈనాడు కొరవంజి అసలు రూపం కనపడదు. దక్షిణదేశంలో కుట్రాల కురవంజి ప్రాంతాల వారిగా ప్రదర్శింప బడుతోంది. తమిళ దేశంలో కొరవంజి-కుఅత్తిపాట్టు(కుఅవతిపాడు), మళయాళంలో కుఅత్తియాట్టమ్, కన్నడంలో కొఅవంజి, తెలుగులో కొరవంజి లేక ఎరుకలసాని అని ప్రచారంలో వుంది. ఇంకా జీవకొరవంజి, జ్ఞానకొరవంజి, సత్యభామకొరవంజి,ఎరుకలకొరవంజి, రాజమోహనకొరవంజి, జానకీ సుఖోల్లాసు కొరవంజి అనే నాటకాలు ప్రచారంలో ఉన్నాయి.

తర్వాతి కాలంలో యక్షజాతి గానాన్ని జోడించి బృందకళారూపంగా ప్రదర్శనలు ఇవ్వటం జరిగింది. యక్షులు ఆరాధించిన కథాగానశైలినే యక్షగానం అంటారు. యక్షులు, నాగాసులు, కూర్మాపులు, భోగాలు, సానులు అనే అయిదు గాంధర్వజాతుల వారు పూర్వకాలంనుండే గంధర్వవిద్యలను నేర్చు కొన్నారు. సానులు దేవాలయాల్లో, దైవపూజల్లో నృత్యగానాలు అభినయించారు. వారే దేవదాసీలు. యక్షులే, జక్కులు, పురాణేతిహాసాల నుండీ ఒక ప్రసిద్ధమైన కథను నృత్యసంగీతాభినయంతో ప్రదర్శించటం యక్షగానసంప్రదాయం. ఉదాహరణకు శ్రీకృష్ణుని చిలిపిచేష్టలు, లీలలు

కథాగానంగా రచించి యక్షగానసంప్రదాయంగా ప్రచారం చేసినవారు నారాయణ తీర్థులు (కృష్ణలీలా తరంగిణి).

## యక్షగానం

యక్షులచే పాడబడే ఒక సంగీతవిశేషం. ఈ గానాలు ఎక్కువగా జక్కుజాతి వారే ప్రదర్శిస్తారు. యక్షశబ్దం 'జక్కు' శబ్దంగా మారిందని పరిశోధకుల అభిప్రాయం. యక్షగానంలో వచ్చే ప్రతిపాత్ర తన్నుగూర్చి చెప్పుకోవటంతోపాటు కథను కమ్మగా గుమ్ముగా నడుపుతారు. ఈ యక్షగానాన్ని రానురాను అనేక పేర్లతో ఆంధ్రదేశమంతటా ఈనాటికి ప్రదర్శిస్తున్నారు. ముఖ్యంగా బయిలాట-బయిల్నాటకం, వీధినాటకం, వీధిభాగవతం-చిందుభాగవతం- యానాదిభాగవతం, నకులభాగవతం- జేగంట భాగవతం- చెంచునాటకం తూర్పు భాగవతం-గొల్లభాగవతం-మాలభాగవతం, గంటభాగవతం. వీటన్నింటిలోనూ ప్రదర్శన పద్ధతి అభినయవాచకం ఒక్కటే, అయినా, కొంత తేడా ఉంటుంది. వాద్యాలు అన్నింటిలోను హార్మోనియం, మద్దెల తాళాలు ముఖ్యమైనవి. హార్మోనియం బదులు పూర్వకాలంలో 'తిత్తి' గాలితిత్తిని వాడేవారు. అన్నింటి లోనూ తెరపట్టటం ఆచారం. ఆభరణాలు కొంతతేడాతో ఉంటాయి. అలంకరణలు దాదాపు ఒక్కటే. సూత్రధారుడు, విదూషకుడు, సింగి, సింగడు హాస్యపాత్రలు ముఖ్యమైనవి.

## చరిత్ర

16వ శతాబ్దంలోని చిత్రభారతం యక్షగానంలో యక్షకవితలు పాట, యక్షకామినుల నాట్యం ఉన్నాయి. యక్షగానాల ప్రభావం ఈశతాబ్దంలో ఎక్కువ. శ్రీనాథుని జక్కులపురంధ్రి, ప్రతాపరుద్రుని ఉంపుడుగత్తె మాచదేవి భాగోతం బుచ్చిగాడు, పిండిలనాగి, కందుకూరి రుద్రదేవి రచించిన సుగ్రీవ విజయం యక్షగానం మొదటగా పేరుగాంచింది.

పింగళి సూరనగారి ప్రభావతీప్రద్యుమ్నంలో గంగావతరణం నాటకంలో ఆనాటి ప్రదర్శన పద్ధతిని వివరించారు. కాజవెంకటాద్రి గారి వాసంతికా పరిణయంలో, కంకంటి పాపరాజు(నెల్లూరు) విష్ణుమాయవిలాసంలో జక్కుల వారి కులదేవత-అక్క దేవతల కొండ (ఏడుగురు అక్కమ్మగార్లు సప్తమాత్రికలు) గూర్చి వివరించారు. శ్రీనాథుని భీమఖండంలో దక్షవాటిపురాన్ని వర్ణిస్తు 'కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు, గాంధర్వమున యక్షగాన సరళి' అని పేర్కొన్నారు.



అయ్యగారి వీరకవి రచించిన చిత్రాంగద విలాపం అనే యక్షగానంలో 'చిత్రాంగద విలాపమును యక్షగాన మొనరింతు వేషముల్గట్టి, జనులు పాడివినిపింప' అనటం వల్ల యక్షగానరూపంలో వేషధారణలో పాటలు పాడి వినిపించేవారని తెలుస్తోంది. దీన్ని బట్టి యక్షగానరూపం రాను రాను వీధినాటకంగా రూపొందిందని గ్రహించాలి.

క్రీ.శ. 8వ శతాబ్దానికి ముందు, ఆ తర్వాత తమిళంలో వ్రాయబడ్డ 'శిలప్పధికార' మనే కావ్యంలో నాటకాలకు నాట్యశాస్త్రానికి సంబంధించిన అనేక శాస్త్రీయవిషయాలు ఉదాహరింపబడ్డాయి.

15వ శతాబ్దం ప్రథమంలో మన యక్షగానాల ప్రసక్తి ఉంది. ఈ శతాబ్దంలో ప్రోలుగంటి చెన్నశౌరి 'సౌభరిచరిత్ర' గాథను జక్కులవారు ఆనాడు కథాగానం చేసినందుకు 1550లో చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహంలో చెన్నశౌరి రచించిన సౌభరిచరిత్ర ప్రణయ యక్షగానంగా పేర్కొన్నారు.

రెండుశతాబ్దాల క్రితం బనగానిపల్లి నవాబు భాగవతకళాకారులను ఆహ్వానించి కోటకొండక పట్రాలలో వారికి భాగములు ఇనాములిచ్చి ఆకళాకారులను ప్రోత్సహించారు. ఈ భాగవతులు కర్నాటక, మహారాష్ట్ర భాగవత కేళికలు చేసి తెలుగువారి కళావిశిష్టత ఇతర రాష్ట్రల్లో కూడా ప్రచారం చేశారు. ఈ సంప్రదాయపెద్దలు గతించారు. అంతేగాక కొండవీటిరెడ్డి రాజులు, విజయనగరరాజులు, తంజావూరు ఆంధ్రనాయక రాజులు యక్షగానరాజ్యమని వెలుగొందించారు.

## ప్రదర్శన

గ్రామం నడిబొడ్డులో రంగస్థలం ఏర్పాటుచేసుకుంటారు. నాలుగు గుంజలు పాతి, పైన తడకలువేసి, మామిడాకుల తోరణాలు కడతారు. మధ్యలో చెక్కలు వేస్తారు. రాత్రి 9గంటలకు ప్రదర్శన ప్రారంభిస్తారు. తెల్లవారుజాము వరకు సాగుతుంది. మొదట వాద్యాలు మోగిస్తారు. చమురు దీపాలు పెడుతూ గరుడస్తంభంలో దీపాన్ని వెలిగించి, పూజచేసి ప్రార్థన చేస్తారు. విదూషకుడు ప్రవేశించి జరగబోయే కథాఘట్టాన్ని ప్రేక్షకులకు చిత్రవిచిత్రమైన మాటలతో పాటలతో పద్యాలతో వినిపిస్తాడు. వేషాలు వేసుకున్న కళాకారులు కూడా పాత్రోచితంగా ఆడిపాడడం, వంతపాడటం ఉంటుంది. విదూషకుడు అన్ని పాత్రలకు వంతపాడతాడు. ప్రదర్శనలో ఎక్కువ ప్రాధాన్యం ఉన్న పాత్ర ఇది.

## రంగులు

అన్నిపాత్రలకు పసుపుపచ్చ, నల్లనికాటుక మాత్రం ఉపయోగిస్తారు. అర్దలం అనే రంగురాయిని తీసుకుని పసుపుపచ్చని రంగును తయారుచేస్తారు. కాటుకకు రాగిపల్లెంలో వండిన ఆముదం పోసి, ఏకు(దూది) వేసి అంటిస్తారు. ఆ వేడికి పళ్ళెం క్రింది భాగంలో నల్లగా కరుడుకడుతుంది దాన్నితీసి కాటుక డబ్బాలో భద్రపరుస్తారు. దీన్ని అంజనం అంటారు. అంజనం అంటే ఆకర్షించేది. దీన్ని తయారు చేసేటపుడు స్త్రీలు మాత్రం ఉంటారు, పురుషులు వెళ్లకూడదని జానపదుల నమ్మకం. ముఖ్యంగా అరదళం-మణిశిల-బొగ్గుపొడి-సింధూరం మొదలగు వాటితో పాత్రధారులు తమకుతామే అలంకరించుకుంటారు.

## ఆభరణాలు

కిరీటాలు, భుజకీర్తులు-చేతిబిళ్ళలు, దండకడియాలు-రంగుకోకలు, డావు మొదలగునవి కాగితం అట్టలతో తయారుచేస్తారు. స్త్రీలకు సంబంధించిన ఆభరణాలు కూడా ఇనుపరేకులతో తయారు చేసి రంగు కాగితాలు అతికిస్తారు. ఇంటిలోని చీరలు పురుషులు పంచెలుగా కట్టుకుంటారు లేదా రజకులను అడిగి తెచ్చుకుంటారు.

## వాద్య గతులు

తాళాలు విదూషక పాత్రదారి (హాస్యపాత్ర) దగ్గర తప్పకుండా ఉంటాయి, వంతల దగ్గరుంటాయి. గాలితిత్తి లేదా హార్మోనియం, 'వుయ్ వుయ్' అనే శబ్దం, శ్రుతి కోసం వాడతారు. నేలపై చెక్కలుంటాయి. కాళ్ళతో వేసే అడుగులు చెక్కశబ్దంతో కలిసిపోతాయి, తాళగతి సంగీత నియమం కళాకారుల ఇష్టం. గొంతెత్తి పాడగా దరువులు, వంతపాటగాళ్ళ మీద ఎక్కువ శ్రమ వుంటుంది. ప్రదర్శనలో 10 నుంచి 15 మంది కళాకారులు పాల్గొంటారు.

వాద్యాలు కంచుతాళం, గంటలు, మృదంగం, శుద్ధమద్దెల, చండ వాద్యం, వీణ, వేణువు, ముఖవీణ, శంఖం, స్త్రీ పురుష గాత్రం ఒకప్పుడు ఉండేవి. ఇటీవలి కాలంలో తాళాలు, హార్మోనియ, మద్దెల, స్త్రీలు, పురుషుల గొంతు మాత్రమే ఉంటాయి. రాగాలలో ముఖ్యంగా త్రిపుట, ఆది, రూపకం, తాళాలను ఝంపె, ఏక్, అట, చాపు ఉపయోగిస్తారు.

## తులనాత్మక పరిశీలన

రుద్రకవి అహోబిలమంత్రి గరుడాచలాన్ని పోలిన రచనలకు వీరు నర్తన మాడతారు. వీరి యక్షగానాలలో తంజావూరు, ఇతర ప్రాంతాల యక్షగానాలని



పిలువబడే రచనలకు చాలా తేడా వుంది, అవి నృత్యనాటక పద్ధతిలో తీర్చిదిద్దబడినట్టివి, వీరు ప్రదర్శించేవి కథాగాన శైలిలో ఉంటాయి.

తెలుగు యక్షగానాలకు, కన్నడ యక్షగానాలకు చాలా తేడా వుంది. కన్నడలో కళాకారులు ఈ ప్రదర్శన సమయంలో గానం చేయరు. భాగవతుడు వెనక నుండి గానం చేస్తుండగా అభినయం మాత్రం చేస్తారు. ఆ గాన అర్థాన్ని ఆంగికం ద్వారా వ్యక్తం చేస్తారు. తెలుగు యక్షగానాల్లో ప్రతినర్తకుడు గానం ద్వారా తన పాత్రను వ్యక్తం చేస్తాడు. వీటిలో సంధి వచనాలను మాత్రం సూత్రధారుడు పలుకుతాడు. ఆటలో ఆహార్యంలో రెండు పద్ధతుల్లో చాలా తేడాలుంటాయి.

ఈ విధంగా ప్రదర్శనలో ముందుగా గణేశ్వర ప్రార్థన చేసి చివరిగా మంగళం పాటతో ప్రదర్శన ముగిస్తారు.

# ప్రపంచీకరణ నేపథ్యంలో జానపద కళా సంపద

- డా॥ రావి ప్రేమలత
తెలుగు అధ్యాపకులు (విశ్రాంత),
శ్రీ రామచంద్ర ఆర్ట్స్& సైన్స్ కళాశాల, హైద్రాబాద్.

మనదేశాన్నే కాకుండా వర్ధమానదేశాల ఆర్థిక, సాంస్కృతిక వ్యవస్థలను ఛిన్నాభిన్నం చేస్తున్న ప్రపంచీకరణం రెండు దశాబ్దాల కిందనే ప్రారంభమయ్యింది. 1987లో రెండు జర్మనీదేశాల ఏకీకరణవల్ల, కమ్యూనిస్టు దేశమైన సోవియట్ యూనియన్ పతనం వల్ల అంతర్జాతీయంగా పెద్దమార్పు వచ్చింది. ఉదారవాద ప్రజాస్వామ్యం, స్వేచ్ఛావాణిజ్యం, పారిశ్రామికీకరణం, సమాచార సాంకేతిక విజ్ఞానం అభివృద్ధివల్ల ప్రపంచీకరణానికి మార్గం సుగమం అయ్యింది.

ప్రపంచీకరణం అంటే వివిధ దేశాల్లోని జాతీయ ఆర్థిక వ్యవస్థలు సమీకృతమై ఒకేఒక ప్రపంచ ఆర్థికవ్యవస్థగా మారడం. ప్రపంచంలోని భిన్నదేశాల్లో విభిన్న సంస్కృతులతో, విభిన్న ఆచార సంప్రదాయాలతో ప్రజలు జీవిస్తున్నారు. ఈ భిన్నత్వాన్ని అంతం చేసి, ఒకే ఒక సంస్కృతిని సాధించాలని అగ్రరాజ్యాలు ప్రయత్నిస్తున్నాయి. కొంత వరకు సఫలీకృతమయ్యాయి. అయితే ప్రపంచీకరణ ప్రభావంతో తమ సంస్కృతీ సంప్రదాయాలు. తాత్త్వికసిద్ధాంతాలు నామరూపాలులేకుండా అంతరించిపోతాయోమో అనే ఆరాటం, ఆవేదనలు వర్ధమాన దేశాల్లో ఇప్పుడిప్పుడే ఏర్పడుతున్నాయి. ప్రపంచీకరణ కబంధ హస్తాల నుండి తమ అస్మిక, అస్తిత్వాలను కాపాడుకోవాలకునే తపన వర్ధమాన దేశాల్లో కన్పిస్తున్నది. మనదేశంలో కూడా క్రమంగా అంతరించిపోతున్న ప్రాచీన సంస్కృతినీ, సంస్కృతికి మూలమైన జానపద కళాసంపదనూ పరిరక్షించుకోవాలనే ఆకాంక్ష ఆరంభమయ్యింది.

జానపద కళల్లో ముఖ్యమైనవి పనిపాటలు. పల్లెల్లో పనికీ పాటకూ అవినాభావ సంబంధముంది. విసరురాతి పాటలు, దంపుళ్ళ పాటలు, కదురుపాటలు, కోతపాటలు మోటపాటలు, పడవ పాటలు, బండిపాటలు వంటివే కాకుండా వివిధ వృత్తుల వారు పనిచేసేటప్పుడు పాడేపాటలు అంటే రజకులు బట్టలుతికేటప్పుడు, గంగపుత్రులు చేపలు పట్టేటప్పుడు, కుమ్మరి కుండలు చేసేటప్పుడు పనిలోని అలుపును మరచిపోవడానికి, మరింత ఉత్సాహంగా పనిచేయడానికి పాటలను పాడుతుండేవారు. కానీ కొత్తగా వచ్చిన యంత్రాలు జానపదుల బతుకులనే కాక వారికళారూపాలను కూడా వెతలపాలు చేస్తున్నాయి. ఇది వరకు పదిమంది కలిసి చేసే పనిని ఈనాడు యంత్రాలు నిమిషాల్లో చేస్తున్నాయి. స్వేచ్ఛావాణిజ్యంవల్ల వివిధ దేశాల్లోని వివిధ రకాల వస్తువులు మన దేశంలోకి కుప్పలు కుప్పలుగా వస్తున్నాయి. ఇది వరకు అమల్లో దాదాపు ప్రతి ఇల్లు చిన్నకుటీర పరిశ్రమగా ఉండేది.

'కదురు కవ్వంబులు కలయాడు నింట
కరువు కాటకాలు కలికాన లేవు' అని

స్త్రీలు సంతృప్తిగా పాడుకునే వారు. తృప్తిగా జీవితాలను ఉన్నంతలో గడిపేవారు. మొదట పాశ్చాత్యీకరణతో తర్వాత ప్రపంచీకరణతో కుటీరపరిశ్రమలు మూతపడ్డాయి. పల్లెల్లో కదురు, కవ్వాలు అదృశ్యమయ్యాయి. కరువుకాటకాలు అధికమయ్యాయి, పనిపాటలు విచ్ఛిన్నమయ్యాయి.

ప్రపంచీకరణతో ప్రపంచమే ఒక కుగ్రామంగా మారిపోతున్నది. మనుషుల మధ్య దూరం తరగిపోతున్నది, కానీ మనస్సులమధ్య దూరం పెరిగిపోతున్నది. కుటుంబ సంబంధాలు, మానవ సంబంధాలు వ్యాపార సంబంధాలుగా మారిపోతున్నాయి. ధనవ్యామోహం, స్వార్థం నానాటికీ పెరిగిపోతున్నది. అవిభక్త కుటుంబాలు చెల్లాచెదురై, వ్యష్టి కుటుంబాలు ఎక్కువైపోతున్నాయి.

సమష్టికుటుంబం భారతీయ సంప్రదాయ ప్రత్యేకత. సమష్టి కుటుంబాల్లో సభ్యుల మధ్య ప్రేమానుబంధాలు, మమతానురాగాలు ఉండేవి. వీటిని జానపదస్త్రీల పాటలు ప్రతిబింబిస్తూ, కుటుంబసంబంధాలను దృఢతరం చేసేవి.

"చిలుకల్లు, చిలుకల్ల అందురేగాని
చిలకలకు రూపేమీ పలుకులే గాని
చిలుకల్లు మాయింటి చిన్న కోడల్లు
హంసల్లు హంసల్లు అందురే గాని
హంసలకు రూపేమి నడకలేగాని
హంసల్లు మాయింటి ఆడపడచుల్లు"

ఇలాంటి పాటలు కుటుంబ సభ్యులమధ్య ప్రేమానురాగాలను పటుతరం చేసేవి.

ఈనాడు ప్రపంచీకరణం ప్రభావంతో సెటిలైట్లు, టి.వీలు వచ్చాయి. ప్రతి ఇంట్లో టీవీలు ఉన్నాయి. ఇవి అత్తాకోడళ్ళ మధ్య, కుటుంబ సభ్యులమధ్య ఈర్ష్యా ద్వేషాలను రగిలించే సీరియళ్ళను ప్రసారం చేస్తున్నాయి. మనిషిలోని హింస, దౌర్జన్యాలను రెచ్చగొట్టే కథల దృశ్యీకరణతో మన సంస్కృతిని విషమయం చేస్తున్నాయి.

మన ఆచార సంప్రదాయాలకూ, తరతరాల నుండి వస్తున్న జానపద కళాసంపదకూ అవినాభావ సంబంధం ఉంది. మన పండుగల్లో జానపద కళాసంపద వెల్లివిరుస్తుంది. సంగీత సాహిత్య నృత్య, చిత్రకళా సంపదలు పండుగల్లోనే అభివ్యక్తమవుతుంటాయి.

సంక్రాంతి సమయంలో గొబ్బిఆటలు, పాటలు, ముగ్గులు, దీపావళికి పెట్టే బొమ్మల కొలువులు దసరాకు తెలంగాణలోని బతుకమ్మ పండుగలో బతుకమ్మను వివిధరకాల పూలతో కళాత్మకంగా పేర్చడం, పాటలు పాడుతూ ఆడడం, అట్లతద్ది పండుగలో ఆడపిల్లలు ఉయ్యాలలూగుతూ పాటలు పాడడం, పండుగలకు హరిదాసులు కీర్తనలు పాడుతూ నాట్యం చేయడం, శ్రీరామనవమి చెక్కభజనలు, కోలాటలు వేయడం, గ్రామదేవతల పండుగల్లో బీరన్నలు, ఒగ్గోళ్ళు, బైండ్లవారు దేవతల కథలను ప్రదర్శించడం పల్లెల్లో ప్రతిసంవత్సరం జరుగుతుండేవి. ఈ ప్రదర్శనలు వృత్తికళాకారులకు ఉపాధిని కల్పిస్తుండేవి. పల్లెవారికి కనువిందును, వీనులవిందును కల్గించేవి. కళారూపాలు కూడా సంప్రదాయపరంగా తమ మనుగడను సాగించాయి. కానీ ఆధునికీకరణం ప్రభావంతోనే క్రమంగా కనుమరుగవుతున్న జానపద కళారూపాలు ప్రపంచీకరణం ప్రభావంతో అత్యంతవేగంతో అంతరించి పోతున్నాయి. ఈనాడు ప్రభుత్వం సెలవులు ఇవ్వడంవల్ల పండుగలు చేసుకుంటున్నాం, కానీ ఆయా పండుగల్లో ప్రదర్శించే కళారూపాలను మాత్రం మరచిపోతున్నాం. ప్రాచీన సంస్కృతి రూపుమాసిపోయి పాశ్చాత్య సంస్కృతిలోని న్యూఇయర్‌డే (ఆంగ్ల సంవత్సరాది) వాలంటీన్స్‌డే (ప్రేమికులదినం) లాంటివి మన సంస్కృతిలోకి జొరబడుతున్నాయి.

పుట్టిన నాటినుండి గిట్టేవరకు మనకెన్నో ఆచార సంప్రదాయాలు, వాటిని అంటిపెట్టుకున్న గేయసంపద అనంతంగా ఉంది. పసిపాపలను ఉయ్యాల్లోవేసి 'జో అచ్యుతానంద జోజో ముకుంద, రావే పరమానంద రామగోవింద' అని లాలిపాటలను పాడుతుండేవారు. తమ పాటల్లోనే పరమాత్మను దర్శించుకునే స్త్రీల ఆధ్యాత్మిక భావాలు అత్యున్నతమైనవి. పిల్లలకు ఉయ్యాల్లో ఊగే పసితనం నుండే పౌరాణిక పరిజ్ఞానాన్ని అలవరుస్తుండేవారు ఆనాటి తల్లులు. జీవితంలోని ప్రతి దశకూ ఒక ఆచారం, దానితో పాటు పాటలను పాడడం మన పల్లె సంప్రదాయం. ప్రాణి తల్లి గర్భంలో ఊపిరి పోసుకుంటున్నప్పటి నుండీ, పుట్టి పెరిగి ఊపిరి ఆగిపోయే వరకు పాటలున్నాయి. వేవిళ్ళ పాటలు, సీమంతం పాటలు, సుఖప్రసవం కోరుతూ పాడే పాటలు, ఉయ్యాల పాటలు, జోల పాటలు, లాలి పాటలు, మేలుకొలుపు పాటలు, ఉగ్గుపాటలు, ఆటలపాటలు, బడికి వెళ్ళినప్పుడు పాడే పాటలు, సంకెళ్ళపైన పాటలు, కుటుంబంలో అవ్వాతాత, తల్లీ తండ్రీ, అన్నాచెల్లెళ్ళు, వదినామరదళ్ళు, వదినా మరిది, అక్కాచెల్లెళ్ళు, అత్తాకోడళ్ళు, అత్తా అల్లుళ్ళు పాడుకునే పాటలు, అసంఖ్యాకంగా ఉండేవి. ప్రాణం పోయిన తర్వాత కూడా వారిపైన పాటలు పాడడానికి ప్రత్యేకమైన కులస్థులు ఉండేవారు. ఇలా తల్లి కడుపులో నుండి బయట పడిననాటినుండే కాటికి పోయే వరకు బతుకంతా పాటలతో ముడిపడి ఉండేది. బతుకుల్లో వెతలున్నా పాటల మధురిమలు ఓదార్పునిచ్చేవి, ముందుకు సాగడానికి ధైర్యాన్నిచ్చేవి. పాశ్చాత్యీకరణం, ప్రపంచీకరణం నేపథ్యంలో గేయసంపద అందని గగనకుసుమం అయ్యింది. జీవితాల్లోని నిరాశనిస్పృహలను పారద్రోలి చైతన్యపరిచే పాటలను దూరం చేసుకున్నాం. అశ్లీలమైన, హింసాప్రేరకమైన సినిమాలవల్ల, టీవీ ప్రసారాలవల్ల, వెబ్ సైట్లవల్ల ఈ తరంలో మానవత్వం మటుమాయమవుతున్నది, దానవత్వం విజృంభిస్తున్నది.

జీవితంలో అతిముఖ్యమైన ఘట్టం పెళ్ళి. ఈ పెళ్ళికూడా ప్రపంచీకరణ ప్రభావానికి లోనవుతున్నది. పెళ్ళిలో వాణిజ్యధోరణులు ప్రవేశించడంతో తరతరాల నుండీ వస్తున్న వృత్తి కళాకారుల, కులవృత్తులవారి ఉపాధులు, కళానైపుణ్యాలు దెబ్బతింటున్నాయి, ఇది వరకు మేదరి పెళ్ళి పందిరిని వేసేవాడు, రజకులు సంప్రదాయపరంగా అందంగా పోలు రాసేవాడు. విశ్వకర్మ కులచిహ్నాలతో రంగుల బొమ్మలను చిత్రించిన అయిరేణి కుండలను పేర్చేవాడు. నాయీ బ్రాహ్మణులు మైలపోలు తీసేవారు. వంట బ్రాహ్మణులు కానీ భంటు కులం వారుకానీ వంటలు వండేవారు. విశ్వబ్రాహ్మణులు తాళిని తయారు చేసుకొని వచ్చేవారు. మాదిగలు డప్పు కొట్టేవారు. కంబళ్ళ వారు సన్నాయి వాద్యం వాడేవారు. మూడురోజుల, ఐదురోజుల పెళ్ళిళ్ళు ఈనాడు గంటలో పూర్తవుతున్నాయి. వ్యాపార సంస్థలవారు పందిళ్ళను వేస్తున్నారు. భోజనాలను కేటరింగుసంస్థలవారు ఏర్పాటు చేస్తున్నారు.

బ్యాండు మేళం వాద్యాల జోరు ఎక్కువగా ఉంటుంది. పోలు రాయడం, అవిరేను కుండలను తేవడం వంటి సంప్రదాయాలకు చోటు లేదు. దీనివల్ల తరతరాల నుండి వస్తున్న ఆయా వర్గాల వృత్తుల వారి ఉపాధి దెబ్బతింటున్నది.

ఇది వరకు పెళ్ళి కూతురికి నలుగు పెట్టడం నుండి అప్పగింతల వరకు పాటలు పాడేవారు. పెళ్ళి చూపుల పాటలు, నలుగు పాటలు, తలంటు పాటలు, తిలకం పాటలు, సువ్వి పాటలు, పెండ్లి పాటలు, మంగళ సూత్రం పాటలు, గంధంపూత పాటలు, విందు పాటలు, తాంబూలం పాటలు, పూలచెండ్ల పాటలు, నాగవెళ్ళి పాటలు, తలుపు దగ్గరి పాటలు, వియ్యపురాలి మీద పాటలు, పాన్పుపాటలు, శోభనం పాటలు, పవ్వళింపు పాటలు, వసంతం పాటలు, అప్పగింతల లాంటి అపారమైన జానపద గేయసంపద పెళ్ళిళ్ళల్లో వెల్లివిరుస్తుండేవి. ఆచార సంప్రదాయలతో మేళవించిన పాటలతో బంధు సంబంధాలు, ఆత్మీయబంధాలు దృఢతర మయ్యేవి. ఈనాటి పెళ్ళిళ్ళ వల్ల ఆయా వృత్తుల వారు ఉపాధిని కోల్పోవడమే కాకుండా, మానవీయ అంశాలు తరగిపోవడం ప్రపంచీకరణంవల్ల వస్తున్న సాంస్కృతిక పరిణామాల ప్రభావమే అని చెప్పవచ్చు.

ప్రపంచీకరణవిధానంలో మానవబంధాల బదులు కంప్యూటర్ సంబంధాలు ఎక్కువవుతున్నాయి. మానవసంబంధాల్లో కృత్రిమత్వం, యాంత్రికత చోటుచేసు కుంటున్నాయి. ఈనాడు మానవ విలువలను, మానవ సంబంధాలను నిర్ణయించేది ధనమే. నేటి ప్రచార, ప్రసార సాధనాలు కూడా ధనసంపాదనకు ఉపయోగపడే సులభ మర్గాలనూ, వ్యాపార సంస్కృతినీ పెంపొందించే విజ్ఞానాంశాలను ప్రసారం చేస్తున్నాయి.

ప్రచార, ప్రసార సాధనాలు లేనికాలంలో మన పూర్వీకులు మానవ విలువలను ప్రబోధించే లిఖిత, మౌఖిక సాహిత్యాలను రూపొందించారు. మౌఖిక లేదా జానపద సాహిత్యంలో గేయాలలాగే కథలు అసంఖ్యాకంగా ఉన్నాయి. ఈ కథలెక్కువగా మానవ విలువలను నిర్ణయించేది ధనంకాదనీ, ప్రేమ స్నేహసంబంధాలని బోధించాయి. ధర్మం, సత్యం, అహింసలను పాటిస్తేనే మానవ సంబంధాలని శాంతి స్నేహభావాలతో వర్ధిల్లుతాయనీ ప్రబోధించాయి. వెనుకటితరంవారు ముఖ్యంగా స్త్రీలు తమ పిల్లలకు ఉగ్గుతోపాటు మానవ విలువలను, సంస్కృతీ సంప్రదాయాలను రంగరించి పాటలను పాడేవారు. కథలను చెప్పేవారు. సమయం, సందర్భాన్ని బట్టి



నీతిని, ధర్మాన్ని వాచ్యంగా కాకుండా కథలరూపంలో బోధించేవారు. సత్య ప్రాధాన్యానికి ఆవు పులి కథను చెప్పేవారు. స్నేహ ధర్మానికి చీమ-పిట్టకథను కథనం చేసేవారు. జానపద కథల్లో సమయానికీ, సందర్భానికీ, శ్రోతకూ ప్రాధాన్యం ఎక్కువగా ఉంటుందన డానికి ఒక చిన్న ఉదాహరణ. ఒక పాప స్నేహితురాలు పుస్తకం అడిగితే ఇవ్వనంది. వెంటనే తల్లి చిన్నకథను చెప్పింది. 'చెట్టుపైన పిట్టకూ, కింద ఉండే చీమకు స్నేహం కల్గింది. ఒక రోజు వేటగాడు కొమ్మపైన ఉన్న పిట్టపైకి బాణాన్ని గురిపెట్టాడు. అది గమనించిన చీమ గట్టిగా అతని కాలును కుట్టింది అమ్మా అనుకుంటూ బాణాన్ని వదిలాడు. అది చూచి పిట్ట ఎగిరిపోయింది. మరొక్కమారు వర్షపు వాగులో చీమకొట్టుకొని పోతుంది. పిట్ట ఒక ఆకును వాగులో వదిలింది. ఆకుపైకి ఎక్కి ఒడ్డుకు చేరి చీమ బతికి పోయింది." ఈ కథను చెప్పిన తల్లి, "స్నేహితులెప్పుడు చీమ పిట్టల మాదిరి ఒకరికొకరు సాయం చేసుకోవాలి ఇప్పుడు నువ్వు పుస్తకం ఇస్తే నీ కవసరం వచ్చినప్పుడు నువ్వడిగింది నీ స్నేహితురాలు ఇస్తుంది కదా" అని తల్లి చెప్పగానే బిడ్డ పుస్తకాన్ని స్నేహితురాలికి ఇచ్చివేసింది. ఇలా చిన్న కథలతోనే మానవ విలువలను బోధించేవారు. మహాభారత, భాగవత, రామాయణ కథలను పిల్లలకు చిన్నప్పటినుండే చెప్తుతుండేవారు. వారిలో మన సంస్కృతీ సంప్రదాయాలపైన భక్తి భావాలను పెంచేవారు. ఈనాడు ప్రపంచీకరణ ప్రభావంతో పిల్లలు యువతరం పాశ్చాత్య సంస్కృతిపైన, సాహిత్యంపైన మోజుపడుతున్నారు. తెలుగు భాష ఇంగ్లీషుమయం అయిపోతున్నది. ఈకాలం పిల్లలకు టామ్ అండ్ జెర్రి కథలు, సూపర్ మాన్, స్పైడర్ మాన్, లిటిల్ బేర్, హ్యారీపోటర్, మిక్కీమౌస్ కథలే తెలుసు.

పాశ్చాత్యీకరణ, ప్రపంచీకరణాల ప్రభావాలు ప్రసరించకమందు జానపదాలు వివిధ కళారూపాల వేదికగా, వివిధ కుల వృత్తికళాకారుల కూటమిగా ఉండేవి. ఆనాడు కులవృత్తులను ఆశ్రయించుకునే జానపద కళారూపాలు మనుగడను సాగించేవి. గ్రామాల్లో జానపదకళలను ప్రదర్శించే వారిని రెండు రకాలుగా పేర్కొనవచ్చు.

కులం, వర్గం, వర్ణం భేదంలేకుండా ఎవ్వరిముందైనా తమ కళారూపాన్ని ప్రదర్శించి దానం అడగడం ఒక రకం, తమకు హక్కున్న కులం వారి ఇంటికి వెళ్ళి కళారూపాన్ని ప్రదర్శించడం రెండవ రకం. వీరందరి వృత్తి, భృతి తమ కళారూపాలను ప్రదర్శించడం, దాతలిచ్చిన దానితో జీవించడం. హరిదాసు, పగటివేషగాళ్ళు, శారదకాండ్రు, బాలసంతువారు, గంగిరెద్దులవారు, పాములవాళ్ళు, చెంచులవాళ్ళు

కులభేదం లేకుండా ఎవ్వరింటికైనా వెళ్ళి తమ కళారూపాలను ప్రదర్శించి, ప్రతిఫలాన్ని తీసుకుంటుంటారు. కోమట్లకు వీరముష్టివారు, రెడ్డి, కమ్మలకు పిచ్చుకుంటివారు, కాపు తెనుగలకు కాకి పడుగువారు, కురుమగొల్లలకు ఒగ్గోళ్ళు బీరన్నలవారు, గౌడులకు గౌడ జెట్టీలు, విశ్వబ్రాహ్మణులకు పంబలవారు, రజకులకు పటం వాళ్ళు, మాదిగలకు బవనీలు, డక్కలి వారు, ఆయా కులాలవారి కులపురాణాలను చెప్పి పటం, బొమ్మల ద్వారా ప్రదర్శించి, దాతలిచ్చే వాటితో బతుకుతుంటారు. వీరిని కులబిడ్డలు, అర్థిబిడ్డలు అంటారు.

నిమ్నకులాలవారు, దళిత కులాలవారు తమ సామాజిక అస్తిత్వం కోసం, కులగౌరవాన్ని, వృత్తి ప్రాధాన్యాన్ని నిలబెట్టుకోవడం కోసం కులపురాణాలను సృష్టించుకున్నారు. కులపురాణాలను గానం చేయడానికీ, ప్రదర్శించడానికీ ఒక్కొక్క వృత్తికులంవారు మరొక ఉపకులాన్ని ఏర్పాటు చేసుకున్నారు. వారిని జీవితాంతం పోషించే బాధ్యతను కూడా తీసుకున్నారు. కులపురాణ ప్రదర్శనలు సంగీతం, సాహిత్యం, నృత్యం, వాద్యం, అభినయం, చిత్రకళల సమాహార కళారూపాలు.

ఈనాడు పారిశ్రామికీకరణవల్ల వస్తువుల ఉత్పత్తులు పెరిగాయి. ప్రపంచీకరణలోని స్వేచ్ఛా వాణిజ్యం వల్ల వివిధ దేశాలనుండి వస్తువులు కుప్పలుగా వస్తున్నాయి. టెక్నాలజీ అభివృద్ధి చెందడంవల్ల గ్రామాల్లోని కుటీర పరిశ్రమలకు, హస్తకళలకు క్షీణదశ వాటిల్లుతున్నది. కులవృత్తులన్నీ ఛిన్నాభిన్నమవుతున్నాయి. వాటిని ఆశ్రయించుకున్న కళాసంపద కూడా అంతరించిపోయే దశకు చేరుకుంటున్నాయి. కులవృత్తి తప్ప మరో జీవనోపాధి తెలియనివారి జీవితాలు చితికిపోతున్నాయి, ఆత్మహత్యలకు గురవుతున్నాయి.

వివిధ వృత్తి కళాకారుల జీవితాలతోపాటు ప్రపంచ ప్రఖ్యాతి పొందిన మన హస్తకళాసంపద కూడా క్రమంగా తరగిపోతున్నది. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన చేనేత పరిశ్రమకు ఈనాడు చేయూత లేదు. అగ్గిపెట్టెలో ఇమిడే 7 గజాల చీరను నేసి ఆంగ్లేయుల ఈర్ష్యాసూయలకు గురైన చేనేత కార్మికుల బతుకులు ఆత్మహత్యల పాలవుతున్నాయి. నేతచీరలు, జరీ చీరలు, పట్టుచీరలకు మారుగా నైలాన్, పాలిస్టర్ చీరలు రకరకాల బట్టలు ఫ్యాక్టరీల్లో నుండి, విదేశాల నుండే చవగ్గా, రాశులుగా వస్తున్నాయి. కుమ్మర్ల కుండల, మట్టి పాత్రలస్థానంలో స్టీలు సామాను వస్తున్నాయి. శాస్త్రజ్ఞులు ఆధునిక నాన్‌స్టిక్ పాన్‌ల కంటే మట్టిపెనాలు మంచివంటున్నారు. విశ్వకర్మ చేతుల్లో మట్టి వివిధ రూపాలను మలచుకుంటాయి. అవన్నీ ఈనాడు రూపుమాసిపో



తున్నాయి. ఫ్రిజ్‌ల్లోని చల్లటినీటి కంటే కుండలోనినీరే ఆరోగ్యదాయక మంటున్నారు. వడ్రంగి వారిచేతిలోని చెక్కడం పనులు, మిషన్ చెక్కడాల ముందు విలువను పోగొట్టుకుంటున్నాయి. ఇలా హస్తకళలకు నిరాదరణ ఎదురవుతుంది. వృత్తి కళాకారుల బతుకుల్లో వెతలు నిండుకుంటున్నాయి.

ప్రపంచీకరణ ప్రభావంతో మనకట్టుబొట్టే కాకుండా తిండి అలవాట్లు కూడా క్రమంగా మారిపోతున్నాయి. బర్గర్‌లు, పిజ్జాలు, కూల్‌డ్రింక్‌లు మనకే కాకుండా పిల్లలకు కూడా ఇష్టమైన తిండిగా ఏర్పడింది. మన జీవిత విధానం మనది కాకుండా పోతుంది. పరాయీకరణగా మారిపోతున్నది. దేశీయమైన పాకకళ మరుగున పడిపోతుంది. తరతరాలనుండీ వేలసంవత్సరాల నుండీ సంప్రదాయపరంగా వంటకాల్లో వాడేటటువంటి పసుపు, ఎల్లిగడ్డ, అల్లం, జీలకర్ర మొదలైన పదార్థాలకు క్యాన్సర్, గుండెజబ్బులను నివారించే గుణం ఉందని పాశ్చాత్యులు ఈనాడు ప్రయోగశాలల్లో పరిశోధనలను జరిపి నిర్ధారించారు. ఇది వరకే వేప, పసుపులపై పేటెంట్ హక్కులను అమెరికా పొందింది. మన ఆచార సంప్రదాయాల్లోని ఆరోగ్యపు విలువలను కాపాడుకోవడానికి ప్రపంచీకరణ ప్రభావానికిలోను కాకుండా ఉండాలి.

ప్రపంచీకరణ ప్రభావం ప్రధానంగా రెండు రంగాలపైన ప్రసరిస్తున్నది. అవి: 1 ఆర్థికరంగం, 2. సాంస్కృతిక రంగం. ప్రపంచీకరణ ముందుకంటే కూడా పల్లెల్లో పేదరికం ఉండేది. కానీ ఆత్మహత్యలు లేవు. పల్లెల్లోని కళారూపాలు నామరూపాలు లేకుండా పోతున్నాయి. వృత్తికళాకారుల సృజనాత్మక కళారూపాలకు, వస్తువులకు గుర్తింపులేదు. పచ్చని చేలు మాయమైపోతున్నాయి. బహుళజాతి సంస్థలు, బహుళ అంతస్థుల భవననిర్మాణాలు పెరిగి పోతున్నాయి. మనం నిలబడ్డ నేలకు కూడా వెలకట్టే పరిస్థితి వస్తున్నది. మన ఆర్థిక, సాంస్కృతిక రంగాలను అతలాకుతలం చేస్తున్న ప్రపంచీకరణం ప్రభావం నుండి మనం తప్పించుకోలేము. కానీ ప్రపంచీకరణానికి ప్రత్యామ్నా యాలను ఆలోచించాలి.

ప్రపంచీకరణ నేపథ్యంతో అంతరించిపోతున్న మన జానపద కళా సంపదను రక్షించుకోవడానికి విశ్వవిద్యాలయాలు ముఖ్యంగా పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయ జానపద కళారంగంలో పరిశోధనలను జరిపిస్తున్నది. పాటలను, కథలను సేకరించి క్యాసెట్‌లలో, వీడియోలలో భద్రపరుస్తున్నది. వేదికలపైన రాష్ట్రప్రభుత్వ సాంస్కృతిక సంస్థ, పొటిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, ఇతర సంస్థలు

జానపదకళలను ప్రదర్శింపచేస్తున్నాయి. జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో కూడా జానపద కళారూపాలు ప్రవేశిస్తున్నాయి. అయితే వేదికలపైకి ఎక్కిన జానపదకళారూపాలు పుట్టిపెరిగిన పల్లెల్లో నుండి మటుమాయమై పోతున్నాయి. కళాకారులకు ఉపాధిని కల్పించడానికీ, కళాసంపదను పరిరక్షించడానికీ పండుగల్లో, పెళ్ళిళ్ళల్లో, విందుల్లో, సదస్సుల్లో డిస్కో డాన్సులు, ఆర్కెస్ట్రా, పాశ్చాత్య సంగీతానికి బదులుగా జానపదకళలను ప్రదర్శింపచేయాలి. కళలనూ, కళాకారులను ప్రోత్సహించాలి. కళాకారులకు ఉపాధిని చూపాలి.

ప్రభుత్వం సబ్సిడీలనిచ్చి మన హస్తకళలను ప్రోత్సహించాలి. ప్రదర్శనలను ఏర్పాటు చేస్తుండాలి. మన జీవితాల్లోకి దూసుకు వచ్చి నిత్యా వసరవస్తువుగా మారిన టీ.వీ ప్రభావం నుండి మనం తప్పించుకోలేం, కానీ టీవీల ద్వారానే మన సంస్కృతిని నిలబెట్టుకునే ప్రయత్నం చేయాలి. ప్రపంచీకరణ ప్రభావంతో మానవసంబంధాలు, మానవవిలువలు శిథిలమవుతున్న ఈరోజుల్లో నీతి, ధర్మంతో సమాజం శాంతియుతంగా సాగాలంటే, తరతరాల నుండీ వస్తున్న జానపదకథలను సేకరించి వాటిని పత్రికల్లో రేడియోల్లో, టీ.వీల్లో, వెబ్సైట్లలో పిల్లలకు, యువతరాన్ని ఆకట్టుకునే విధంగా రూపొందించి ప్రదర్శించాలి. మానవీయ విలువలను ప్రచారం చేయాలి. నేటి బాలలను రేపటి ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాలి.

## ఉపయుక్త గ్రంథ సూచి

1) గంగాధరం, నేదునూరి గంగాధరం; మిన్నేరు.

2) కథచెప్పిన రావి మనోహరమ్మ, వయస్సు 25, నాగిరెడ్డిపల్లి, నల్గొండజిల్లా.

# జానపదుల చిత్రకళ - పచ్చబొట్టు

- డా॥ పుణుగోటి సరస్వతి
తెలుగు అధ్యాపకులు (విశ్రాంత)
డా॥బి.ఆర్.అంబేద్కర్ కళాశాల, హైదరాబాద్.

జానపద విజ్ఞానం అనంతమయింది. అందులో ప్రతి అంశం ప్రాచీన మానవుని మేధావిలసనకు ప్రతీక. అందులోని ఏ అంశాన్ని తీసుకుని పరిశోధించినా విలువైన సమాచారం అందుతుంది. జానపద విజ్ఞానం జానపదుల ఆచార వ్యవహారాలు, ఆధ్యాత్మిక చింతన, ఆనందోల్లాసాలు, ఆరోగ్య అనారోగ్యాలు, ఒకటేమిటి వారి సంపూర్ణ జీవనసరళికి అద్దం పడుతుందని మనందరికీ తెలిసిందే. అందుకే ఈ జానపద విజ్ఞానాన్ని జ్ఞానపద విజ్ఞానం అనడం ఎంతో గౌరవప్రదం.

ప్రాచీన మానవుడు అడవులను, గుట్టలను విడిచి, నదీతీరాలలో నివాసమేర్పరచుకొని, తనకుటుంబాన్ని ఏర్పరచుకొన్నాడు. ఆ కుటుంబానికి ఏ కష్టం కలుగకుండా పోషించే సమర్థత కలగడంతో, అతని మనస్సు ఆనందోల్లాసాలను కోరుకుంది. తద్వారా మొదట ఆట, పాటలతోపాటు శిల్పం, చిత్రలేఖనం (చిత్రకళ), నృత్యం, మొదలైన జానపద కళారూపాలు ఆవిర్భవించాయి. అందులో చిత్రలేఖనం ముఖ్య భాగంగా ప్రసిద్ధి పొందింది.

జానపదుల చిత్రకళ సామాజిక మయింది. జానపద చిత్రకారులు తమ చిత్రాల ద్వారా ఆయాజాతులకు సంబంధించిన మతసంప్రదాయాలతో పాటు తమ నమ్మకాలు, పౌరాణిక, పారమార్థిక విజ్ఞానాన్ని వెలార్చే ఒక ప్రతీకగా చిత్రించారు. అందుకు మనమందరం వారికి ఎంతగానో కృతజ్ఞులై ఉండాలి.

జానపదుల చిత్రకళ అనేక వేలసంవత్సరాలనుండి ఒక తరం నుండి మరొక తరానికి సంక్రమిస్తూ వస్తుంది. ఈ నాటికీ మన పల్లెసీమల్లో ఇంటి వాకిళ్ళు, గోడలు, గ్రామ దేవతల గుళ్ళు, జానపదులు కట్టుకునే బట్టలు (కలంకారి అద్దకపు పని), ఇంకా పటం కథలు మొదలైనవి చిత్రకళతో కూడినవే. అంతేకాక జానపదుల శరీరాలపై గూడా తన ఉనికిని చాటుకోవడమే కాక జానపదుల జ్ఞానపరణితితో పాటు మనిషి సౌందర్యోపాసకుడు అన్న నానుడికి ప్రతీకగా చిత్రకళ నిలిచిందీ చిత్రకళ. ఈ చిత్రకళలోని ఒక చిత్రాంశమైన పచ్చబొట్టును, దాని పూర్వాపరాలను తెలియచేయడమే ఈ వ్యాసరచన ఉద్దేశ్యం.

అన్ని జానపద కళల మాదిరిగానే 'చిత్రకళ' కూడా ప్రాచీన మానవుని అనుభవం నుండే ఉద్భవించిందని జానపద పండితుల అభిప్రాయం. ప్రాచీన మానవునికి ఎన్నడో ఒకనాడు దెబ్బ తగిలి ఉండవచ్చు, దాని నుండి కారే రక్తాన్ని అరికట్టడానికి దానిపై ఊబిదినిగాని, మెత్తని మట్టినిగాని పోసి, తన అపరిశుభ్రమైన చేతితో రుద్ది ఉండవచ్చు. తరువాత ఆ గాయం మానినా ఊబిది రంగులో మచ్చ శాశ్వతంగా ఉండిపోయి, పచ్చబొట్టుగా నిలిచి ఉండవచ్చు. తరువాత కాలగమనంలో పచ్చబొట్టు జానపదులు శరీరాలంకరణకై వివిధ రూపాలలో చిత్రించుకునే చిత్రకళగా ప్రసిద్ధి పొందింది. పచ్చబొట్టును ఆంగ్లభాషలో టట్టూ (Tattoo) అని అంటారు.

ప్రపంచంలో ఇంచుమించు అన్ని దేశాలలోని ఆటవిక, గిరిజన జాతులలో ఈ చిత్రకళకు ఎక్కువ ప్రాచుర్యముంది. ఆ జాతులు వారి వారి జాతులకు చెందిన వంశ లాంఛన (టోటమ్) చిహ్నాలైన మొసలి, తాబేలు, డ్రాగన్, సింహం, గద్ద వంటి జంతువుల రూపాలను తమ శరీరాల మీద పచ్చబొట్టుగా పొడిపించుకునేవారని ఆయా జాతుల సంస్కృతుల వలన తెలియవస్తుంది.

ఈ పచ్చబొట్టుకు కొన్ని వేల సంవత్సరాల చరిత్ర ఉంది. మొట్ట మొదట ఈజిప్టు దేశస్థులు ఈ పచ్చబొట్టును అలంకరణ కోసం మాత్రమే కాక, మతప్రాముఖ్యం వంటి కారణాల కోసం తమ శరీరాల మీద చిత్రించు కున్నట్లు పాశ్చాత్య పురాతత్త్వ పరిశోధకుల అభిప్రాయం.

మొదట ఈజిప్టులో క్రీ.పూ 2160 మరియు క్రీ.పూ. 1994 నాటి స్త్రీ మమ్మీల శరీరాల మీద పచ్చబొట్లు, గీతలు, చుక్కలు, రేఖాగణిత రూపాలలో కనిపించాయని పరిశోధకులు తెలియచేశారు. ఈ రూపాలలో గల పచ్చబొట్లు కేవలం స్త్రీలకు మాత్రమే పరిమితం. దీనికి కారణం ఆ పచ్చబొట్టు గల స్త్రీలు మతసంబంధమైన కర్మకాండల (Religious Rituals) తో సంబంధం కలిగి ఉండేవారు. నైరుతి సైబీరియాలోని ఎత్తైన పర్వతాలలో 1948లో రష్యా పురాతత్త్వ వేత్తలు (Oncologists) జరిపిన తవ్వకాలలో బయటపడ్డ 2400 సంవత్సరాలకు పూర్వపు మమ్మీల మీద పచ్చబొట్లు రాబందులు, జిగ్రిఫిన్స్ రాక్షసులు, మొదలైన రకరకాలైన జంతువుల, ఆకారాలలో ఉన్నాయి. అవి మంత్రచిహ్నాలు కలిగి ఉన్నాయని రష్యా ప్రజల నమ్మకం. కాని కొన్ని విధాలైన పచ్చబొట్లను మాత్రం కేవలం శరీరాలంకరణాలుగా మాత్రమే ఉపయోగించు కున్నట్లు తెలుస్తుంది. ఈ చిత్రకళ అయినూ (Ainu) అనే దేశదిమ్మరులైన ఆటవిక జాతి వలన జపాన్, చైనా, పాలినేషియా, ఫిలిప్పీన్స్, బోరి, ఆఫ్రికా, అమెరికా దేశాలలోని



ఆటవిక, గిరిజన తెగలో వ్యాప్తిపొంది, అచ్చట నుండి ఇండోనేషియా, భారతదేశం, ఇలా ప్రపంచమంతటా వ్యాపించిందని చరిత్రకారుల అభిప్రాయం.

జపాన్ దేశస్థుల పచ్చబొట్టు (Tatoo) ను గురించి లిఖిత పూర్వకమైన, ప్రమాణికమైన చరిత్ర క్రీ.శ. 297 లో దొరికింది. ఈ పచ్చబొట్లు కేవలం శరీరాలంకరణ కోసమే అని జపాన్ దేశస్థులు అంటారు. వీరు పచ్చబొట్టును శరీరమంతట ఒక కవచంగా పొడిపించు కుంటారు. చైనా దేశస్థులు పచ్చ పొడిపించుకోవడంలో మత ప్రాధాన్యం కనిపిస్తుంది. కాని నాగరికులైన చైనా దేశస్థులలో ఈ పచ్చబొట్టు ఒక అనాగరికమైన చర్య అనే అభిప్రాయం కలదు. ఈ విధంగా వివిధ దేశాలలోని జానపదులు ఈ పచ్చబొట్టు పొడిపించుకోవడంలో వివిధ అభిప్రాయాలు కలిగి ఉన్నారన్నది స్పష్టం. జపాన్‌లో హరీస్ అనే జపాన్ పచ్చబొట్టు పొడిచే చిత్రకారులు ఈ పచ్చబొట్టును అనేక రంగులను ఉపయోగించి ఎన్నో చిత్ర విచిత్రమయిన రూపాలలో చిత్రించి, ఒక కళాత్మకమైన చిత్రకళగా నిలిపారు. దానితో పచ్చబొట్టు ఒక కొత్త మలుపు తిరిగింది. దానిని ఒక చిత్రకళగా గుర్తింపు పొందింది.

భారతదేశంలో కూడ అన్ని రాష్ట్రాలలోను ఈ చిత్రకళకు ఎక్కువగా ఆదివాసుల్లో, గిరిజన, ఆటవిక జాతుల్లో ప్రాచుర్యం పొందింది. వంశలాంఛనాలైన (టోటమ్) జంతువుల చిత్రాలను రంగురంగుల్లో తమ శరీరాలపై పచ్చబొట్టుగా చిత్రించుకుని, వాటిని తమ శరీరాలపై శాశ్వత పరచుకునే ఆచారం నుండి ఈ చిత్రకళ ఆచారపరమైందిగా ఆవిర్భవించింది. బీహారు రాష్ట్రంలో ఈ చిత్రకళకు ఎక్కువ ప్రాముఖ్యం ఉండేది. బీహారు రాష్ట్రంలోని జానపదులకు, అందులోను స్త్రీలకు వారి శరీర భాగాలలో ఎక్కడో ఒక చోట పచ్చబొట్టును తప్పని సరిగా పొడిపించు కోవడం ఆచారం. ఆనాడు పచ్చబొట్టులేని స్త్రీలకు వివాహమయ్యేదిగాదు. ఆ రాష్ట్రంలో పచ్చబొట్టు పొడవడంలో నైపుణ్యం గల స్త్రీలు ఇల్లిల్లు తిరిగి స్త్రీలకు పచ్చపొడిచేవారు. పచ్చపొడిపించుకోవడం ఎంత బాధాకరమైనా ఆ రాష్ట్రంలోని స్త్రీలు ఆనందంగా, ఉత్సాహంగా పచ్చను పొడిపించుకునేవారు. తరువాతి కాలంలో ఆ ఆచారం కనుమరుగైనప్పటికీ ఈ నాటికి పురుషులు మాత్రం తమ ముంజేతులపైన పచ్చ పొడిపించుకోవడం (అతికించుకోవడం) కనిపిస్తుంది.

న్యూజిలాండ్‌లో సమోవా అనే గ్రామంలో గిరిజనులు (Tribes) తమ గుంపుకు అధిపతి ముఖంపైన పచ్చబొట్టు పొడిపించుకునేవాడు. ఆ అధిపత్యం వంశపారం పర్యమయింది. ఆ అధిపతి తన తరువాత తన కుమారుని అధిపతిని చేయడానికి, ఆ కుమారునికి 14, 15 సంవత్సరాల ప్రాయంలోనే అతని ముఖంపైన

పచ్చబొట్టు పొడిపించడం జరుగుతుంది. అప్పుడే అతనికి అధిపతి కాగల అవకాశముంటుంది. న్యూజిలాండ్‌కు చెందిన మావోలీ అనే గిరిజనులు చేసే పచ్చబొట్టు చాలా ప్రసిద్ధి చెందడానికి కారణం వారు వేసే పచ్చబొట్లు కర్ర చెక్కణం వలె ఉండడం. ముఖాలపైన ఉండే పచ్చబొట్ల వలన వారు ఏ వంశానికి చెందిన వారో గుర్తించవచ్చు. అంతేకాక వారు తమ జీవితంలో జరిగిన ముఖ్య సంఘటలను పచ్చబొట్టు ద్వారా తెలియ జేయడం విశేషమైన విషయం.

పూర్వం ప్రపంచంలోని జానపదులు ఈ చిత్రకళను అనేక కారణాల వల్ల చిత్రించుకున్నట్లు తెలుస్తుంది. పచ్చబొట్టు తమ జాతివారిని గుర్తించే వీలును కలిగించడమేకాక, వారికి సమాజంలో ఒక గౌరవాన్ని కలిగించి, ప్రత్యేకంగా అంతస్తును పెంపొందిస్తుందనడం జానవదుల అభిప్రాయం. ఒక సైన్యంలో ఎన్నో విభాగాలుంటాయి. ఒక్కొక్క విభాగానికి ఒక్కొక్క రకమైన గుర్తును పచ్చబొట్టుతో చిత్రించేవారు. అందువల్ల యుద్ధాలలో తమ వారు చనిపోయినా లేక శత్రువుల చేత చిక్కినా గుర్తించేందుకు వీలుగా ఉండేది. పూర్వం రాజులు నేరాల తీవ్రతను బట్టి పచ్చబొట్టును ఆ నేరస్తుల చేతులపై, ఛాతీలపై, ముఖాలపై పచ్చ పొడిపించివారి నిరంకుశత్వాన్ని చాటుకునేవారు. ఆవిధంగా శిక్షింపబడిన నేరస్తులను సంఘం గౌరవించేది కాదు. మరికొందరు తమ మతాన్ని సూచించే ప్రత్యేకమైన గుర్తులను మొత్తం తమ తమ జాతికి సంబంధించిన వాళ్ళందరు పచ్చబొట్టుగా ధరించేవారు. ఏ కారణం చేతనయినా తమ పిల్లలుగాని, స్త్రీలుగాని తప్పిపోయినా లేక శత్రువుల చేత చిక్కినా, వారు ఇతరులెవరికైన కనిపిస్తే వాళ్ళను రక్షించి, ఆ గుర్తును బట్టి ఆ జాతివాళ్ళకి అప్పగించేవారు. కేవలం మనుష్యుల శరీరాలపైనేకాక మేకలు, గొర్రెలు మొదలైన జంతువులతోకలపైన కూడా పచ్చబొట్టును పొడిపించేవారు. దానివల్ల వాటిని గుర్తించడం సులభంగా ఉండేది.

ప్రాచీన కాలంలో పాశ్చాత్య దేశాలలో పచ్చబొట్టును రోగనిరోధకంగా కూడా ఉపయోగించినట్లు మనకు ఆధారాలు కనిపిస్తాయి. 1991వ సంవత్సరంలో ఆసియా, ఇటలీల మధ్య గల పర్వతాల మీద ఒట్జి అనే మంచు మనిషి, అంటే మంచుచేత గట్టిపడిన శరీరాన్ని కనుగొన్నట్లు వార్తా పత్రికలు ప్రకటించాయి. శవాలు చెడిపోకుండా మంచు కాపాడుతుందని అందరికీ తెల్సిన విషయమే. ఆ మంచు మనిషి ఎడమ మోకాలి చర్మంపై 57 పచ్చబొట్లు ఉన్నాయని, 15 సెంటిమీటర్ల పొడవులో ఆరు తిన్నని గీతలు అతని మూత్రపిండం పై భాగం వరకు ఉన్నాయని, ఇంకా లెక్కలేని సమాంతరమైన గుర్తులు కాలిమడిమలపైన ఎన్నో పచ్చబొట్లు ఉన్నాయని, అవి చిత్రించబడిన ప్రదేశాన్ని చూస్తే, బహుశ నొప్పులకు చేసే చికిత్సావిధానం కావచ్చని ఆనాటి వార్తా పత్రికల వలన తెలుస్తుంది.



Broze age: In 1991 a five thousand years old otzi iceman made the head lines of news papers allover the world when his frozen body was discovered on a mountain between Austria and Italy. This is the best preserved of the period, ever found. The skin bares 57 tattoos, across on the inside of the left knee. Six straight lines 15 centimeters long above the kidneys and numerous paralal marks on the ankles. The position of the tattoo marks suggests that they were probably applied for therapetic reasons (Treatment of arthritis).

మన భారతదేశంలోని ఇంచు మించు అన్ని రాష్ట్రాలలోనూ ఆదివాసుల్లో, ఆటవిక, గిరిజనుల్లో ఈ చిత్రకళ ఎక్కువ ప్రాచుర్యం పొందింది. వీరు తమ జాతి చిహ్నాలైన పంది, సింహం, పాము, గద్ద వంటి జంతువుల రూపాలను రంగురంగుల్లో పచ్చబొట్లుగా తమ శరీరాలపై శాశ్వతంగా నిలుపుకునే ఆచారం నుండి ఈ పచ్చబొట్టు ఆచారపరమైన చిత్రకళగా ఆవిర్భవించిందని చెప్పవచ్చు.

భారతదేశంలోని ఆదివాసులు అన్ని రంగుల కన్నా ఎరుపు రంగుకు ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. కారణం ఆ రంగు దూరానికి స్పష్టంగా కనిపించడమే. ఒక ఎరుపురంగే కాక పసుపు, నీలం, నలుపు, తెలుపు రంగులు కూడా ఆదివాసులకు ఇష్టం. వీరు పండుగలు, మతాచారాలు మొదలైన సందర్భాలలో శరీరం మీద రంగులు వేసుకునే ఆచార సంప్రదాయాన్ని పాటిస్తారు. ఈనాటికీ దసరా పండుగ సందర్భాలలో పులివేషాలు మొదలైన వేషాలు వేయడం మనం చూస్తాం. ఆదివాసుల శరీరాలపై రంగులు వేసుకోవడం అనే సంప్రదాయం మరీ ఎక్కువ. ఆ కారణంచేత తమ శరీరాలపై పచ్చబొట్లను పొడిపించుకుని (చిత్రించుకుని) వాటిని శాశ్వతంగా ఉంచు కోవడం అలవాటు. వాళ్ళల్లో అంతస్తు పెరిగిన కొద్దీ పచ్చపొడిపించు కోవడం ఎక్కువగా కనిపిస్తుంది. మరీ ఎక్కువ అంతస్తుకు చేరితే ముఖం మీద, చేతులమీద కాళ్ళమీద, వక్షస్థలంపైనే కాక నాలుకపైన కూడా పచ్చ పొడి పించుకుంటారు. దైహికమైన ఈ విధమైన అలంకరణలు వివేకవంతమైనవి కాకపోవచ్చు, కాని వాటివల్ల ఆదివాసులకొక తృప్తి కలుగుతుంది. తృప్తి పొందడానికి మానవుడు చేసే అనేక ప్రయత్నాలే వివిధ వేష, భూషణాలం కరణలు రూపొందడానికి కారణమయ్యాయి అని డా॥ ఆర్వీయస్ సుందరం తమ "ఆంధ్రుల జానపద విజ్ఞానం" అనే గ్రంథంలో తెలియపరిచారు.

ఈ విషయాలన్నిటివల్ల "పచ్చబొట్టు" మనిషికి సంఘంలో ఒక ప్రత్యేక గుర్తింపు స్థానాన్ని ఇస్తుందన్నది వాస్తవం.

ఇక పచ్చబొట్టును చిత్రించే విధానం, అందుకు ఉపయోగపడే వస్తు సామాగ్రిని గురించి తెలుసుకోవడం అవసరం. పచ్చబొట్టుకు 'పచ్చనాకు' అనే అర్థాన్ని సూర్యరాయాంధ్ర నిఘంటుకారుడు ఇచ్చాడు. పచ్చనైన ఆకురసంతో పచ్చబొట్టు పొడిపించుకుంటారు అని వివరణ కావచ్చు. జానపదులకు ప్రకృతిలో దొరుకు ఆకులు, అలముల ఔషధగుణాలు తెలుసు, వాటిని మనకు వివరించడం వారికి ఇష్టముండదు. పచ్చనాకు రసమే కాక దత్తూర పండు రసంలో పాలను కలిపి, రసాన్ని తయారు చేసుకుని, అందులో సూదులను ఏదుముళ్లనుగాని, ఈతముళ్లనుగాని ముంచి, శరీరంపై పొడిచి, చర్మంలోనికి ఆ రసాన్ని పంపి, అనేకమైన రూపాలను చిత్రిస్తారు. ఈ చిత్రకళకు పచ్చబొట్టు అనే పేరు రావడానికి కారణం పచ్చని ఆకురసం పంపించడం వల్ల, ఆగాయం పచ్చగా ఉండిపోవడం కావచ్చు. ఆ ముళ్ళవల్ల ఏర్పడేగాయాలు మానడానికి చాల సమయం పడుతుంది. ఈ పచ్చబొట్టును చిత్రించుకోవడం చాలా బాధను కలిగిస్తుంది. ఈ చిత్రకళను ఎవరు పడితే వారు చిత్రించలేరు. కొందరికి మాత్రమే వాటిని చిత్రించే నైపుణ్యముంటుంది. తెలంగాణాలో వారిని పచ్చబొట్టు కులం వారినే అంటారు.

ప్రాచీన సాహిత్యంలో పచ్చబొట్టును గురించిన ప్రస్తావన కూడా కనిపిస్తుంది. ప్రాచీన కావ్యాలలో కావ్యనామికలు తమ శరీరాలపై మకరికా పత్రరేఖలు చిత్రించుకున్నట్లు మనకెన్నో ఉదాహరణలు కనిపిస్తాయి. ఆనాటి మకరికా పత్రరేఖలు పచ్చబొట్టును సూచించాయనవచ్చు. అదే విధంగా తెలుగు సాహిత్యంలో కూడా 'పచ్చబొట్టు' ప్రసక్తి కనిపిస్తుంది. ఆంధ్రస్త్రీలు ధరించిన ఆభరణాలను తెలియచెప్పే సందర్భంలో "పచ్చబొట్టు స్త్రీల ముఖము నలంకరించి యుండెను" అని ఖండవల్లి లక్ష్మీరంజనం తన 'ఆంధ్రుల చరిత్ర -సంస్కృతి' అనే గ్రంథంలో తెలిపారు.

పల్నాటి వీర చరిత్రములో మాంచాలకు 'వివిధ రకాలైన ఆభరణాలు పెట్టి, ఫాలమున బొమ్మల రెంటికి మధ్యన కస్తూరి తికముదిద్ది, ముక్కునకు మత్యంపుముంగరపెట్టి, గండభాగముల కస్తూరికా మకరికా పత్రములు వ్రాసి, కాళ్ళకు లత్తరు కండ్లకు కాటుకపెట్టి' అలంకరించారట చెలికత్తెలు.

పరమయోగీవిలాసమనే ద్విపద కావ్యంలో విజయనగర సామ్రాజ్యం లోని భోగంసానుల వేషాన్ని తెలిపిన సందర్భంలో "వెలిపంచె, చెంగావి, పావడ, వెలిపట్టుచీర, జవ్వాది పూసుకొని, చంద్రకాంతపు దువ్వెనతో నెత్తి దువ్వుకుని, జారుకొప్పెట్టి ఆణిముత్యాలపేరు కంఠమున ధరించి, పచ్చ బొట్టొనరించి, గుమ్మడి గింజవంటి నామం పెట్టుకుంది." అని వర్ణించబడింది.



ఇంకా శుకసప్తతికారుడు తన కాలంనాటి సాంఘికాచారాలకు అద్దంపట్టాడు. అతడు సోదె చెప్పే ఎఱుకలసాని వేషాన్ని మన కన్నుల ఎదుట నిలిపాడు. ఆ సందర్భంలో 'సవరని వన్నె రవిక తొడిగి, ముంజేతులపై, ముఖముపై పచ్చబొట్టుకలిగి, కురుమాపుపైటలో చిన్న బుడుతనిపెట్టుకుని, తరతరాలనాటి పుత్తడిపైడి బుట్టనెత్తిన బెట్టి, కనుబొమలనందున నామము నొసట భూతిపూత కనులకు కాటుక కలిగినట్టిది' అని ఆ ఎరుకలసాని రూపాన్ని మన ముందుంచాడు.

ఉదాహరణలన్నీ పచ్చబొట్టును అలంకారం కోసం చిత్రించుకునే వారని స్పష్టమవుతుంది. ఇవేకాక ఇంకా పరిశోధించినట్లయితే మరెన్నో ఉదాహరణలు, మన సాహిత్యంలో దొరుకుతాయి.

## పచ్చ బొట్టు నమ్మకాలు

పచ్చబొట్టు జానపదుల మతం, ప్రేమ, నమ్మకాలను, ఆచారాలను స్పష్టపరుస్తుంది. మన ప్రాచీనులు తమ శరీరాలమీద దేవతా మూర్తుల, దేవత ఆయుధాల, వాహనాల రూపాలలోని పచ్చబొట్టును పొడిపించుకున్నారు. అవి వారి మత సాంప్రదాయాలను తెలియజేస్తాయి. కొందరు తమ చేతులపైన రాముని మూర్తిని, కృష్ణుని మూర్తిని; శివలింగాన్ని, నాగుపామును, గరుడుడు, త్రిశూలం, దుర్గాదేవి దేవతల ఆకారాలను పొడిపించుకున్నారు. వారు వైష్ణవ, శైవ, శాక్తేయ మతాల చిహ్నాలను ధరించడంవల్ల ఆ ప్రజలకు తమ మత సాంప్రదాయాలను పాటించడంలో ఎంత గౌరముండేదో తెలుస్తుంది.

జానపదులు ఆచరించే ఆచారాలలో ప్రాచీన కాలంలోని వంశలాంఛనాన్ని ధరించే స్థితి సూచింపబడుతుంది. అటువంటి ఆచారాలలో పచ్చబొట్టు పొడిపించుకోవడం ఒకటి. మనిషి చనిపోయిన తరువాత ఆత్మస్వర్గానికి పోవాలంటే, నరకంలో పడమని దేవుడు శాసిస్తాడని మన పల్లెసీమల్లోని జానపద స్త్రీలు నమ్ముతారు. ఆ కారణంచేతనే కాబోలు పచ్చబొట్టులేని, పచ్చబొట్లు మీద పాటలు అల్లని జానపదమనస్సు కనిపించదు. "పచ్చబొట్టు చెరిగిపోదులే..." అని పాడుకోని మనసుండదు. ఇంతటి ప్రాధాన్యాన్ని సంతరించుకున్న పచ్చబొట్టు వెనుక ప్రాచీనకాలంలో వంశలాంఛనాన్ని ధరించే రూపమేనని జానపదుల పండితుల అభిప్రాయం.

మన జానపద స్త్రీలు తమ రెండు బొమలమధ్యన చుక్కగా పచ్చ పొడిపించుకుంటారు. అందువల్ల వైధవ్యం కలుగదని వారి నమ్మకం. తాను బ్రతికున్నంత వరకు వైధవ్యంలేక, కలకలకాలం తమ సౌభాగ్యం నిలవాలనే స్త్రీల తాపత్రయం మనకు అర్థమవుతుంది.

మన దేశంలో ఆంజనేయుడు బలానికి గుర్తు. పూర్వం ఈ గుర్తును కేవలం మునీశ్వరులు మాత్రమే పచ్చబొట్టుగా ధరించేవారు. అట్టి మునీశ్వరుల చేత తమ చేతులపై పచ్చబొట్టు చిత్రింపించుకుంటే, మునీశ్వరులు తమ తపోబలాన్ని ఆపచ్చబొట్టు ద్వారా వారికి యిస్తారని జానపదుల నమ్మకం. ఆంజనేయ స్వామి గుర్తును స్త్రీలు ధరించడానికి అర్హులు కారు. కారణం పురుషుల కన్నా స్త్రీలు మానసికబలం కలవారు, ఇంకా వారికి శారీరకబలం అంత అవసరం లేదనే కారణం కావచ్చు. జానపదులు తాము చనిపోయిన తరువాత దేవుని దగ్గరకు పోతే నాకేమి తెచ్చావని అడిగితే ఈ పచ్చబొట్టును తెచ్చానని చెప్పితే దేవుడు సంతోషిస్తాడని నమ్ముతారు. ఇంకా తాము చనిపోతే సిరిసంపదలేవీ తమవెంట రాకపోయినా తమ వెంట వచ్చేది ఒక పచ్చబొట్టేనని నమ్ముతారు. అందువల్లనే జానపదులు పచ్చబొట్టును చిత్రించుకోవడానికి ఎంతగానో ప్రాముఖ్యాన్ని ఇస్తారు.

జానపదులు తమ ప్రణయానికి, స్నేహానికి నిదర్శనంగా చెరిగిపోని, శాశ్వతంగా నిలిచే పచ్చబొట్లు తమ చేతులమీద చిత్రించుకునేవారు. జానపద స్త్రీలు తమ భర్తలపేర్లను తమ ముంజేతులపై పచ్చబొట్టుగా ధరించి, మురిసి పోవడం కనిపిస్తుంది.

ఇంకా తమ అందానికి మెరుగులు దిద్దుకునేందుకు తమ కనుబొమల మధ్య, కణతలపైన, చెంపలపైన, గదుమలపైన చుక్కలుగా పచ్చబొట్లను చిత్రీకరించు కోవడమే కాక, దృష్టిదోషం కలుగకూడదనే నమ్మకం కనిపిస్తుంది. ఈనాడు నాగరికులు పచ్చబొట్టు స్థానంలో కాటుక చుక్కను పెట్టుకుని దిష్టిదోషం తగులకుండా ఉపయోగించుకుంటున్నారు.

పచ్చబొట్టు పొడిపించుకోవడంలో వ్యాధినిరోధక చికిత్స కలదని మన జానపదుల నమ్మకం. జానపద వైద్యవిధానంలో పసర్లు వాడడం, కాల్పులు వేయడం, విబూదులు, రక్షరేకులు కట్టడం, దేవతలకు ముడుపులు, బలులు చెల్లించడం అనే విధానాలు అమలులో ఉన్నాయి. ఆనాడు పచ్చబొట్టు పొడిపించుకోవడం నేటి అక్యుపంచర్ వైద్యచికిత్స వంటిది. సాధారణంగా తగ్గిపోని నొప్పులకు మందుగా పచ్చపొడిపించుకునే ఆచారం కనిపిస్తుంది. అంటే 'ఆక్యుపంక్చర్' వైద్యపద్ధతికూడా జానపద వైద్య పరిణామమేనని నొక్కి చెప్పవచ్చు. చాలాకాలం నుండి తగ్గిపోని నొప్పులను, మోకాళ్ళ నొప్పులను తగ్గించుకోవడానికి సామాన్యంగా పచ్చబొట్టును పొడిపించుకునే ఆచారాన్ని పాటిస్తామని జానపదులు తెలియచేశారు. ఈ పచ్చబొట్లు అందమైన ఆకారాలలో ఉండి, రోగనిరోధకంగా పనిచేస్తుందని తెలుసుకున్న జానపదులను జ్ఞానపదులు కారని మనం అనగలమా?

ఈ నమ్మకాలను అడ్డుపెట్టి శరీరానికి ఆరోగ్యప్రదమైన ఆచారాల పేర ఆచరించడం చూస్తే, మన పూర్వీకులు ఏది చేసినా, ఎందుకు చేసినా అందులో ఏదో ఒక హితం దాగి ఉంటుందని తెలుస్తుంది. ఆ ఆచారాలను ప్రభుసమ్మితాలుగా ఎంచి, ఏ అడ్డుప్రశ్నలు వేయక, గుడ్డిగా ఆచరించడమే జానపదులు చేసిన, చేస్తున్న, చేయబోయే కర్తవ్యం.

ఆనాడు అంటే ప్రాచీన కాలంలో అనుకోకుండా ఏర్పడ్డ ఈ జానపద చిత్రకళకు ఈ నాడు అంటే ఈ రాకెట్, కంప్యూటర్ యుగసమాజంలో ఈ కళకు ఉన్న స్థితిని తెలుసుకోవలసిన అవసరం ఉంది.

మొదట పచ్చబొట్టు ఆచారపరమైన చిత్రకళగా పుట్టి, ఆ తరువాత నాగరికుల అలక్ష్యానికి తలొగ్గి, తిరిగి ఈ ఆధునిక కాలంలో నాగరికులచే, అందులో యువతచే ఆదరింప బడేస్థాయిని పొందింది.

అమెరికా వంటి సంపన్న దేశంలో యువత తమ శరీరాలపై అంటే వీపు, ఛాతి, చేతులు, కాళ్ళమీద పచ్చబొట్లను రకరకాలైన ఆకారాలలో పొడిపించుకోవడం, అతికించుకోవడం, ఈనాటి ఫ్యాషన్‌గా మారింది. ఒక్క పాశ్చాత్య దేశాలలోనేకాక మన భారతదేశంలో, తెలుగు దేశంలో కూడా యువతకు పచ్చబొట్టు ఒక ఫ్యాషన్‌గా మారింది. ఈనాడు సాంకేతిక పరిజ్ఞానంతో అన్ని జానపద కళలు, కళారూపాలలాగే వివిధమైన రంగు , హంగులతో అనేక రకాల రూపాలలో, యువత శరీరాలపై ఈ పచ్చబొట్టు అనే చిత్రకళ కూడా సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంకేతిక ఒత్తుడులకు లోనై తన ఉనికి మాసిపోకుండా కాపాడబడటం విశేషం.

ఈనాడు వ్యాపారపరంగా పచ్చబొట్టును తయారు చేసిన సైకిలు, మోటర్ల ఆకారంలోని యువకుల వీపుల మీద, తొడపైన పచ్చబొట్లుగా చిత్రించి ప్రచారం చేస్తూ, ఈనాటికీ స్త్రీని తమ వ్యాపార సాధనంగా ఉపయోగించుకోవడం కడుశోచనీయం.

ఈనాడు మన దేశంలో బ్యూటీ పార్లలో ఈ పచ్చబొట్ల ప్రదర్శనలు ఏర్పాటు చేస్తున్నారు. తద్వారా ఎంతో కొంత ఆర్థిక సహాయం ప్రజల నుండి పొందడం

స్పష్టం. కానీ ఈ ఆధునిక పచ్చబొట్ల వలన కొన్ని సమస్యలను కూడా ఎదుర్కొంటు న్నారు. మన భారతదేశంలో, మన తెలుగు దేశంలో కూడా బ్యూటీ పార్లలలో ప్రచార సాధనంగా పచ్చ బొట్టు కూడా ఉపయోగపడు తుంది. కొన్ని బ్యూటీపార్లర్లు పచ్చబొట్టును ఫ్యాషన్ షోలుగా నిర్వహిస్తున్నాయి.

ప్రాచీన కాలంలో చచ్చేవరకు శాశ్వతంగా ఉండే పచ్చబొట్టు ఆధునిక వైద్యవిధానం మార్పిడితో నూతన రూపాలను పొందుతున్నది. గతంలో వాటిని చెరిపివేసి, తిరిగి తమ ఇష్టం వచ్చిన రూపాలను చిత్రించుకోవడం చాల అపాయంతో కూడుకున్న ప్రక్రియ. అందువలన పచ్చపొడిపించుకునేవారు ఒకటికి పదిసార్లు ఆలోచించి పచ్చ పొడిపించుకోవడం మంచిదని.

ఇంకా ఈనాడు పచ్చబొట్టు కోసం ఉపయోగించే రంగులను రసాయ నాలతో తయారు చేస్తున్నారు. వాటిని చర్మంలోనికి పంపితే, లేనిపోని చర్మ వ్యాధులను ఆహ్వానించడమే అవుతుందని ఈనాటి 'టట్టూ చిత్రకారులు' యువతను హెచ్చరిస్తున్నారు.

ఈ విధంగా ఒకనాడు యాదృచ్ఛికంగా తగిలిన గాయం వల్ల చర్మంపై ఏర్పడ్డ మచ్చ ఈనాడు కేవలం సౌందర్య సాధనంగా, ప్రచార సాధనంగా ఉపయోగ పడుతూ, తన ఉనికిని కాపాడుకోవడం విశేషం.

## ఉపయుక్త గ్రంథాలు


1. తెలుగు జానపద గేయాలు : డా॥ నాయని కృష్ణకుమారి
2. జానపద విజ్ఞానం : డా॥ ఆర్వీయస్ సుందరం
3. తెలుగు జానపద సాహిత్యం సంప్రదాయాలు: డా॥ సి. వసుంధర
4. తెలుగు జానపద కథలు : డా॥ కె. సుమతి
5. ఆంధ్రుల చరిత్ర సంస్కృతి : ఖండవల్లి లక్ష్మీరంజనం
6. కొల్లేటి వైద్యం : జానపదం, మార్చి 1981 సంచిక
7. http://www.artelino.com/artieles/japanese-tattoo-art.asp
8. www world wideweb : http://www.desinboom.com/History/Tattoo/history-html


# మారుతున్న సామాజిక స్థితిలో జానపద ప్రదర్శనకళ- చిందు భాగవతం : నాడు - నేడు


-డా॥ జి. అరుణకుమారి
సైంటిస్ట్-బి, తెలుగు శాఖ,
హైదరాబాద్ విశ్వవిద్యాలయం, హైదరాబాద్


1846 ఆగష్టు 22న విలియం జాన్‌థామస్ అనే ఆంగ్లేయుడు ఆంబ్రోస్ మర్టన్ అనే కలం పేరుతో 'ది అథీనకమ్' అనే పత్రికలో తొలిసారిగా Folk lore అనే పదాన్ని సూచించారు. సుమారు 162 సంవత్సరాల క్రితంనాటి మాట జానపద పరిశోధనకు మూలమయ్యింది. జనపదం, జానపదం అనే పదాలు మన సాహిత్యంలో భిన్నార్థాలలో ప్రయోగించారు. కవులను బట్టి ఆయా కాలాదులను బట్టి జన, జాన పదాలలోని హ్రస్వ దీర్ఘాల ననుసరించి తొలి మలి రూపాలుగా నిర్ధారించవచ్చు. 'భవేజ్జనపదో జానపదోపి జనదేశయోః' అని విశ్వనిఘంటువు (ఓగేటి అచ్యుత రామశాస్త్రి) తెలియజేస్తుంది. జనులకు, దేశానికి ఈ రెండు పదాలను ప్రయోగించారన్న విషయం విదితమవుతుంది. 'ఉపస్తువంతి దేవం పౌర జానపదాః' అని భవభూతి ఉత్తరామ చరిత్ర నాటకంలో పేర్కొన్నారు. పురవాసులు గ్రామవాసులనే భావంతో ప్రయోగించాడు. మన నిఘంటువులు జానపదము అనే పదానికి మండలము, దేశము, పల్లెటూరు (ఆంధ్ర వాచస్పత్యము -1938) అని, జనులుండు తావు, గ్రామము, పల్లె (నానార్థ రత్నమాల) అని, దేశము (కేశవమిశ్రుని నానార్థార్ణవ సంక్షేప నిఘంటువు) అని, దేశము, గ్రామము, జనులుండు చోటు (శబ్దార్థదీపిక 1956) అని వివరిస్తున్నాయి. నాలుగవ శతాబ్దానికి చెందిన చాణక్యుడు జనపదమంటే గ్రామమని, కులమంటే కుటుంబమనే అర్థంలో ప్రయోగించాడు. కాళిదాసు మేఘసందేశంలో జనపదం అనే పదానికి పల్లె, దేశమనే అర్థాలలో ప్రయోగించాడు. ప్రీతి స్నిగ్ధైర్జనపద వధూలోచనైః (జనపద = పల్లె), బ్రహ్మావర్తం జనపదమథచ్ఛాయయా (జనపదం = దేశం) అని తెలియ జేస్తున్నాయి.

ప్రపంచ జానపద దినోత్సవాన్ని 22 ఆగష్టున జరుపుకోవటం విశేషం. మదర్స్ డే, ఫాదర్స్ డే, ఫ్రెండ్‌షిప్ డే అని మానవ సంబంధాలు వ్యాపార సంబంధాలవుతున్న

రోజులలో మన సంప్రదాయాన్ని మన సంస్కృతిని కాపాడుకునే లక్ష్యంతో నేడు విశ్వవిద్యాలయాలు, పరిషత్తులు ముందుకొచ్చి కళలను ప్రోత్సహిస్తున్నాయి.

జానపద ప్రదర్శన కళలు నాడు-నేడు అనేది ప్రస్తుతాంశం. జానపదులంటే సామాజిక సముదాయమని, ప్రకృతిని ఆరాధించేవారని, నాగరిక ప్రభావానికి దూరమైన వారని, ఎక్కడున్నా సంప్రదాయాన్ని కాపాడే సామాజిక సముదాయమని, మానవ సంఘ సంస్కృతే జానపద విజ్ఞానమని పలువురు పలు అభిప్రాయాలను వ్యక్తం చేసారు. మారేకాలంతోపాటు కొన్నినిర్వచనాలు మారుతూ వచ్చాయి. ఎక్కడున్నా సంప్రదాయాన్ని కాపాడే సామాజిక సముదాయమే జానపదులు. జానపదులు ప్రదర్శించే జానపద కళలు మన సంస్కృతికి పుట్టినిల్లు. జానపద కళారూపాలు సామాజిక స్వరూపాన్ని ప్రతిబింబిస్తాయి. వినోదాన్ని విజ్ఞానాన్ని కలిగించే ఈ రూపాలు కులాచారాలను, మతాచారాలను, సంప్రదాయాలను, కట్టుబాట్లను, ఆచార వ్యవహారాలను విశ్వాసాలను తెలియజేస్తాయి. జానపద కళల ప్రదర్శనలో జాతి జీవనం, జాతిలో జాగృతి, అస్తిత్వపోరాటం కనిపిస్తుంది. జానపద విజ్ఞానం 'మానవ సంస్కృతికి మూలం'. మానవ జాతి పరిణామ క్రమాన్ని గమనిస్తే అందులో అధిక భాగం ఆదిమ దశనుంచి పైకి పెరగటానికి సరిపోతుంది. యంత్ర యుగం నుంచి ఈనాటి వరకు వచ్చిన అభివృద్ధి పదోవంతు ఉండదు. నేటి నాగరికతకు ఆనాటి సంస్కృతి పునాది.

**మారుతున్న సామాజిక స్థితిలో జానపద ప్రదర్శన కళ-చిందు భాగవతం-కళాకారుల జీవితం**

చిందు భాగవతాన్ని ప్రదర్శించే కళాకారులను చిందోళ్ళు, సిందోళ్ళు అని వ్యవహరిస్తున్నారు. వీరు మాదిగ ఆశ్రిత కులాలవారు. మాదిగలను ఆట పాటలతో వినోదింపజేస్తూ యాచించేవారు. సంచార జీవనం చేస్తూ భిక్షుక వృత్తి కలిగి కళారూపాలను ప్రదర్శించేవారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వీరిని షెడ్యూలు కులాలుగా గుర్తించింది. తెలంగాణలోని అన్ని జిల్లాలలో (నిజామాబాదు, వరంగల్, నల్గొండ, మెహబూబ్‌నగర్, మెదక్, అదిలాబాదు, కరీంనగర్, ఖమ్మం, రంగారెడ్డి, హైదరాబాదు)లో ఈ కులాలవారు ఉన్నారు. చిందు ప్రదర్శన కళ ఆహార్యాభినయాది ప్రదర్శనల్లో యక్షగానంలా ఉండటం వలన ఈ కళను చిందు యక్షగానమని అన్నారు.

చిందు భాగోతానికి పేరు రావాలని చిందు యక్షగానం అని అన్నారు. భాగోతం అన్నా యక్షగానం అన్నా రెండూ ఒకటే. తేడా ఏమీ లేదు. దరువులను అనుకూలంగా మార్చుకుంటారు.

(నేను చిందుల ఎల్లమ్మను, డా. కె.ముత్యం)



ఎటునుండి ఎటు సంక్రమించినా చిందు నృత్యం ప్రధానంగా జానపదులదే. ఆ చిందుల్లోని వైవిధ్యమే యక్షగానంలోని అడుగుల్లో కనిపిస్తుంది. ఈ చిందులే యక్షగానంలోని జానపదత్వం.

(ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి, యక్షగానం జానపద రూపకం)

చిందు మాదిగలు ఆడే ఆట చిందు భాగవతం. చిందు భాగవతం ఆడేవారిని చిందు భాగవతులు అని, పగటివేళ ఎక్కువగా ప్రదర్శనలిచ్చేవారు కాబట్టి పగటి భాగోతం, పగటి వేషాలు అని వ్యవహరించారు.

పాటల బాణీలు, దరువులు యక్షగానాన్ని పోలి ఉంటాయి. ఒకరకమైన అడుగుల విన్యాసాన్ని నృత్య విశేషాన్ని ప్రదర్శించటం వలన వీరిని చిందులవాళ్ళని వ్యవహరించారు. మాదిగలను ఆశ్రయించి జీవించే వారు కాబట్టి చిందు మాదిగలని అన్నారు. వీరు ఊర్వశి వారసులని, భోగం మాదిగలని, మాదిగ ఆశ్రితులని వ్యవహరిస్తారు. సైరంధ్రి పదంనుండి సింధు, సిందోళ్ళు అనేపదాలు వచ్చాయని అంటారు.

## చిందు పదస్వరూపం

చిందు అనే పదానికి చిందు లేయటం, చిందు తొక్కటం అనే పర్యాయ పదాలు కనిపిస్తాయి. ఇది అభివ్యక్తి మార్గంగాను సూచింపబడింది. కోప భావ ప్రకటనకి, భావస్ఫోరకానికి, expression outlet కి కూడ అన్వయమవుతుంది. లయబద్ధమైన అడుగుల విన్యాసానికి 'చిందు' పదాన్ని ప్రయోగించారు, తమిళంలో సింద్ (ప్రత్యయం చేరని రూపం) అనే పదానికి ఒలుకుట అనే అర్థం ఉంది. భావ ప్రవాహం, పద విన్యాసం, పాద విన్యాసం అనే అర్థాలలో ప్రయోగించారు.

## నిఘంటు అర్థాలు :

చిందు - ఒలుకు, ఒక నాట్యం, బిందువు, అలక, ఆగ్రహం, ఒకరకం పాట (శబ్దరత్నాకరం).

విశేషణం - పడిన, క్రియ - ఒలుకు, రాలు, పోవు , వ్యాపించు, వ్యయం, ప్రసరించు

ఉదా: మాతంగ నాట్యనామంబగు చిందు (ఆంధ్ర భాషార్ణవము నిఘంటువు, నుదురుపాటి వేంకనార్యుడు)

ఉదా: ఒడలుబ్బ నిక్కి ముందటి యడుగులు ధరనూది చిందు నలబలము నకున్ (మనుచరిత్ర, 4,53)

ఉదా: గీతంబు, దరువు, జక్కిణి, చిందు మొదలుగా ఒక్కొక్క వర్ణంబు నుగ్గడించి - (సూర్యరాయాంధ్ర నిఘంటువు)

## చిందు భాగోతం నిర్వచనం :

భావ ప్రకటనతో ఒడలు తూలినట్లుగా వేసే అడుగులతో సంగీత వర్ణ విశేషంతో (రాగం, తాళం, దరువు) చేసే ఒక నాట్యకళారూపం.

**జనాభా** : నూటికి 20 శాతం

**ప్రాంతం** : అదిలాబాదు, నిజామాబాదు, కరీంనగర్, మెహబూబ్‌నగర్, వరంగల్, మెదక్, ఖమ్మం, నల్గొండ, రంగారెడ్డి, హైదరాబాదు.

**చారిత్రక నేపథ్యం** : చిందు అనేది ఒక కాలంలో సంబరం, వేడుక, పండగలా జరిగేది. ఇది హావ భావాల వ్యక్తీకరణ. పంటలు ఇంటికి వచ్చే సమయంలో పంటపండించిన వారంతా కోతలు సమయంలో ఆడుతూ పాడుతూ చేసుకునే పండుగ. వ్యవసాయ సంబంధమున్న ఈ కులం క్రమేపి భూములకు దూరమై పశువుల్ని మేపుతూ అంటరాని వారుగా నిలిచారు. ప్రతి ఏడాది జరిగే సంబరంగా చిందు కళారూపం ప్రదర్శన కళగా ఒక హక్కుగా ఏర్పడింది. సంబరంగా పండుగగా ఉన్న చిందు సమ్మతి రూపం నుండి అసమ్మతి రూపాన్ని సంతరించుకుని ఉంటుంది. వీరికి జీవనాధారమైన భూమికి, నాగలికి, గేదెలకి దూరమై వీటిని సొంతం చేసుకున్న వారిపై తిరుగుబాటుగా ఏర్పడిన కళారూపమే చిందుకళ. ఊరి మధ్యలో తమ కుల పురాణాన్ని మాదిగల వినోదార్థం ముందుగా ప్రదర్శించి ఆపైన మిగిలిన కులాల వారిముందు ప్రదర్శించి వారిని ఆశ్రయించి జీవనం సాగిస్తారు. మాదిగ ఆశ్రిత కులాల ప్రదర్శన కళగా, చిందు భాగవత కళగా తలెత్తి జాతిలో జాగృతిని, చైతన్యాన్ని, కుల ఆధిక్యతని కలిగించటమే ఈకళ లక్ష్యంగా కలిగిఉంది. ఉత్పత్తి సంబంధం వలన పరస్పరం ఆధారపడి ఉండటం వలన వీరు ప్రదర్శించే అసమ్మతిని, వీరు చేసే విమర్శలను ఇతర కులాల వారు ఎదుర్కొనక తప్పలేదు. కుల భావజాలాన్ని నిరంతరం చెప్పటానికి ఉపయుక్తమయ్యే ప్రచార సాధనం చిందు కళారూపం. ఆంధ్రప్రదేశ్‌లో 150 జానపద కళలు ప్రసిద్ధమైనవి. అందులో చిందు భాగవతం ఒకటి. ఇది సంగీత సాహిత్య నృత్య కళారూపం.

## చిందు ప్రదర్శన నియమాలు :

కులకట్టుబాటు ననుసరించి చిందువాళ్ళు దాతృకులాలను (మాదిగలను) ఆశ్రయించి మూడు లేదా రెండు భాగోతాలను ప్రదర్శించిన తరువాత జాంబపురాణం చెప్పి తీరాలన్నది కట్టడి.



**ప్రదర్శన కాలం** : సంవత్సరంలో ఎనిమిది నెలలు చిందు భాగోతం ఆడతారు. రాత్రి తొమ్మిది గంటలకు మొదలైతే తెల్లవారువరకు ప్రదర్శిస్తారు. పొద్దున్న పదిగంటలకు ప్రారంభమయితే సాయంత్రం 6,7 గంటల వరకు ప్రదర్శిస్తారు.

**వస్తువు** : ఎల్లమ్మకథ, చెంచు భాగోతం, సారంగధర, సుగ్రీవ విజయం, సతీసావిత్రి, సుందరకాండ, కృష్ణ భాగోతం, ప్రహ్లాద చరిత్ర, మైరావణ, మాంధాత చరిత్ర, రామాంజనేయ, సతీ అనసూయ, వీరాభిమన్య మొదలైన పౌరాణిక ఇతివృత్తాలు ప్రదర్శనీయాలు. మధ్య మధ్య ప్రజల సమస్యలను సందర్భోచితంగా చొప్పిస్తూ సామాజిక ప్రయోజనాన్ని ఆశించే కళగా జానపదకళలు ప్రదర్శింపబడుతున్నాయి.

**పాత్రలు** : కుటుంబ సభ్యులే కళాకారులు. ఉమ్మడి కుటుంబాలుగా ఉండి బృందాలుగా ఏర్పడతారు. ఈ బృందాలని మేళాలని అంటారు. సుమారు యాభై మేళాలు / దళాలు చిందు నృత్యాన్ని ప్రదర్శించేవారు నిజామాబాదు జిల్లాలో ఉన్నారు.

**వాద్యాలు** : తబలా, హార్మోనియం, తాళం, గజ్జెలు, పుంగి (ఆనపకాయ వాయిద్యం పూర్వం ఉండేది), డప్పు

**తాళం** : ఆట, ఆది, రూపక తాళాలు ప్రసిద్ధమైనవి. గతి ప్రధానాలైన దరువులు ఉంటాయి. పాటగతికి ప్రాధాన్యమిచ్చి నడిచే ఆవృత్తాలు.

**రాగం** : భూపాలం, కాంభోజి, రూపక, మోహన, అసావేరీ రాగాలతో పాడతారు. సుత్తిగంతు, కత్తెర అడుగు, కుంగి ఒప్పెనం, చక్రాలు అడుగులు ఉంటాయి.

**ఆభరణాలు** : బూరుగు కట్టె కిరీటాలు, భుజకీర్తులు, సూర్యకిరీటాలు, శంఖ చక్రాలు, మకర కుండలాలు, కంఠసారె, చేతి పద్మాలు మొదలైనవి పురుషుల ఆభరణాలు. సర్పజడ, చంద్రవంక జడ, బాదం జడ, అవుతోక జడ అనే కిరీటాలతో బాటు మల్లెదండలు, గల్లపట్టి, బోడుచిక్కు, దండతాయెత్తులు, గాజులు, కంఠ హారాలు, సిగ రేకులు, సిగకుప్పె, చిక్కుతల మాడుబిళ్ళ, చంద్రవంక, పాపెడ జోడు, చెంప చిలుకలు, చెక్కుడు గొలుసు, షాంపు జడ, హంస కలువలు, నడిపి కలువలు, సాదా కలువలు, కుర్లు చిలకలు, గొడుగు మీద చిలక, మకర కుందనాలు, గున్నలు, కంఠసరి, చెక్క బవిలీలు స్త్రీలు ధరించే ఆభరణాలు. ప్రకృతి ప్రసాదించిన వస్తు సంచయాన్ని రకరకాల చెట్ల రసాలతో మేకప్ సామగ్రిని తయారు చేసుకుంటారు. వారి ఆభరణాలను వారే తయారు చేసుకుంటారు.

**ప్రదర్శన రంగం** : వీధి. వీధిలో ఆరుగుంజలు పాతి, పచ్చటాకులతో చాందిని వేసి, ముంగిట తెరకడతారు. ప్రదర్శన తరువాత ధాన్యం, వస్త్రం, దూడ, దుక్కి, పెయ్య, పడ్డ, భూమి మొదలైనవి దానంగా స్వీకరరిస్తారు.

ప్రదర్శన ఆరంభం : వినాయక, సరస్వతి ప్రార్థనలతో ఆరంభమైన ప్రదర్శన మంగళహారతితో ముగుస్తుంది.

ప్రేక్షకులు : దాతృకులాలకు ప్రదర్శించిన తరువాత అన్ని కులాల వారికి ప్రదర్శిస్తారు.

ప్రయోజనం : బతుకు తెరువుగా, వృత్తి ధర్మంగా, సంప్రదాయ రక్షణగా కొనసాగిన కళలు నేడు కళాపోషణ, ప్రజా రంజకత్వం, కులప్రాశస్త్యం, సౌందర్య దృష్టి కోసం ప్రదర్శింపబడుతున్నాయి. పురాణాల ప్రదర్శన వలన అంటరానితనం తొలగిపోయే కాలం దగ్గర పడిందని విశదమవుతుంది. జాతిజీవనం, జన జాగృతి, జనచైతన్యం ప్రధాన లక్ష్యాలుగా ప్రదర్శనలు కొనసాగుతాయి.

**చిందు భాగోతం కళాకారుల జీవితం - మారుతున్న సామాజిక స్థితి**

1. కాలం మారింది. ప్రజల అభిరుచులు మారాయి. నేటి ప్రయాణ సౌకర్యాలతో ప్రచార ప్రసార మాధ్యమాలలో ప్రపంచమంతా కంటిముందే ప్రత్యక్షమవుతుంటే గిరిగీసుకున్న ఎల్లలు విశ్వవ్యాప్తమయ్యాయి. వేగవంతమైన నాగరిక జీవనంలో సమయం ఒక సమస్యగా మారింది. చిందు భాగోతం సుమారు ఆరు ఏడు గంటలు పాటు కొనసాగేది. అంత సమయాన్ని వెచ్చించే అవకాశం లేకపోయింది. (దీర్ఘ)కావ్యాల స్థానంలో మినీ కవితలు, టుమ్రీలు, హైకూలు, నానీలు చోటు చేసుకున్నట్టుగా జానపద ప్రదర్శన కళల స్వరూపంలో, విస్తృతిలో కుదింపు అవసరం.
2. సినిమాలు, టీవీలు, సిటీ బతుకులు ధాటికి గ్రామకళలు నిలదొక్కుకోలేక పోతున్నాయి.
3. జానపద కళారూపాలు అత్యంత ప్రాచీనమైనవి. ఇవి పండిత పామరులను చిన్నపిల్లలను అమితంగా ఆకర్షించాయి. ప్రజా జీవనంలో జానపద కళలకున్న ప్రాముఖ్యాన్ని సాహిత్యంలో మనం గమనించవచ్చు. బుద్ధ చరిత్రలో, దానికి అనువాదమైన లైట్ ఆఫ్ ఏషియాలోనూ జానపద కళల ప్రస్తావన కనిపిస్తుంది. పండిత పామరులను ఆకర్షించిన పాములాట, దొమ్మరాట, బుట్టబొమ్మలు.... వంటి ఎన్నో కళలు పేర్కొనబడ్డాయి.
4. నేడు జానపద ప్రదర్శన కళలు ఉల్లాస కార్యక్రమాలై కులమత ప్రాంతాల ప్రమేయం లేకుండా జాతీయ స్థాయిలో ప్రదర్శింపబడుతున్నాయి. అయినా అది స్వల్పమాత్రమే. దానివలన జానపద కళలకు చెప్పుకోదగ్గ రాణింపు కలుగదు. అవి ప్రచార మాధ్యమాలైనందున కళాకారుల జీవితాలు నడివీధికెక్కాయి.



5. పూర్వం కళాకారుల బ్రతుకు తెరువుకు లోటుండేది కాదు. పిల్లలను కళాకారులుగా తీర్చిదిద్దాలనుకునేవారు. పెద్దల బాటలోనే పిల్లలు నడిచారు. కళాలారుల బిడ్డలు పొట్ట గడవని కళాకారులుగానే జీవించాల నేది లేదు. కూటి కొరకు కోటి విద్యలు ఒకనాటిమాట కూటి కొరకు కంప్యూటర్ విద్యలు నేటి మాట. కాబట్టే మార్పు జీవనానికి సహజం. ప్రగతి మార్పును కోరుకుంటుంది. పాతకొత్తల మేలు కలయిక సమన్వయ జీవనానికి పునాది. నిరక్ష్యరాస్యులైన జానపద కళాకారులు తమ పిల్లలు అక్షరాస్యులు కావాలని చదువు బాటవైపు పయనం సాగించాలని ప్రయత్నిస్తున్నారు. నిరక్షరాస్యులు కావటం వలన పిల్లలను తీర్చిదిద్దలేక పోతున్నారు.
6. గ్రామాలకు దూరంగా ఉండి ఇతరులతో సహజీవనం లేకపోవటం వలన వీరి జీవన విధానం కట్టుబాట్లు గ్రామీణులకు తెలియకుండా జీవించాలనే ప్రయత్నంలో కొన్ని అవకాశాలను పోగొట్టుకున్నారు. పిల్లలను బడిలో చేర్పించి వాళ్ళను 'చక్కనోళ్ళుగా' చేద్దామనే ఆలోచన కలిగింది.

(బుర్ర జంగందర్శిని, డా. ఎన్.ఆర్. వెంకటేశం)

7. జానపద కళలను ప్రోత్సహించటానికి మాన్యాలుండేవి. అందులో పండే ధాన్యాన్ని కళాకారుల కోసం వ్యయం చేసేవారు. ఈ ఉమ్మడి మాన్యాలు రాజులతో అంతరించిపోయింది.నాగరిక సమాజం ఈపద్ధతికి స్వస్తి పలికింది. కోతికి కూడ కోతిమాన్యాలుండేవి. ఈ కళాకారులు నేడు తినడానికి తిండి కట్టుకోడానికి బట్ట, ఉండటానికి ఇల్లు లేక దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు. కళకోసం యాచించటం, అస్పృశ్యత, నిరక్షరాస్యత, దారిద్ర్యం, జనాదరణ లేకపోవటం, సమాజంలో వ్యక్తులుగానే కాదు కళాకారులుగానూ గౌరవం లేకపోవటం వంటి సమస్యలను ఎదుర్కొంటున్నారు.
8. జానపద ప్రదర్శన కళాకారులు 6 గంటల పాటు చెక్క ఆభరణాలను, అట్టలను ధరించి, భరించి ముఖానికి రంగులు పులిమి చిందులు వేస్తూ ఆయా కులాలవారిని రంజిల్ల జేస్తూ వినోదాన్ని చేకూరుస్తున్నారు. కళకోసం కన్యాశుల్కం ఇచ్చి ఇద్దరు ముగ్గురు భార్యలను వివాహమాడటం, ఉమ్మడి

వ్యవస్థగా / మేళాలుగా ఏర్పడి కళాప్రదర్శనలు చేస్తున్నారు. నేడు సమష్టి భావన పోయి వ్యష్టి కుటుంబాల ప్రాధాన్యం పెరిగింది.

9. సమైక్యతా భావంతో ఆటపాట నాటకాలు పండగలు వేడుకలు జరిగేవి. నేడు రాజకీయ దాడికి, సాంస్కృతీకరణకు లోబడి మారిపోతున్న సమాజంలో స్వార్థం చోటు చేసుకుంది.

10. భాగోతం ప్రదర్శిస్తే వర్షం కురుస్తుందని, ఊరికి, పంటలకు మంచిదని విశ్వసించేవారు. ఎల్లమ్మ ముఖం కడిగితే పంటలకు దీవెన అని భావించేవారు. నాగరిక సమాజంలో ఆచారాలు సంప్రదాయాలు, నమ్మకాలు సన్నగిల్లాయి.

11. జానపద కళలు ఆదిమ తత్వాన్ని కలిగిన కళలు, సౌందర్యం ఆనందం జానపద కళల ప్రయోజనం. కళాదృష్టి, సౌందర్య సృష్టి తద్వారా ఆనందానుభూతిని కలిగిస్తాయి.

- (డా. తంగిరాల వెంకట సుబ్బారావు, డా. ఆర్వీయస్ సుందరం, తెలుగు జానపద విజ్ఞానం సమాజం సంస్కృతి సాహిత్యం డా. జి.ఎస్,. మోహన్, జానపద విజ్ఞానం)

12. పిల్లలకు వీటి ప్రాధాన్యాన్ని తెలియచేయాలి. కథలన్నా కళలన్నా ఆసక్తి కనబరచాలి. కథలు చెప్పే అమ్మమ్మలు కరువయ్యారు. ముగ్గులు పెట్టే ముదితలు లేరు. పాటలు పాడే పడతులు లేరు. కళల మీద ఆసక్తిని పెంచుకోవాలి. పిల్లలకి హరీపోటర్ కథలు తెలుసు కాని పంచతంత్రం కథలు తెలియవు. టీవీలకు అంకితమై పోయిన బతుకుల వలన కళలు నిరాదరణకు గురయ్యాయి.

13. కళలు ప్రజలలో దేశభక్తిని, మతాన్ని ప్రచారం చేయటానికి, ఉద్యమస్ఫూర్తికి తోడ్పడుతుంది. వివిధ రకాల వ్యక్తుల గుణగణాల్ని సమస్యల్ని ఈ కళారూపాల ద్వారా ప్రచారం చేయవచ్చు. దాని వలన ప్రజలకు త్వరగా ఆకళింపు కలుగుతుంది. కుటుంబ సంక్షేమం గురించి, వైద్య సంబంధిత విషయాలను గురించి పొదుపు చేయటం గురించి జానపద కళల మూలంగా ప్రజలను విద్యావంతులను చేయటం జరుగుతుంది.

## ప్రదర్శన కళల సంరక్షక పద్ధతులు :

- వినోదాన్ని విజ్ఞానాన్ని వికాసాన్ని కలిగించే జానపద కళలు ప్రజలను చైతన్యవంతులను చేయాలి.



- దారిద్ర్యం, అస్పృశ్యత, నిరక్షరాస్యత, అనారోగ్యం, అధిక జనాభా, వాతావరణ కాలుష్యం వంటి సమస్యలనుండి విముక్తి కలిగించాలి.
- అక్షరాస్యులుగా మారాలి. కళలను సంరక్షించి సంస్కృతిని కాపాడాలి. పిల్లల విద్యాభివృద్ధికై ప్రభుత్వం గృహవసతిని ఆర్థిక సహాయాన్ని అందించాలి.
- పర్యాటక శాఖవారు తోలుబొమ్మలాటల వంటి వినోదాలను ఏర్పాటు చేయాలి. కథాగాన కళాప్రదర్శనలు మొదలైన కళారూపాలను ప్రోత్సహించాలి. ఉదా. గోల్కొండ రాజుల కథనం జానపదకళా ప్రదర్శన మూలంగా నిర్వహించవచ్చు.
- విద్యార్థులకు పాఠ్యాంశాలుగా జానపద కళలను పరిచయం చేసి వాటి వైశిష్ట్యాన్ని, జాతి సంస్కృతిని బోధించాలి. ప్రాచ్య కళలకు ప్రాధాన్యం ఇవ్వాలి.
- పాలకవర్గం ప్రదర్శన కళలను రాజకీయ హంగుల కోసం కాక సామాజిక విలువల కోసం, సమైక్యత కోసం ఆదరించాలి.
- వృద్ధ కళాకారులకు పింఛన్, ప్రభుత్వ సంక్షేమ పథకాలు వంటివి అమలు జరపాలి.
- వాతావరణ కాలుష్యానికి దారితీసే గణేశ ఉత్సవాలకు బదులుగా కళాకారుల జీవనానికి దారి చూపే ఉత్సవంగా మారాలి.
- కళాకారుల చేవృత్తులను ప్రోత్సహించి విక్రయాలను పెంచాలి. రైతు బజారుల్లో ఆ పరికరాలు, గృహోపకరణాలు అందరికీ అందుబాటులో ప్రామాణిక ధరలలో లభ్యమయ్యేట్టు ప్రభుత్వం ప్రోత్సహించాలి.
- పట్టణాలు పెరిగిపోతూ, సమైక్యత సన్నగిల్లుతూ, కళారూపాలు జనజీవనానికి దూరమవుతూ అంతరించిపోయే ప్రమాదం ఏర్పడుతుంది.
- విద్యా విధానంలో మార్పురావాలి. జాతీయ భావం, దేశాభిమానం, హృదయ సంపన్నం కావాలి.
- అన్ని నృత్యాలకు మూలం జానపద నృత్యం. పాశ్చాత్య సంగీతానికి నాట్యానికి మోజు చూపటం కన్నా మన కళలను మనం గౌరవించి సుసంపన్నం చేసుకోవటం ఉత్తమం. అతి ప్రాచీనమైన నాట్యకళను కాదని వేలం వెర్రిగా పాశ్చాత్య నాగరికతను అనుసరించటం హేయమైనది. కళలను ప్రోత్సహించాలి.

- వస్త్రధారణ, ఆభరణాలు వంటి అనేక విషయాలలో మన సంస్కృతిని మనమే కాపాడుకోవాలి. కళ కళకోసమే అనే సిద్ధాంతం - Art for art sake మరుగున పడిపోయింది. ఆధునిక కాలంలో సౌందర్య దృష్టి కొరవడి ఉపయోగ దృష్టి అధికమయ్యింది, use and throw - పనికి వచ్చిందే అందమైనది అనే సంస్కృతి ఏర్పడింది. ఇది యూరప్ సంస్కృతి. మన భారతదేశం ఆత్మరహిత విద్యకు దూరంగా ఉంది.
- జాతి జీవనంలో, విద్యారంగంలో, మానవ పరిణామ వికాసంలో కళల స్థానాన్ని ప్రాధాన్యాన్ని గ్రహించాలి.
- జాతీయ విద్యను పెంపొందించాలి. సౌందర్య(దృష్టి), పునరుజ్జీవనం వైపు దృష్టిని కేంద్రీకరించాలి.
- భారతీయ ఆత్మను కళల మూలంగా మేల్కొలిపి ప్రాచీన సంస్కృతిని, భారతీయ జాతిని, భారతీయ దృష్టిని భారతీయ ముద్రను రూపొందించుకోవాలి.
- ఆంగ్ల బోధనలు, వ్యాపార లక్ష్యాలు, పాశ్చాత్య అనుకరణ పద్ధతులకు స్వస్తి వచనం పలకాలి. మన భారతీయ భాషలకు ప్రాధాన్యం ఇచ్చి ఇతర భాషలను నేర్చుకోవటం తప్పుకాదు. సంపూర్ణంగా పాశ్చాత్య భాషలకు మక్కువ చూపటం తప్పు. విద్యాబోధన మనదై ఉండాలి. విద్యా ప్రణాళిక మనం రూపొందించుకున్నదై ఉండాలి. పిల్లలపై అధిక భారాన్ని మోపకుండా వినోదాత్మక కళలపై ఆసక్తిని చిగురింపజేయాలి. కళల జాతీయ విలువలను గుర్తించాలి.

### ఉపయుక్త గ్రంధసూచి

1. డా. కె.ముత్యం - నేను చిందుల ఎల్లమ్మను.
2. ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి - యక్షగానం జానపద రూపకం.
3. డా. ఎన్.ఆర్.వెంకటేశం - బుర్ర జంగందర్శని.
4. డా. తంగిరాల వెంకట సుబ్బారావు, డా. ఆర్వీయస్ సుందరం - తెలుగు జానపద విజ్ఞానం సమాజం సంస్కృతి సాహిత్యం.
5. డా. జి.ఎస్.మోహన్ - జానపద విజ్ఞానం.

# లంబాడీల పండుగలు - శీత్లా భవాని

- డా॥ సూర్యా ధనంజయ్
అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్

ఆషాడ, శ్రావణ మాసాలు వచ్చాయంటే చాలు లంబాడీలలో ఉత్సాహం ఉరకలేస్తుంది. ఎందుకంటే బంజారాలందరూ ఈ మాసంలో 'శీత్లాభవాని' పూజను, ఆ తర్వాత 'తీజ్' ఉత్సవాన్ని జరుపుకొంటారు. ఒక్కోతండాలలో ఒక్కోరోజు వారి అనుకూలతనుబట్టి ఈ పూజను జరుపుకొంటారు.

పండుగలను సామూహికంగా జరుపుకోవడం లంబాడీల ఆచారం. వారు జరుపుకొనే పండుగల్లోని పూజా విధానంలో ఒక విలక్షణత కన్పిస్తుంది. వారు పూజించే దేవతలు హిందూ దేవతలైనప్పటికీ, పూజించే విధానం ఆటవిక సంప్రదాయం కనిపిస్తుంది.

### ఐతిహ్యం

ఒక సారి శక్తి దేవతలైన ఏడుగురు అక్కాచెల్లెళ్లు నదిలో స్నానమాడుతుండగా ఒక వ్యక్తి అందరికంటే చిన్నదైన శీత్లా భవాని బట్టల్ని తీసుకొని చెట్టెక్కాడు. బట్టలను ఎంతకీ ఇవ్వక పోయే సరికి శీత్లా భవాని ఆకులకు చుట్టుకొని బయటికి వచ్చింది. తన మంత్రశక్తితో అతణ్ణి చెట్టునుంచి కిందికి దింపి, ఇకనుంచి మాకు కాపలాగా ఉండాలని శాసిస్తుంది. అప్పటి నుంచి ఆ ఏడుగురు అక్కాచెల్లెళ్లకు కాపలాకాసే ఆ వ్యక్తిని 'లూంకడియా' అని పిలుస్తారు.

బంజారాలు సంచార జాతికి చెందినవారు, కావున కొత్తగా తండాలు ఏర్పడినప్పుడు వాటికి తూర్పు దిక్కున శీత్లాభవానీని ప్రతిష్ఠిస్తారు. శాశ్వతంగా అలాగే ఉండనిచ్చి సంవత్సరానికి ఒకసారి పూజలు చేస్తారు.

శీత్లా భవానీలను తండా పొలిమేరల్లో ఏదైనా ఒక చెట్టుకింద ప్రతిష్ఠిస్తారు. మధ్యలో ఒక పెద్ద పొడుగాటి రాయిని, ఇరుపక్కలా మూడు చొప్పున ఆరు చిన్నరాళ్ళను భవానీలకు ప్రతీకలుగా నిలుపుతారు. ఎదురుగా కొంత దూరంలో ఒక పెద్ద బండరాయిని 'లుంకడియా' (పోతులింగం)గా ఉంచుతారు.

## శీత్లాస్వరూపం

బంజరాలు శక్తి ఆరాధకులు. తొళ్జా, మాత్రాల్, హింగళా, ధ్వాళాంగర్, కంకాళి, మేరామా, శీతలామాతా - ఈ ఏడుగురు అక్కాచెల్లెళ్ళు శక్తిస్వరూపాలు. వీరందరిలో చిన్నది శీతలామాత. శీత్లామాతకే శీత్లా భవాని అని పేరు. శీత్లాభవానీకి రూపం లేదు. శీతలామాత అంటే 'చల్లని తల్లి' అని అర్థం. ఈమెను గోవులను రక్షించే దేవతగా బంజారాలు కొలుస్తారు.

## శీత్లా మాహాత్మ్యం

శ్రావణ మాసంలో వచ్చే కలరా, మశూచి మొదలైన వ్యాధులంటే బంజారాలకు భయం. ఈ వ్యాధుల కారణంగా తండా వాసులకే కాక గొడ్లకు కూడా ఎన్నో కష్టనష్టాలు కలుగుతాయి. శీత్లాదేవి పూజ ముఖ్యంగా పశువులను రక్షించడానికి ఉద్దేశింపబడింది. స్వయంగా శీత్లాదేవే తండావాసుల కలలో కనిపించి తమను ఆరాధిస్తే పశువులు రక్షింప బడతాయని చెప్పినట్లు ఒక కథ ప్రచారంలో ఉంది.

## పూజా విధానం

లంబాడీలు శ్రావణ మాసంలో తండా నాయకుని అనుమతితో ఏదో ఒక మంగళవారం శీత్లాదేవి పండుగను జరుపుకొంటారు. పండుగ ముందు రోజు అనగా సోమవారం రాత్రి తండా నాయకుని ఆదేశం మేరకు ఒకరు తండాలోని ఇంటింటికి డప్పుకొట్టుకుంటూ తిరుగుతూ, 'వాంషిడో వాంషిడో' అని కేకలు వేస్తూ, పండుగకు ప్రత్యేకంగా అందరూ జొన్న గుగ్గిళ్ళు వండుకోవాలని కూడా తెలియజేస్తాడు.

మంగళవారం రోజు ఉదయమే పిల్లలు, పెద్దలు అందరూ స్నానం చేసి శీత్లాదేవి కోసం లాప్సి (బియ్యం, బెల్లం, పాలతో వండిన పాయసం) వండుకుంటారు. శీత్లాభవానీని ప్రతిష్ఠించిన ప్రదేశానికి అందరూ ఊరేగింపుగా వెళ్ళి పూజా కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.

ఐదుగురు కన్యలు పాంచ్‌బేడో (ఐదు బిందెల దొంతరలు)లో నీటిని తీసుకొని రాగా, మిగతా చిన్నాపెద్ద అంతా కలిపి బయలుదేరుతారు. ఒకరోజు ముందుగా వండుకున్న గుగ్గిళ్ళను, ఉదయం వండిన లాప్సిని ఒక ఇత్తడి పళ్ళెంలో పెట్టుకొని 'ఫులియా గొణ్ణో' (అద్దాలతో, పూలతో ప్రత్యేకంగా కుట్టిన గుడ్డ)ను కప్పి, తలపై పెట్టుకొని మరికొందరు కన్యలు నడుస్తారు. వారి వెనకాల అందరూ పాటలు పాడుకుంటూ నృత్యం చేసుకుంటూ వెళ్తారు. తండానుంచి శీత్లామాతను పూజించడానికి బయలుదేరే సందర్భంలో పాడేపాట.



శీత్లాయాడి నికెళి మలక దేకేన
జగజగ నందియా ఝాంకరేచయే
ఓనయాలేయ దనియా ధారేచయే ॥ జగ జగ॥

శీత్లాదేవి తాను సృష్టించిన ఈ ప్రపంచాన్ని చూద్దామని బయలుదేరింది. అప్పుడు ఎక్కడ చూసినా నందీశ్వరులు ధగధగ మెరుస్తున్నారు. దేవి ప్రకాశానికి అందరూ ఆశ్చర్యచకితులై వేనోళ్ల పొగిడారని పై పాటసారాంశం.

శీత్లాదేవి అంటే చల్లని తల్లి, అందరి కోర్కెలు తీర్చే కల్పవల్లి, అందరూ పూజా ప్రదేశానికి చేరుకున్నాక 'లుంకడియా' ముందు గుంతను తవ్వి, కన్యలు తెచ్చిన నీళ్లు ఆ గుంతలో పోస్తారు.

ఏడుగురు భవానీలకు వారు తెచ్చిన నెయ్యి, జాజులను పూసి వాటిని అలంకరిస్తారు. అలికి ముగ్గువేసిన స్థలం (చ్వాకో)పైన తంగెడ ఆకులను పరుస్తారు. ఆ తంగేడు ఆకుల మీద స్త్రీలు తెచ్చిన పాచి గుగ్గిళ్ళు, లాప్సి, పసుపు, కుంకుమ మొదలైన పూజా ద్రవ్యాలను నైవేద్యంగా సమర్పిస్తారు. తర్వాత మేకపోతు మీద నీళ్లుపోసి దాన్ని పసుపు, కుంకుమలతో అలంకరించి, 'అమ్మా! నీ దగ్గర శక్తి ఉండే మేక పోతును ధడ్ ధడి (జడత) తెప్పించుము' అని ప్రార్థిస్తారు. మేక పోతు శరీరాన్ని ఒకసారి విదిలించి నట్లయితే భవాని మెచ్చిందని భావించి, ఆ వెంటనే దాన్ని దేవికి బలి ఇస్తారు. మేకపోతును కోయగా వచ్చిన రాక్తాన్ని ఒక పళ్ళెంలో పడ్తారు. తలను దేవిముందుంచుతారు. పొట్ట పేగులను తీసి భవానీల ముందు నుండి 'లుండియా' వరకు పరుస్తారు. శీత్లామాతకు పాచి గుగ్గిళ్ల, మేకపోతురక్తం, వండిన మాంసం నైవేద్యంగా సమర్పిస్తారు, తర్వాత పశువులను పొట్ట పేగులపై నుండి దాటిస్తూ, 'వాంసిడో' చల్లుకుంటూ కేకలు వేస్తారు. కోళ్లను కోసి పశువుల మందలో విసిరేస్తారు. దేవి ముందు ఉడకబెట్టిన ఏడు పెద్ద ఎముకలను, నైవేద్యంగా పెట్టి తమను చల్లగా చూడాలని ప్రార్థిస్తారు.

ఆ తర్వాత అందరు భోంజనం చేసి పాటలు పాడుకుంటూ నృత్యాలు చేస్తూ, ఇళ్లకు చేరుకుంటారు. ఈ సందర్భంలోని పాట

గర్జే గర్జేను మజళ క్యామేల హెలమా
భీజేన ధరతి చూంజేడి
మారె శీలలాపర వరసమేల హెలమా
భీజేన ధరతి చూంజేడి
మారె హంసలేపర వరసమేల హెలమా
భీజేన ధరతి చూంజేడి

మబ్బులు గర్జించగా ఈ భూమాత తడిసింది. మా శీత్లామాత కరుణ మాపై ఎల్లప్పుడు ఉంటుందని అర్థం.

## ముగింపు

బంజారాలు శీత్లాదేవినే కాక ఆమె తోబుట్టువులను కూడా ప్రతిష్ఠించి పూజించడం గమనింపదగిన విషయం. దక్షిణదేశంలో ఇతర కులాల్లో ఇలాంటి సంప్రదాయం ఉన్న దాఖలాలు లేవు. అయితే ఉత్తర భారతదేశంలోని రాజస్థాన్‌లో అన్ని ప్రాంతాల్లో శీత్లాదేవి పండుగను ఘనంగా జరుపుకుంటారు. ఈ పండుగ ఉత్తర భారతం నుంచి వచ్చినట్లు తెలుస్తుంది. ముఖ్యంగా లంబాడీలు ఎక్కడున్నా తమ సంస్కృతిని కాపాడుకుంటూ వస్తున్నట్లు తెలుస్తుంది. అయితే శక్తి దేవతలపై బంజారాలకున్న నమ్మకం, పూజా విధానం, పురాతన హిందూ ధర్మాన్ని అనుసరించి ఉన్నాయి.

### ఆధార గ్రంథాలు

1. డా॥ఎం. గోనా నాయర్ 2002, సుగాలీ సంస్కృతి - భాషా సాహిత్యం.
2. డా॥ జనపాల శంకరయ్య, 2001, తెలుగులంబాడీల గేయ సాహిత్యం
3. బి. నీలిమా నాయర్ 1998, బంజారా చరిత్ర సంస్కృతి ప్రగతి.
4. శ్రీ ప్రసాదరెడ్డి, అనువాదం, 2000, భారతీయ గిరిజనులు.
5. డి. సూర్య, 2005, నల్గొండ జిల్లా బంజారా సాహిత్య జీవన చిత్రణ, సిద్ధాంత గ్రంథం,

# 'బుర్రకథ' అంటే...

-డా॥ వై.పి. రాజు
జానపద కళలశాఖ
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్

జానపద కళారూపాలలో అగ్రగామి బుర్రకథ. తెలుగు ప్రజల మధ్య పుట్టి, తెలుగు రాష్ట్రాన్ని దాటి, భారతదేశపు అంచులు దాటి, లక్షల మైళ్ళు ప్రయాణం చేస్తూ, ప్రపంచ దేశాలలో యథేచ్ఛగా ప్రదర్శింపబడుతున్న సజీవ కళాఖండం బుర్రకథ.

భాషతో, భావంతో, సాహిత్యంతో, సంగీతంతో, నృత్యంతో, నాటకంతో అభినయాలతో, అనేకానేకాంశాలతో ముడిపడి వున్న కళారూపం బుర్రకథ. అందువల్ల ఇది పరిపూర్ణ సమాహారకళగా చరిత్రపుటల్లో మిగిలిపోతుంది. అత్యవసరం అనుకుంటే ఇతర భాషలతో మమేకమై కథాకథనాన్ని కొనసాగించే అవకాశం లేకపోలేదు. కథను తెలుగుభాషలో గానంచేస్తూ, అవసరం అనుకున్నప్పుడు హిందీ, ఆంగ్ల భాషలలో మాట్లాడుతూ భారతదేశంలో చెన్నై, ముంబయి, కురుక్షేత్ర, సింధనూరు, కోల్‌కతా, ఢిల్లీ వంటి నగరాల్లో, ఒరిస్సా, కర్ణాటక, మహారాష్ట్ర, గోవా మున్నగు అనేక రాష్ట్రాల్లో, అలాగే మారిషస్ వంటి ఇతర దేశాలలో కూడా డా॥ వై.పి. రాజు బృందం (వ్యాసరచయిత) బుర్రకథ ప్రదర్శనలిస్తూ ఉంది. అందువల్ల ఈ కళారూపానికి భాషలు అడ్డుకాదు. 'జానపద కళారంగస్థలంలో సింహం వంటిది బుర్రకథ' అనడం ఎంత మాత్రం అతిశయోక్తి కాదు.

అసలు బుర్రకథంటే బుర్రకలిగిన మనిషి గురించి చేప్పేకథ అని కొందరు చమత్కరిస్తారు. 'వినరా భారత వీరకుమారా విజయం మనదేరా' అని పాడి, అదేకదా బుర్రకథంటే అంటారు మరికొందరు. 'తందాన, హై తందాన' అదే కదా అని ఇంకొందరు చమత్కరిస్తారు.

'బుర్రలు వాయిస్తూ పాడుతారు, అదీ బుర్రకథ' అని కొంతమంది నిర్వచనాలు చెబుతారు. అవి ఊజనితమైనా, అందులో ఎంతోకొంత నిజం లేకపోలేదు.

శాస్త్రీయంగా ఆలోచించినట్లైతే, ప్రదర్శనలో ఉపయోగించే వాద్యాలను బట్టి కొందరు, కథా ప్రదర్శనలో గానం చేసే పాటను బట్టి మరికొందరు నిర్వచిస్తారు.

ఈ కళారూపానికి అనేక పేర్లున్నాయి. బుర్రకథ, గుమ్మెట్ల కథ, ఢక్కీలకథ, తంబూర కథ, తందాన కథ, తందాన పాట అని కూడా పిలుస్తు వుంటారు. కథా ప్రదర్శనలో వంతలు వాయించే వాద్యాలను గుమ్మెట్లనీ, బుర్రలనీ, ఢక్కీలనీ, వంతపాటగా 'తంధాన తంధాని తంధాన దేవనందనానా' అని గానం చేస్తారు, కాబట్టి, ఆ పేర్లు వచ్చాయి. కథకుడు ధరించే (భుజంపై)వాద్య పరికరాన్ని తంబూర అంటారు. కాబట్టి 'తంబూర కథ' అని కూడా పిలుస్తారు. 'తంబూర నాదం ఆధారంగా కథను గానం చేయడం జరుగుతుంది' కాబట్టి ఈ నిర్వచనం 'సబబే' అని స్థిరపరిచారు.

బుర్రకథ కళాకారులు ముగ్గురు. 1. కథకుడు, 2. రాజకీయవంత, 3. హాస్యవంత. కథకుడు కథానాయకుడనీ, ప్రధాన కథకుడనీ, ప్రధాన గాయకుడనీ, మధ్య పాటకుడనీ, సెంటరనీ, నాయకుడనీ, గురువనీ పిలుస్తుంటారు. రాజకీయ వంతను 1వ వంతనీ, వచనవంతనీ, వ్యాఖ్యానం అనీ పిలుస్తారు. ఇక హాస్యవంతను 2వ వంతనీ, హాస్యం చెప్పేవాడనీ, ఆసిగాడనీ, బఫూన్ అనీ, విధూషకుడనీ, కామెడీ అనీ పిలుస్తారు. ఇక వేషానికొస్తే, ముగ్గురికీ గౌన్లు (పొడుగ్గా) తలపాగాలు, ముసుర్వాయిలు (పొడుగు లాగులు), నడుందట్టీలు (నడుంకి గుడ్డలు), ముఖానికి రంగు ఉంటాయి. సమాజంతోపాటు భాషాసాహిత్యాలు మార్పు చెందడం ఎంత సహజమో, అలాగే ఈ కళాకారుల వేషంలోను మార్పులు చోటుచేసుకున్నాయి. తళుక్కుని మెరిసే మెరుపుగుడ్డలు, ఖరీదైన రంగులు, పెన్సిల్లు, పెదవులకు ఎర్ర రంగులు, చెవులకుకు రింగులు, మెడలో పూసలదండలు, చెప్పే కథను బట్టి బొట్లు వాడతారు.

కథకుని వేషం ఒక రాజవేషంగా ఉంటుంది. భుజం మీద తంబుర, ఎడంచేతిలో అందెలు, చిటికెనవ్రేలికి జేబురుమాలు, కాళ్ళకు గజ్జెలు ధరిస్తాడు. ఇరువురు వంతలు ఢక్కీలు భుజాలకు ధరిస్తారు. రాజకీయవంత వేషం ఒక రాజకుమారుని పోలి ఉంటుంది. కొందరు తలపాగాను ధరిస్తున్నారు. మరికొందరు అందంగా తల దువ్వుకుంటున్నారు. ఇక హాస్యం వేషానికివస్తే, ఒక మహామంత్రి వేషాన్ని పోలి ఉంటుంది. మంత్రికి మీసాలు ఒకటి కిందికి, వేరొకటి పైకి మెలితిరిగి వుంటాయి. తలపాగా చుట్టడం కూడా కాస్త హాస్యస్ఫోరకంగా ఉంటుంది. తలకు వెనకాల ఒక తోకవెళ్ళాడేటట్లు పిలక మాదిరిగా ఉంటుంది. మొత్తం మీద ముగ్గురూ వేషాలు ధరిస్తారు. మొదటి దశలో పంచెలు, చొక్కాలు, సాధారణ తలపాగాలు, రెండవ దశలో కాషాయి రంగు కలిగిన పొడుగాటి అంగీలు, సుర్వాయిలు, నేడు షర్టులు, స్కర్ట్‌లు, హాస్యానికైతే పూలుపూలు రంగులున్న వస్త్రాలు ధరిస్తున్నారు. కథకుడు,



రాజకీయవంతలు సాదారంగు కల్గిన వస్త్రాలు ధరిస్తున్నారు. స్త్రీలు కథకులైతే మగవాళ్ళ మాదిరి గౌన్లు (పొడుగాటివి) ధరిస్తున్నారు. తలపాగాను కూడా ధరిస్తున్నారు. మరికొందరు సహజంగానే చీర, జాకెట్టు ధరిస్తున్నారు. కొందరైతే పట్టు చీరలు ధరిస్తున్నారు. శాస్త్రబద్ధంగా అయితే చీరెలే ధరించాలి. ఆకర్షణ కోసం కొందరు హాస్యవంతలు పూలచీరలు, రాజకీయ వంతలు మెరిసే పట్టు చీరలు ధరిస్తున్నారు.

ఇక ప్రదర్శన విషయంలో కథకుడు కథను శ్రుతిలో గానం చేస్తూ, లయబద్ధంగా అడుగులు వేస్తూ, లయకు తగిన విధంగా చేతిలో అందెలు మ్రోగిస్తూ, దానికి తగినట్లుగా కాలితో గజ్జెలు సవ్వడిచేస్తూ ప్రదర్శన చేస్తుంటే, కథకుడు పాడిన చరణాన్ని గాని, చరణ భాగాన్ని గాని అందిపుచ్చుకొని, వంతలు సహగానం చేస్తూ, దానికి తగిన విధంగా ఢక్కీ వాద్యాన్ని అందిస్తారు. కథకుడు 'రగడ'ను గానం చేసేటప్పుడు ఒక వంతపాటను, వరుసలలో గానం చేసేటప్పుడు తందాన వరుస, సై సై వరుస, భళి భళి వరుసలలో సహగానం చేస్తూ వుంటారు. కథకుడు గానం చేసే వరుసలలో అవగాహన లేకపోతే వంతలు సహగానం చేయలేరు. అందువలన కథకుని కథాగానంపై సదవగాహన ఉండితీరాలి. అందుకే వంతలను ఉపకథకులు అని కూడా అంటారు.

నృత్యంలో కూడా వంతలు సహనృత్యం చెయ్యాలి. చాలామంది ఉపకథకులు అంటే వంతలు వూరికే నిలబడి పాడుతూ ఉంటారు. ఉప కథకులు కాలేరు. ఉపగాయకులు మాత్రమే అవుతారు. అందువలన కథకుని ప్రతి మాటకు, ప్రతి పాటకు, ప్రతి అభినయానికి ప్రతిస్పందించాలి. అలా చేయలేకపోతే కథాప్రదర్శన రక్తికట్టదు. కథకుని కదలికను గ్రహిస్తూ వంతలు కదలాలి. అతని కనుసన్నలలో మెలిగాలి. ఒక్కొక్కసారి కథకుడు కథానుగుణమైన పాత్రల ప్రవేశం చేస్తున్నప్పుడు వంతలు కూడా తగిన సందర్భ పాత్రలను ధరించవలసి వస్తుంది. అప్పుడు వంతలు సహకరించగలిగితే, కథ అద్భుతంగా వుంటుంది. కథకుడే కథలోని ప్రధాన పాత్రలతోపాటు ఇతర పాత్రలను పోషించవలసి వచ్చినప్పుడు వంతలు కథకునికి తగిన వాళ్ళు కాదని ప్రేక్షకులు చెప్పేస్తారు.

బుర్రకథ 'ఒకనాటకంలా ఉందిరా' అని ప్రేక్షకులతో అనిపించుకోవాలి అంటే ముగ్గురూ సంభాషణల ద్వారా వేర్వేరు పాత్రల్లోకి ప్రవేశించాలి. అప్పుడొక నాటకం చూస్తున్నట్లు ప్రేక్షకుడు భ్రమిస్తాడు.

ఉదాహరణకు అల్లూరి సీతారామరాజు కథలో ఒక ఘట్టంలో లేదా ఒక సన్నివేశంలో రూథర్‌ఫర్డు అంటే తెల్లదొర, మరొకళ్ళు మల్లుదొర, గంటందొర పాత్రలు

సందర్భం వచ్చినప్పుడు రూథర్‌ఫర్డుగా హాస్యపాత్రధారి, మల్లుదొర, గంటందొరలుగా కథకుడు, రాజకీయ వంతలు పాత్రలు పోషించవలసి ఉంటుంది. ప్రేక్షకులు నిజమైన పాత్రలున్నట్లు భ్రమిస్తారు ఆనందరసాలలో తేలిపోతారు. అలాగే మరోకథలో శకుని పాత్రలో హాస్య పాత్రధారి, దుర్యోధనునిగా కథకుడు, దుశ్శాసనుని పాత్రగా రాజకీయవంత ప్రదర్శించినప్పుడు ప్రేక్షాగారం చప్పట్లతో మారుమ్రోగుతుంది. ఇలాగ అనేక సన్నివేశాలు బుర్రకథప్రదర్శనల్లో ఎదురవుతాయి. వాటిని కళాకారులు తగిన విధంగా, పాత్రలు పోషించవలసి వస్తుంది.

"సంభాషణ రూపంలో సంఘంలో ఉండే రుగ్మతలను వ్యంగ్య రూపంలో హాస్యవంత ఎత్తిచూపుతాడు. రాజకీయవంత దానికి తగినట్లుగా మాట్లాడుతూ ఒకవైపు సమర్థిస్తూ, మరోవైపు దేశాన్ని సమర్థిస్తూ, మరొకవైపు కథకు అనుసంధానం చేసుకొంటూ కథను నడిపిస్తాడు. అందుకే బుర్రకథలో రాజకీయవంత అసలైన ముఖ్యపాత్ర అంటారు. కొన్ని సందర్భాల్లో, నామమాత్రుడైన కథకుణ్ణి, నామమాత్రపు హాస్యవంత బృందంలో చేర్చుకొని సమర్థుడైన రాజకీయవంత కథను నడిపించిన రోజు లేక పోలేదు. ఇలాంటి విషయాలు ప్రదర్శనలో ఆసక్తికరమైన అంశాలు కేవలం కళాకారులకే తెలుస్తాయి. అదే విధంగా సమర్థుడైన హాస్యవంత నామమాత్రుడైన కథకుణ్ణి, నామమాత్రుడైన రాజకీయవంతను బృందంలో చేర్చుకొని కథా ప్రదర్శనను కొనసాగించిన బృందాలు లేకపోలేదు, ఈ పై రెండు పద్ధతులు శాస్త్రానికి విరుద్ధమే.

బుర్రకథ పుట్టిన నాటినుంచి కథకుడే మూలవిరాట్టు, కాబట్టి గానం, లయ, వాద్యం తెలుసున్న ఇద్దరు వంతులను బృందంలో చేర్చుకొని కథను నడిపించడం పరిపాటి, అది సమర్థనీయం.

ఇక బుర్రకథ పుట్టుకను గురించి రెండు మూడు మాటలు చెప్పి వ్యాసం ముగిస్తాను. బుర్రకథ అవతరణ గురించి అనేకులు అనేక విధాలుగా చెబుతారు. 12వ శతాబ్దమని కొందరూ, 13వ శతాబ్దమని మరికొందరు, 14వ శతాబ్దమని ఇంకొందరూ అభిప్రాయపడుతున్నారు. కొన్ని ఉదాహరణలను పరిశీలించి, అందరం ఒక అభిప్రాయానికి వద్దాం.

*"అకలంక స్థితి గోరి కొల్చెదరు బ్రహ్మానందభావంబునన్*
*సకలానందమమైక మాతలగుచున్ సంతోషచిత్తంబునన్*
*తకదుమ్ముల్ యెకతాళముల్ తందానమ్ములయ్యకున్*
*ఏకవీరమ్మకు మాహూరమ్మకు నథోహ్రీంకార మధ్యాత్మకున్"*

14వ శతాబ్దం, క్రీడాభిరామము



*ద్రుతతాళంబున వీరగుంభి తకధుంధుంధుం కిటత్కార సం*
*గతి వాయిపుచు నాంతరాళిక యతిగ్రామాభిరామంబుగా*
*యతింగూడ ద్విపద ప్రబంధమున వీరానీకంబాడె నొ*
*క్కతె ప్రత్యక్షరముం గుమారులు ఫీట్కారంబునదూలదన్"*

14వ శతాబ్దం, క్రీడాభిరామము

పై రెండు ఉదాహరణలను బట్టి తందాన కథలు కాకతీయుల యుగం నాటికే ప్రచారంలో ఉన్నాయనీ, యక్షగానం, వీధినాటకాలు బుర్రకథలకు పూర్వరూపమనీ, శ్రీనాథుని కాలానికి ముందే ద్విపదప్రబంధ బుర్రకథలున్నాయనీ తెలుస్తుంది.

పైన ఉదహరించిన రెండో పద్యంలో (ఇతివృత్తం) కథ వీరచరిత్రకు సంబంధించినదనీ, ఒక స్త్రీ వీరగుంభి వాయిస్తూ... ద్విపద కావ్యం పాడిందనీ, అలా కథాగానం చేస్తుంటే ప్రేక్షకుల్లో కొందరు కొంటె కుర్రవాళ్ళు 'ఈలలు' వేశారనీ, కథా ప్రదర్శన గానంతో ప్రేక్షకులు ఊగ్రూతలూగారనీ తెలుస్తుంది. ఆమె ఉపయోగించిన వాద్యం గంభీరంగా, గుంభనంగా ఉందని తెలుస్తోంది, అంటే నేడు బుర్రకథలో ఉపయోగించే గుమ్మెటగా మనం పరిగణించవచ్చు.

*వల్లికి చక్కి కాహళము వంశము డక్క హుడక్క ఝుర్ఝరుల్*
*ఝల్లరి యాదిగాఁగలుగు శబ్దపరంపరతాళబద్ధమై"*

కాశీఖండము.

పై శ్రీనాథుని కాశీఖండంలో ఉదాహరణను బట్టి ఆనాటి నుంచి ఢక్కీలు ఉన్నట్లు భావించవచ్చు.

**అలరుచుఁబడి హారులట్ల యందఱును**
**లలినుచ్చి చాంగు భళామనువారు"** (పండితారాధ్య చరిత్ర)

పద్యభాగాన్నిబట్టి, భళా, భళి, భాళావంటి భాయ్‌తమ్ముడసై, లాంటి వంత పదాలు ఆనాటి నుంచి ప్రచారంలో ఉన్నాయని నిర్ధారించవచ్చు.

బుర్రకథకు యక్షగానంలో బీజాలున్నాయని కొందరూ, యక్షగానం నుంచే బుర్రకథ కళారూపంగా పరిణితి చెందిందని కొందరు, నేడు లభ్యమౌతున్న బాలనాగమ్మ తంబూర పాట క్రీ.శ. 13వ శతాబ్దానికి ముందే వుందని చెప్పవచ్చుననుట వలన బుర్రకథలు ఇదే శతాబ్దానికి చెంది వుండ వచ్చునని మరికొందరూ, బుర్రకథను పుట్టుకను గురించి, కొన్ని అంశాల మీద ఆధారపడి ఊహించి చెప్పడం మినహా

ఖచ్చితంగా చెప్పడం సాధ్యం కాదని కొందరూ, శైవ వైష్ణవ కలహాల కాలంలో ఈ కథలు చాలా ప్రచారంలో ఉన్నాయి. కనుక క్రీ.శ. 1150 నాటికే బుర్రకథలు అవతరించి ఉండవచ్చునని మరికొందరూ, వారి వారి అభిప్రాయాలను వెలిబుచ్చారు.

ఏదిఏమైనప్పటికీ, బుర్రకథపుట్టుక చాలా ప్రాచీనమైనదని తెలుస్తుంది. దశలవారీగ కథాగానంలోను, ప్రదర్శన రీతుల్లోను, ఇతివృత్తాల్లోను కాలపరిణతి చెందుతూ వచ్చి క్రీ.శ. 1940 నాటికి నేడు మనం చూస్తున్న బుర్రకథ రూపం ఏర్పడిందని చెప్పవచ్చు. ఈ కథలు 1900 నుండి 1920 వరకు ఉధృతంగా ప్రచారంలో ఉన్నట్లు చెబుతున్న ప్రసిద్ధ పరిశోధకులు ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారి అభిప్రాయాన్ని బట్టి 1920 నుంచి జంగం కథలు క్రమేపి కనుమరుగు కావడం వలన 1940 - 41 ప్రాంతంలో బుర్రకథ అవతరించింది అనడం నిస్సందేహం.

ఇంతవరకు బుర్రకథ పుట్టుక గురించి చెప్పుకున్నదంతా బుర్రకథ మాతృతకలైన శారదకథ, జంగంకథలు గురించి, యక్షగానం నుంచి విడివడిన శారద, జంగం కథలు బుర్రకథలుగా అవతరించాయి. బుర్రకథకు పూర్వ రూపాలైన యక్షగానం నుంచి దరువులను, దృశ్యాలను, జంగం కథలోని రగడలను, బాలనాగమ్మ కథలోని సై సై వరుసలనూ, తందాన కథల్లోని తందాన వరుసలనూ వీరగాథల్లోని భళిభళి వరుసలకు తోడుచేసుకొని బుర్రకథగా రూపొందించిన కమ్యూనిస్టు కార్యకర్తలు, ప్రజానాట్యమండలి కళాకారులు, బుర్రకథ అవతరణకు ఆద్యులు, పూజ్యులు సుంకర సత్యనారాయణ, కాకుమాను సుబ్బారావులు ప్రశంసనీయులు. ఈ బుర్రకథ రంగంలో తన కంటూ ఒక గుర్తింపుపను సాధించుకోవటమే కాక, భావితరాలకు తన పాటే ఒక బాటగా నిలిపిన, నిలిచిన పద్మశ్రీ నాజర్ ప్రశంసనీయుడు. బుర్రకథ ప్రదర్శనలో పితామహుడు షేక్‌నాజర్, బుర్రకథ పరిశోధనలలో తొలి పరిశోధక బుర్రకథకుడు డా॥ వై.పి.రాజు (రచయిత) లబ్ధ ప్రతిష్టులే అని చెప్పక తప్పదు.

బుర్రకథకు మొదట వేషం, తర్వాత భాష, ఆ తర్వాత ఆటపాట అన్నారు ఆర్యులు. నాటి జంగం కథలకు, నేటి బుర్రకథలకు పైన ఉదహరించి వాటిల్లో మార్పులు వచ్చినట్లుగానే, ఇతివృత్తంలోను మార్పులు సంభవించాయి. బాలనాగమ్మ, కామమ్మ, లక్ష్మమ్మ, తిరుపతమ్మ లాంటి జానపద కథలను దాటి; అంబరీషోపాఖ్యానం, ఉత్తర గోగ్రహణం, వామన విజయం లాంటి పురాణకథలను దాటి; బొబ్బిలి యుద్ధం, పల్నాటి యుద్ధం, అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్, రాణి రుద్రమ లాంటి చారిత్రక కథలను దాటి కష్టజీవి, రాయలసీమకరువు, తెలంగాణ లాంటి సామాజిక, రాజకీయ బుర్రకథలను దాటి; కుటుంబనియంత్రణ, పొదుపు, ఎయిడ్స్, పోలియో చుక్కలు



లాంటి ప్రభుత్వ, ప్రభుత్వేతర ప్రచార కథలుగా మార్పు చెందాయి. సామాజిక సమకాలీన ప్రజా సమస్యలను ఆధారం చేసుకొని బుర్రకథప్రదర్శనలు కొనసాగుతున్నాయి. శక్తుల పేర్లు, వ్యక్తుల పేర్లు, సంస్థల పేర్లు, సమస్త పేర్లు ఆధారం చేసుకొని, ఒక్కమాటలో చెప్పాలంటే నేడు ప్రతి చిన్నఅంశాన్ని ఆధారం చేసుకొని బుర్రకథ ఇతివృత్తాలు వచ్చాయి.

బుర్రకథల్లాంటి కథాగాన కళారూపాలకు ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థల ప్రోత్సాహం నామమాత్రంగా, అంతంత మాత్రంగానే వుంది. సంగీతం, నృత్యం, సాహిత్యం, నాట్యం, నాటకం, చతుర్విధాభినయాలు కల్గిన, సామాజిక నీతిని, భక్తిని, భుక్తిని, ముక్తిని, విముక్తిని, అమరకీర్తిని, ప్రజా చైతన్యాన్ని కల్గించే 'సమాహారకళ' బుర్రకథ. ఈ కళారూపానికి అతి తక్కువ ప్రాధాన్యం ఇచ్చి, భారత నాట్యం, ఆంధ్ర నాట్యం, పేరిణి శివతాండవం లాంటి శాస్త్రీయ కళలకు ఎక్కువ ప్రాధాన్యాన్నివ్వడం అత్యంత విచారకరం. బుర్రకథ జానపద కళారూపం. జానపద కళలు అన్ని కళలకు పునాదులు. అట్టి పునాదులను పునరుద్ధరించడానికి ప్రభుత్వ, ప్రభుత్వేతర స్వచ్ఛంద సంస్థలు ముందుకు రావాలి. విరివిగా ప్రదర్శనలు ఏర్పాటు చేయడానికి కంకణం కట్టుకోవాలి. దానివల్ల పరమార్థం మిగులుతుంది, అజీర్తిగా వున్న వాడికి అన్నం పెట్టి బోధించేకంటే ఆకలి గొన్నవాడికి పట్టెడన్నం పెడితే బ్రహ్మానందం, ఆత్మానందం, తృప్తి, ఆత్మసంతృప్తి కలుగుతాయట. జానపద కళా పరిషత్తుల్లాంటి సంస్థలు ముందుకొస్తున్నాయి. మనం కూడా భాగస్తులవుదాం. బుర్రకథంటే అదీ.

## ఉపయుక్త గ్రంథాలు


1. రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని, ఆంధ్ర నాటక రంగచరిత్ర
2. వెంకట సుబ్బారావు, తంగిరాల, కాటం రాజు కథలు
3. రామకృష్ణారెడ్డి, పడు, తెలుగు వారి జానపదకళలు
4. శ్రీనాథుడు క్రీడాభిరామము 132వ పద్యం
5. శ్రీనాథుడు క్రీడాభిరామము 116వ పద్యం
6. శ్రీనాథుని కాశీఖండము
7. పాల్కురికి సోమనాథుడు, పండితారాధ్య చరిత్ర
8. శ్రీనివాస చక్రవర్తి, నాట్యకళ
9. బియ్యన్న, ప్రజా ఉద్యమాలు సృష్టించిన బుర్రకథ
10. డా॥ వై.పి. రాజు, బుర్రకథలు, సామాజిక స్పృహ

# చిత్తూరు జిల్లా వీధి నాటకాలు

-డా॥ వి. గోవింద రెడ్డి
జోనల్ డైరెక్టర్, నెహ్రూ యువక కేంద్రం
తిరుపతి, చిత్తూరు జిల్లా.

చిత్తూరు జిల్లా కేంద్రానికి 90 కి.మీ దూరంలో 'కంగుంది' గ్రామం కలదు. ఇది నేడు కుప్పం మండలానికి చేరింది. ప్రసిద్ధ కట్టడాలు, దేవాలయాలు, ఈ ప్రాంతంలో మిక్కుటంగా ఉన్నాయి. ఈ కంగుందికి దాదాపు వెయ్యేళ్ళ చరిత్ర ఉంది. ఒకనాడు కంగుంది పాళేగాళ్ళ పరిపాలనలో వైభవోపేతంగా వెలుగొందిన కట్టడాలు శిథిలావస్థకు చేరుకున్నాయి. అయినా నాటికథలు, నాటకాలు, చెక్క భజనలు, వీధిభాగవతాలు మొదలగు జానపద కళారూపాలు అప్పటి జానపద కళా సంస్కృతులకు పట్టుకొమ్మలుగా ప్రసిద్ధికెక్కి నేటికీ జానపదకళా గంధాన్ని వీధినాటకాల రూపంలో సువాసనలను వెదజల్లుతున్నాయి. మహాభారత కథలోని 18పర్వాలను 18 వీధి నాటకాలు గా రాసి 18 రాత్రులు నాటకాలుగా ప్రదర్శించడం కంగుంది వారి ప్రత్యేకత.

చిత్తూరు జిల్లాలోని కుప్పం, రామకుప్పం మండలాలకు మధ్యగల ప్రాంతం ఒకప్పుడు దట్టమైన అరణ్యం. అందులో బందిపోటు దొంగలు అక్కడక్కడా స్థావరాలను ఏర్పరచుకొని ప్రజలను దోచుకొని జీవించేవారు. వారిని 'ఇర్లవారు' అనిపిలిచేవారు. నేటికినీ చిత్తూరు జిల్లాలో ఇర్లవారున్నారు. ఈ దారిదోపిడీముఠాలకు 'కంగడు' అనే వాడు నాయకుడు. అతని భార్య 'కంగి' ఆ గూడాల్లో నివసించే ఆటవికులకు వీరిరువురు పెద్ద దిక్కుగా, మకుటం లేని మహారాజుల్లా చెలామణి అయ్యేవారు.

అదే సమయంలో గుత్తికి సమీపాన 'ప్యాపిలి' అనే సంస్థానముండేది. దీనికి సమీపంలోని అరణ్యంలో 'మల్లినాయడు' అనే బోయివాడు తన అనుచరులతో దారిదోపిడీలు చేసి జీవించేవారు. ఇతని కుమారుడు 'కంబినాయడు' కూడా ఇదే వృత్తిని చేపట్టి జీవించేవాడు. ఇతని కుమారుడు రెండవ కంబినాయుడు, అతని కుమారుడు మూడవ కంబినాయుడు ఈ దోపిడీ వృత్తినే కులవృత్తిగా తీసుకొని జీవించేవారు. 1066వ సంవత్సరం ఈ ముఠాలో చీలిక లేర్పడి ఒకరినొకరు చంపుకొనుచున్నారు. వీరితో పోరాడలేక 3వ కంబినాయుడు తన అనుచరులతో, భార్యాబిడ్డలతో దక్షిణ దిశగా పారిపోయి నేటి కంగుందికి సమీపంలోని 'మహారాజ్‌ఘర్' అనుగుట్టను చేరాడు. ఆ గుట్టవద్ద కొన్ని యిండ్లను నిర్మించి దానికి 'అంగనమల' అని పేరుపెట్టి నివాసమేర్పరచుకున్నాడు. దారిదోపిడీలను చేస్తూ గుట్టమీద బేతరాయస్వామిని ప్రతిష్ఠించి, దేవాలయాన్ని నిర్మించి, కులదైవంగా బేతరాయ స్వామిని పూజింపసాగాడు.

ఈ విధంగా కంబినాయుడు స్థిరస్థావరాన్ని ఏర్పరచుకొని, దారిదోపిడీలు చేస్తున్నాడని కంగుడు తన బలగంతో కంబినాయుడిపైకి పోరాటానికి దిగాడు. స్థానబలంలేని కంబినాయుడు కంగడితో సంధి చేసుకొని స్నేహం కుదుర్చుకున్నాడు. కంగి కంగడితో చాలసన్నిహితంగా మెలుగుతూ అరణ్యప్రాంతంలో రహస్య మార్గాలను తెలుసుకున్నాడు. ఒకనాడు ముగ్గురూ కలిసి తీగల సాయంతో లోయలను దాటేటప్పుడు, కంగి కంగడు దాటుతున్న తీగలను నరికి, వారిరువురులోయలో పడి చనిపోయేటట్లు చేశాడు. అక్కడ ఒక దుర్గాన్ని నిర్మించి 'కంగుంది' అని పేరుపెట్టాడు.

కంగడు కంగి దారిదోపిడీగాళ్ళు. వీరు కుందేలలో నివసించేవారు. కంగడు నివసించిన గొందిని కంగొంది 'కంగుంది'గా మార్పుచెందినేడు 'కంగుంది కుప్పం'గా ప్రజాబాహుళ్యంలో నిలబడిపోయింది. ఈ కంగుంది సంస్థానాన్ని 28 తరాలవారు పాలించి, క్రీ.శ. 1066 నుండి 1950 వరకు సంస్థానాధిపతులుగా ప్రసిద్ధికెక్కారు.

## చిత్తూరు జిల్లా వీధి నాటకాలు

'వీధి నాటకం' అనగానే వీధిలో ప్రదర్శించే నాటకమని మనకు స్ఫురిస్తుంది. ఈ వీధి నాటకాలు అనేక పేర్లతో పిలువబడుతున్నాయి. వాటిని ప్రదర్శించే స్థలాన్ని, వ్యక్తుల్ని, కులాల్ని, పద్ధతుల్ని, ప్రాంతీయుల్ని, ఇతివృత్తాన్ని బట్టి అనేక రకాలుగా పిలువబడుతున్నాయి. వీటికి గత చరిత్రమెండు. ఆంధ్రరాష్ట్రంలో అనేక పేర్లతో వ్యవహరిస్తూ, ప్రదర్శిస్తున్నారు. అవి-

1. కురవంజి (కొరవంజి), 2. యక్షగానం, 3. కూచిపూడి భాగవతం, 4. బైలాట (బయలాట), 5. బైలు నాటకం (బయలు నాటకం), 6. వీధి నాటకం, 7. చెంచునాటకం, 8. చిందు భాగవతం, 9. వీధి భాగవతం, 10. తూర్పు భాగవతం, 11. యానాది భాగవతం, 12. నక్కల భాగవతం, 13. జేగంట భాగవతం, 14. చిరతల భాగవతం.

చిత్తూరు జిల్లాలో వేసవి కాలం గ్రామ దేవతల తిరుణాళ్ళు జరిగేవి. ఆ తిరుణాళ్ళలో రాత్రిపూట ఆటపాటలూ జరిగేవి. ఆ ఆటపాటలే కాల క్రమంలో వీధి నాటకాలుగా ప్రసిద్ధి కెక్కాయి. వర్షాలు లేనప్పుడు వర్షాలు రావాలని, గ్రామాల్లో వ్యాధులు (అమ్మవారు) సోకకూడదని, అదే విధంగా గ్రామాల్లో ఎవరైనా మరణిస్తే వారి కర్మకాండ రోజున కూడా వీధి నాటకాలను ప్రదర్శించేవారు. వీటిని గ్రామంలోని గుడిముందుగాని, మైదానంలోగాని, నాలుగు వీధుల కూడలిలో గాని ప్రదర్శిస్తారు. కాలక్రమేణ వీటికి నాటక పందిళ్ళు ఏర్పాటు చేయబడ్డాయి.

చిత్తూరు జిల్లాలో ప్రదర్శించే వీధి నాటకాలను ఇతి వృత్తాన్ని బట్టి 4 రకాలుగా వర్గీకరించవచ్చును.

### 1. రామాయణ కథలు 9

1. కౌసల్యా పరిణయం, 2. పాదుకాపట్టాభిషేకం, 3. సీతాకళ్యాణం, 4. లంకాదహనం, 5. శ్రీరామపట్టాభిషేకం, 6. రావణకథ, 7. మైరావణ (మైతురావణ), 8. రామాంజనేయ యుద్ధం, 9. లవకుశ.

### 2. భారత కథలు 18

1. పాండవ జననం, 2. వారణావతారము (హిడింబాసురవధ), 3. ద్రౌపదీ కళ్యాణం (బకాసుర వధ), 4. ద్రౌపదీ వస్త్రాపహరణం, 5. మయసభ, 6. ద్రౌపదీ మాన సంరక్షణ, 7. అరణ్యపర్వం, 8. అర్జున తపస్సు, 9. శశిరేఖా పరిణయం, 10.గయోపాఖ్యానం, 11. విరాటపర్వం, 12. ఉత్తర గోగ్రహణం, 13. శ్రీకృష్ణ రాయబారం, 14. శ్రీ కృష్ణార్జున యుద్ధం, 15. యుద్ధపంచకం (దుర్యోధనవధ), 16. కచదేవయాని, 17. యయాతి చరిత్ర, 18. పాండురాజు వేట.

### 3. భాగవత కథలు 5

1. గజేంద్ర మోక్షం, 2. శ్రీకృష్ణలీలలు, 3. భక్త ప్రహ్లాద, 4. మోహినీరుక్మాంగద, 5. ఉషాపరిణయం (బాణాసురకథ).

### 4. ఇతర కథలు 5

1. జయంతి జయపాల, 2. కావమ్మకథ, 3. అల్లి అర్జున, 4. కురవంజి, 5. కనకతార.



ఇవేగాక చిత్తూరు 5 జిల్లాలో దిగ్విజయంగా ప్రదర్శింపబడుతూ జానపదుల ప్రశంసలందుకొంటున్న నాటకాలు కూడా ఉన్నాయి. అవి : 1. సారంగధర, 2. బ్రహ్మంగారి జీవిత చరిత్ర, 3. నలతంగ, 4. చిన్నమ్మ కథ, 5. హరిశ్చంద్ర.

చిత్తూరు జిల్లా వీధి నాటకాలు అనగానే మనకు స్ఫురించేవి కంగుంది వీధి నాటకాలు. చిత్తూరు జిల్లాను తూర్పు పశ్చిమ మండలాలుగా విభజించి చూసినట్లయితే పశ్చిమ మండలాల్లో కుప్పం మండలానికి చెందిన 'కంగుంది' వీధి నాటకాలకు ప్రసిద్ధికెక్కినట్లే, తూర్పు మండలాల్లో విజయపురం మండలానికి చెందిన 'సూరికాపురం' సింద్రమండలానికి చెందిన 'ఆరూరు' ప్రసిద్ధి చెందాయి. తూర్పు మండలాల్లో నాటికీ నేటికీ ప్రదర్శింపబడుచున్న వీధినాటకాలు 14. అవి : 1. ద్రౌపది వస్త్రాపహరణం, 2. శశిరేఖా పరిణయం, 3. మైరావణ (మైతురావణ), 4. శ్రీ కృష్ణలీలలు, 5. గయోపాఖ్యానం, 6.కచదేవయాని, 7. మోహినీ రుక్మాంగద, 8. నలదమయంతి, 9. సత్యహరిశ్చంద్ర, 10. సారంగధర, 11. నలతంగ, 12. బ్రహ్మంగారి జీవిత చరిత్ర, 13. కురవంజి, 14. అల్లి అర్జున.

ఇక పశ్చిమ మండలాల్లో ప్రదర్శించే వీధి నాటకాలను పరిశీలించి నట్లయితే వాటిలోని ఇతివృత్తాలు భారతకథకు సంబంధించినవి. ఈ నాటకాలను ప్రదర్శించే కళాకారులు అనేకులున్నారు. పై నాటకాలన్నింటికి కంగుంది కుప్పం నాటకాలని పేరు. ఈ కంగుంది వీధి నాటకాలకు గతచరిత్ర మెండు. కంగుంది కళాకారులకు సంబంధించినంత వరకు వీరు ఎప్పటి నుండి వీధినాటకాలు ప్రదర్శిస్తున్నారో ఖచ్చితంగా తెలియరాదు. ఈ కళాకారులను సంప్రదించి అడుగగా వారికి ముందు గల రెండుమూడు తరాల నుండి ఈ కళ వారిపూర్వీకుల నుండి అనువంశకంగా సంక్రమించినట్లు చెప్తున్నారు. కంగుంది కళాకారులకు ఒక గురువుకాని, ఒక మార్గ దర్శకుడుగాని ఉండినట్లు తెలియరాలేదు. ఈ నాటక కథ వారికి మౌఖికంగా సంక్రమించినట్లు చెప్పుచున్నారు.

నేడు ఈ నాటకాలను కంగుంది వీధినాటకాలని పిలుస్తున్నాం గాని, మొట్టమొదట ఈ నాటకాలను 'బయలాట'లని, 'భాగవతం' అని, 'కేళిక' అని పిలిచేవారు. తర్వాతి కాలంలో వీధినాటకమనే పేరుతోబాటు 'భారతనాటక'మని గూడా పేరు వచ్చింది. మహాభారతంలోని 18 పర్వాలను 18 రోజులు నాటకాలుగా ప్రదర్శిస్తారు కనుక వీటిని 'భారత నాటక'మనే పేరుతో పిలిచేవారు. 18 పర్వాల కథలను పగటిపూట

కథగా చెప్పి, రాత్రిపూట ఆ కథను నాటకంగా ప్రదర్శించడం కంగుంది నాటకాల ప్రత్యేకత.

ఈ నాటకాలను ఊరి బయట ఆరుబైలులో ప్రదర్శిస్తారు గనుక దానిని 'భారత మిట్ట' అని గూడా పిలుస్తారు. చిత్తూరు జిల్లాలో చాలావరకు ధర్మరాజుల గుడులు నిర్మింపబడ్డాయి. ఈ ధర్మరాజుల గుడుల ముందర గూడా నాటకాలను ప్రదర్శిస్తారు.

చిత్తూరు జిల్లాలో ఈ వీధినాటకాలను నేర్చుకొనే కాలంనుండి ప్రదర్శించేంత వరకు కళాకారులు నిబంధనావళిని అనుసరిస్తారు. భక్తి శ్రద్ధలతో నేర్పడం, ప్రదర్శించడం, ప్రజాదరణ పొందడం అంతా ఒక విశేషంగా సాగుతుంది. వస్త్రధారణ, వేషాలంకరణ, నాటకారంభం, పాత్ర ప్రవేశం, సంగీత నృత్య సాహిత్యాలు అడుగడుగునా మనకు ప్రత్యేకమైన లక్షణాలతో దర్శనమిస్తాయి. ఈ వీధినాటకాలను పరిశీలించినట్లయితే కొన్ని లక్షణాలను ఈ విధంగా చెప్పవచ్చు.

1. వీధి నాటకానికి రంగస్థలంగా ఆరుబయలు లేదా నాలుగు వీధుల కూడలి మాత్రం ఉంటుంది.
2. గ్రామంలోని వారందరూ చూడడానికి అనువుగా ఉంటుంది.
3. స్త్రీ పాత్రలను పురుషులే ధరిస్తారు.
4. గ్రామం చుట్టు ప్రక్కల దొరికే మూలికలు, వస్తువులతోనే రంగులను తయారు చేసుకోవాలి.
5. రాత్రి పది గంటలకు ప్రదర్శన ప్రారంభమై ఉదయం ఆరు గంటల వరకు ఆడేదే వీధినాటకం.
6. వీధి నాటకాలకు ప్రత్యేకంగా అంకాలు, రంగాలు అనేవి ఉండవు. రంగాలు మారినట్లు మాటలతో సూచిస్తారు.

చిత్తూరు జిల్లాలో వీధి నాటక బృందాలు అనేకం. ఉదాహరణకు కొన్ని-

కుప్పయ్య మందడి బృందం, గంగుల మందడి బృందం, నరసింహమందడి బృందం, ఈశప్పరెడ్డి బృందం, శివలింగారెడ్డి బృందం, రాఘవదాసు బృందం, నాగుల రెడ్డి బృందం, వెంకట రెడ్డి బృందం, కైలాసం బృందం, సుబ్రమణ్యం బృందం, శ్రీ కృష్ణయువజన నాట్యమండలి, శ్రీ కృష్ణ దేవరాయ నాటక సమాజం, సరసకృష్ణా నాట్యమండలి, బాబు బృందం, ఎన్ గంగప్ప బృందం మొదలైనవి.



ఇక కంగుంది వారి విషయానికొస్తే మొట్టమొదట మహాభారత నాటకాలను ప్రవేశపెట్టినవారు చిత్తేరిమునిస్వామి. 'చిత్తేరి మునిస్వామి కంపెనీ' అని ప్రసిద్ధి కెక్కిన వీధి నాటక బృందంలో 60 మంది కళాకారులుండేవారు. కంగుంది కళాకారులలో ప్రసిద్ధికెక్కిన వారనేకులున్నారు. వారిలో కొందరు-

చిత్తేరిమునిస్వామి, చిత్తేరి చినమునిస్వామి, చిత్తేరి పెద్దబ్బ, చిత్తేరి చిన్నబ్బ, బుడ్రంగప్ప, చిన్నరంగప్ప, నల్లరంగప్ప, సీతావేంకటేశు, సీతాఅప్పోజీ, అగ్గిపెట్టెలముని వెంకటప్ప, గంగయ్య, బెంగుళూరుమునిస్వామి ఆచ్చారి, శీనప్ప, సముద్రాల వేంకటేశ్వర్లు, మొదలైనవారు.

## కంగుంది వారు ప్రదర్శించే మహాభారత నాటకాలు

| | | |
|---|---|---|
| ఒకటో రాత్రి | - | పాండురాజువేట |
| రెండోరాత్రి | - | వారణావతం |
| మూడోరాత్రి | - | బకాసుర వధ |
| నాలుగో రాత్రి | - | ద్రౌపదీ కళ్యాణం |
| ఐదోరాత్రి | - | అర్జునుని తీర్థయాత్ర |
| ఆరో రాత్రి | - | ద్రౌపదీ వస్త్రాపహరణం |
| ఏడో రాత్రి | - | అర్జునుని తపస్సు |
| ఎనిమిదో రాత్రి | - | శ్రీ కృష్ణార్జున యుద్ధం |
| తొమ్మిదో రాత్రి | - | విషకొలను |
| పదో రాత్రి | - | విరాటపర్వం |
| పదకొండవ రాత్రి | - | ఉత్తర గోగ్రహణం |
| పన్నెండవ రాత్రి | - | శ్రీ కృష్ణ రాయబారం |
| పద్మూడో రాత్రి | - | ఇలావంతునికథ |
| పద్నాలుగో రాత్రి | - | భీష్మపర్వం |
| పదైదో రాత్రి | - | ద్రోణపర్వం |
| పదహారో రాత్రి | - | శల్య పర్వం |
| పద్దెనిమిదో రాత్రి | - | గదా పర్వం |

ఈ నాటక ప్రదర్శన రోజుల్లో ఒక రాత్రికి నూరు నుండి 120 రూపాయల వరకు పారితోషికం ఆనాడు తీసుకొనేవారు. దీనితో పాటు 'తట్టకాసులు', 'చదివింపులు' ప్రేక్షకుల నుండి విరివిగా వచ్చేవి. ప్రేక్షకుల కోరికపై శ్రీ కృష్ణార్జున యుద్ధం తర్వాత 'శశిరేఖా పరిణయం' అనే నాటకాన్ని ఉచితంగా ప్రదర్శిస్తారు. అంతేగాక 18 రోజులు భారతం పూర్తయిన తర్వాత 'కొసరునాటకం'గా కనకతార, జయంతి జయపాల, సారంగధర, మొదలైన సాంఘిక చారిత్రక నాటకాల్లో ఏదో ఒక నాటకాన్ని 'ఇనాం' నాటకంగా ప్రదర్శిస్తారు.

ఈ భారత కథలను ప్రదర్శించే రోజుల్లో ప్రజలనుండి మంచి స్పందన కనబడుతుంది. కొన్ని ఘట్టాలు ప్రదర్శించే రోజులో ప్రజల సహకారం భాగస్వామ్యం, అంకితభావం మెండుగా ఉంటుంది. అటువంటి ఘట్టాలు మచ్చుకు కొన్ని.

**బకాసురుని బండికుంభం, ద్రౌపదీకళ్యాణం, అర్జునుని తవుసు (తపస్సు), ఉత్తర గోగ్రహణం, దుర్యోధనుని వధ, అగ్నిగుండ ప్రవేశం మొదలైనవి.**

చిత్తూరు జిల్లాలో ప్రభుత్వపరంగా అమలుపరచిన సంపూర్ణ అక్షరాస్యతా కార్యక్రమానికి 'అక్షర తపస్మాన్' అనే పేరు పైఘట్టాలలోని అర్జునుని తపసు ఆదర్శంగా జేసుకొని పెట్టడం విశేషం.

చిత్తూరు జిల్లాలో దాదాపు 50 గ్రామాలకు పైబడి ధర్మరాజుల గుడులను కలిగిఉన్నాయి. అట్లే వీధినాటకాలను ప్రదర్శించే గ్రామాలు కూడా వందకు పైగా ఉంటాయి.

చిత్తూరు జిల్లా వీధి నాటకాలను ఏ ప్రాంతంలో ఎలాప్రదర్శించినా ప్రేక్షకలోకానికి ఎనలేని రసానుభూతిని కల్గిస్తున్నాయి. నాటి నుండి నేటి వరకు మన సంస్కృతీ సంప్రదాయాలకు దర్పణం పడుతూ, సామాజిక రుగ్మతలను ఎప్పటికప్పుడు తెలియజేస్తూ, నైతిక విలువలను వదలిపెట్టక ఎంతో వైశిష్ట్యాన్ని సంతరించుకొన్నాయి ఈ వీధినాటకాలు.

# కడపజిల్లా గ్రామ దేవతల జాతర్లు : జానపదుల విశ్వాసాలకు ప్రతిరూపాలు

-డా॥ ఎన్. పద్మనాభ రెడ్డి
అకాడమిక్ ఆఫీసర్, డిపార్టుమెంట్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్,
నాంపల్లి, హైదరాబాద్

ప్రపంచంలో జానపద విజ్ఞానం ఒక తరగని గని. దానిని కాపాడు కోవడం జానపద విజ్ఞాన పరిశోధకుల బాధ్యత. ఈ జానపద విజ్ఞానాన్ని ప్రతి ఫలింపజేసే పెక్కు అంశాలలో జాతరలు ప్రధానమైనవి. మనదేశంలో దక్షిణ భారతదేశ జానపద విజ్ఞానం ఒక విశిష్ఠతను సంతరించుకుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని అన్ని జిల్లాలు జానపద విజ్ఞాన సంపదకు పుట్టినిండ్లు. ఆ సంపదలో ప్రధానమైనది జాతరలు. ఇవి జానపద విన్యాసాలకు ప్రతి రూపాలుగా నిలుస్తున్నాయి. ఇవి జానపదులకు విజ్ఞానాన్ని, వినోదాన్ని, ఉల్లాసాన్ని కల్గిస్తాయి. ఏడాది పొడుగునా తాము పడ్డ కష్టాల్ని ఈ జాతర ద్వారా మరచిపోయి, సుఖసంతోషాల్ని అనుభవిస్తారు.

## జాతర

'శబ్దార్థ చంద్రిక'లో జాతర అంటే శక్తి యుత్సవం, ఉత్సవం అనే అర్థాలున్నాయి. ఇక్కడ శక్తి ఉత్సవం అనుట వలన తప్పకుండా "బలి" ఉంటుంది. బలిలేని జాతరలు కూడా ఉంటాయనే ఉద్దేశంతో రెండవ అర్థం ఉత్సవం అని అన్వయించుకోవచ్చు. "ఒక గ్రామానికి సంబంధించిన ప్రజలుకాని, కొన్ని గ్రామాలకు సంబంధించిన ప్రజలు నిర్ణీత ప్రదేశంలో గ్రామదేవతను ఆరాధించడం జాతర" అని డా॥ టి. నారాయణ అభిప్రాయపడ్డారు. "జాతర జానపదులు నెరుపు పండుగల కంటె సమధిక సంబరంతో చేసుకునే ఉత్సవం" అని ఆచార్య నాయని కృష్ణకుమారి అభిప్రాయబడ్డారు.

## జాతర నిర్వచనం

పై అభిప్రాయాలను బట్టి జానపదులు తాము నమ్ముకొన్న ఒక దేవాలయానికో, దేవునికో, గ్రామదేవతకో ఏడాదికొకసారి సాముహికంగా అందరూ

కలిసి జరుపుకునే మహోత్సవమే జాతర అని చెప్పవచ్చు. ఈ జాతర్లలో భక్తులు తమ మొక్కుబడులు తీర్చుకునేందుకు జంతుబలి ఇవ్వడం పరిపాటి. కొన్ని చోట్ల జంతుబలికి బదులు, జంతు ఆకారంలో చేసిన పిండి బొమ్మలను బలి ఇచ్చి తృప్తిపడేవారు కూడా కలరు. కాయ, కర్పూరం, బోనం కుండ, అన్నపుబండ్లు, రైకలు, కోరలు, కండ్లు, పసుపుకుంకుమలు భక్తులు సామాన్యంగా దేవతకు ఇచ్చే కానుకలుగా చెప్పవచ్చు. దీనిని బట్టి బలితో కూడిన, బలిలేని జానపదుల ఉత్సవమే జాతర అని చెప్పవచ్చు.

## కడప జిల్లా జాతరలు

కడపజిల్లాలో జాతర్లు ఊరూర జరుగుతాయి. ప్రధానంగా గంగమ్మ జాతర, అంకాలమ్మ జాతర, ఎల్లమ్మ జాతర, మల్లూరమ్మ జాతర, వీరనాగమ్మ జాతర, నాగారపమ్మ జాతరలు కన్పిస్తాయి.

**గంగమ్మ జాతర:** రామాపురం మండలం అనంతపురం గ్రామంలో ఈ జాతర ప్రతిసంవత్సరం జరుగుతుంది. శివరాత్రి పోయిన రెండవ రోజు (అమావాస్యనాడు)న గొప్ప తిరునాళ్ళు జరుగుతాయి. ఆ రోజు పొరుగు జిల్లాలనుండేకాక, పొరుగు రాష్ట్రాలవారు కూడా రావడం ఒక ప్రత్యేకత. తిరునాళ్ళలో చాందినీ బండ్లు, కుంకుమబండ్లు, రంగురంగుల బట్టలచే, మెరుపులచే అలంకరించి రాత్రివేళల్లో దేవతను అందులో ప్రతిష్ఠింపచేసి, రికార్డు డ్యాన్సులు చేసే స్త్రీలతో ఊరేగించడం ఒక ఆనవాయితి. అందువలననే కుంకుమబండ్లు కులుకుతూ వస్తాయి, చాందినీ బండ్లు బలె చాలుగ వస్తాయి అనే నానుడి కూడా వచ్చింది.

ఆరోజు గ్రామస్థులందరు సామాజికశ్రేయస్సుతో జంతుబలి ఇచ్చి, ఆ రక్తంకూడును ఊరి పొలిమేరల్లో చల్లి, గ్రామసంరక్షణ బాధ్యతను ఆ తల్లికి అప్పగిస్తారు. ఫలితంగా పైరుపంటలు సమృద్ధిగా పండుతాయని జానపదుల నమ్మకం. ఆరోజు దాదాపు లక్షమంది రావచ్చు. వెయ్యికి పైగా మేకపోతులు, కోడిపుంజులను జంతుబలిగా ఇవ్వడం పరిపాటి. దున్నపోతులను కూడా బలి ఇస్తారు. అందుకే "యేటికి తెగిన మేకపోతులు, కోటికి తెగిన కోడిపుంజు" అనే నానుడి కూడా వచ్చింది.

తిరుణాళ్ళరోజు దేవాలయాన్ని పసుపు, కుంకుమలతో కడిగి, తెల్లటి ముగ్గువేస్తారు. ఫాల్గుణమాసంలో ప్రతి ఆది, బేస్తవారాలలో (గురువారం) ప్రత్యేక పూజలు చేస్తారు. వ్యక్తిగతంగా బలి ఇవ్వడంలో తమ కుటుంబంలోని వారికి కలరా, గజ్జి, గోకుడు వంటి అంటువ్యాధులు సోకకుండా, తమ పంట పొలాలు చీడ, పీడల బారిన పడకుండా కాపులు, వడ్డెర కులస్తులు, గొల్లవాళ్ళు చుట్టుప్రక్కల గ్రామస్థులు ప్రత్యేకంగా మొక్కుబడులు మ్రొక్కి, తిరునాళ్ళరోజున వాటిని తీర్చుకుంటారు. ఆరోజు రైతులకు కావలసిన పనిముట్లను ప్రదర్శిస్తారు. ఈ తల్లి దగ్గర కొన్న పనిముట్లతో వ్యవసాయం చేస్తే ఫలితం లాభదాయకంగా ఉంటుందని జానపదుల నమ్మకం. ఇంకా ఈ జాతర పెద్దకుండాల (పులివెందుల), చింతకొమ్మదిన్నె (కడప) మొదలైన గ్రామాలలో జరుగుతుంది. ఈమెను చిన్నగంగమ్మ, నడివీధిగంగమ్మ, బొడ్డు గంగమ్మ వంటి పేర్లతో జానపదులు కొలుస్తారు.

**అంకాలమ్మ జాతర:** సింహాద్రిపురం మండలం గూడూరు గ్రామంలో ఈ జాతర జరుగుతుంది. చైత్రమాసం పున్నమినాడు కంకణం కట్టుకోవడంతో జాతర ప్రారంభమవుతుంది. ఆది, గురు (బేస్త)వారాల్లో నాలుగైదు వారాలుగా ఈ జాతర నిర్వహించబడును. కంకణం కట్టిన ఐదోరోజున సిడిబండిని ఒక్కొక్క ఎడ్లబండివారు కట్టుకొని దేవాలయం చుట్టు తిప్పుతారు. సిడిబండిపైన కొక్కీకి ఒక మేకపోతును వ్రేలాడదీసి ఊరేగిస్తారు. అంకెనపల్లినుండి మగవాడిగా గణాచారి వచ్చి ఆడవేషంలో కంకణం విప్పి, గుడిచుట్టూ తిరుగుతాడు. లోపల నూతల చెక్క అంకన్నగారు తోలబోణం పడ్తారు. తర్వాత కంకణం విప్పి, కత్తికి తలంబ్రాలు పోస్తారు.

తిరుణాళ్ళ రోజున కుంకుమబండ్లు ప్రత్యేక ఆకర్షణ. కడగ నాగయ్య పల్లెవారు ఈ కుంకుమబండిని అలంకరిస్తారు. ఒక పట్టుచీర నేసి తెచ్చి, దానితోనే అంకాలమ్మను అలంకరిస్తారు. తిరుణాళ్ళ రోజున దాదాపు 50 వేల మంది పాల్గొంటారు. జానపదులు తమ మొక్కుబడులు జంతుబలి, అన్నపుబండ్లు, కాయకార్పూరాలతో తీర్చుకోవడం ఆనవాయితి. గోకుడు, కలరావంటి అంటువ్యాధులు రాకుండా జానపదులు మొక్కులు మొక్కి, వాటిని ఈ తిరుణాళ్ళలో తీర్చుకోవడం ఒక సంప్రదాయం.

**ఎల్లమ్మ జాతర:** కమలాపురం మండలం పెద్దచెప్పలి గ్రామంలో ఈ జాతర జరుగుతుంది. ఇక్కడ బ్రాహ్మణులు పూజారులుగా ఉండటం ప్రత్యేకత. ప్రతి యేడాది చైత్ర, బహుళ ఏకాదశి నుండి వైశాఖ శుద్ధ పాడ్యమి తుదివరకు ఈ జాతరను నిర్వహిస్తారు. ఆ రోజు దేవతను మూడు గ్రామాలమీదుగా ఊరేగింపు చేసి తీసుకువస్తారు. అవి పెద్ద చెప్పలి, ఎల్లారెడ్డిపల్లి, ఈదిగపల్లి. రోజుకు రెండు మార్లు అలా ఐదు రోజులు ఊరేగిస్తారు. మొత్తం ఏడురోజులు తిరుణాళ్ళు జరుతాయి. ఆరవరోజు బండలాగుడు పోటీలు ఉంటాయి. మొదటిరోజున కట్టిన కంకణహారం చివరిరోజు రాత్రి 9 గంటలకు బ్రాహ్మణులచే విడదీయటంతో జాతర ముగుస్తుంది.

ఎల్లమ్మ దేవత గురించి ఒక లీలాకథ ప్రచారంలో ఉంది. ఈడిగపల్లి పుత్తావారిఇంట్లో గాటిలో ఒక శిలగుండం మట్టిలో పుట్టిందట. ఆ శిలే ఆడబిడ్డగా పుత్తావారు చూసుకునేవారట. అప్పటినుండి పుత్తావారు పెద్ద చెప్పలికి దూరమయ్యారట. తిరుణాళ్ళ రోజున ఈడిగపల్లె నుండి పెద్ద చెప్పలికి దేవతను తీసుకువస్తారు. పుత్తావారి వంశంలో తాము పుట్టడం వల్ల తన సంబంధీకులు గ్రామపొలిమేరలు దాటి ఉండాలని కొందరికి దేవతకలలో చెప్పడంతో ఆ వంశీయులు పెద్ద చెప్పలిగ్రామం విడిచి ప్రక్కగ్రామంలో స్థిరపడినట్లు జానపదులు చెప్తారు. అమ్మవారికి టర్పోమిషనరీ వారి అధీనంలో తోటసుబ్బారావు వెండి కిరీటాన్ని బహూకరించాడు. శ్రీమతి ఇంద్రావతమ్మగారి ఆధ్వర్యంలో ఈ కిరీటాన్ని తిరుణాళ్ళ రోజున దేవతకు అలంకరింపచేసి ఉత్సవాలు జరుపుకోవడం ఆనవాయితి.

**వీరనాగమ్మ జాతర:** వీరబల్లి మండలం మాదిరెడ్డిపల్లి గ్రామంలో ఈ జాతర జరుగుతుంది. ఈమె నాయినోళ్ళ కులదేవత, భర్త వీరవెర్రినాయుడుతో ప్రతి సంవత్సరం ఫాల్గుణమాసంలో పున్నమిరోజు తర్వాత వివాహ కార్యక్రమాన్ని మూడు రోజులుగా తిరుణాళ్ళ రూపంలో చేస్తారు. మొదటి రోజు దేవతను గుడిలోకి తెచ్చేటప్పుడు అరివేణి, పాలకొమ్మలతో ఊరేగింపుగా తీసుకు వస్తారు. రెండవరోజు చాందినీ బండ్లు కట్టి మొక్కులు తీర్చుకుంటారు. ఆ రోజు బీదసాదలకు అన్నదానం చేస్తారు, అగ్నిగుండం కూడా ఏర్పాటు చేస్తారు. అందులో పిల్ల, పెద్ద దిగి నడుస్తారు. మూడవరోజు బ్రాహ్మణులచే ఘనంగా పెండ్లి చేస్తారు. ఎన్ని కష్టాలు వచ్చినా, ఈనాటికీ ఆ ఊరి నాయినోళ్ళు ఈ దేవత పెండ్లిని ఘనంగా జరుపుకోవడం జానపదుల విశ్వాసానికి ప్రతిరూపంగా నిలుస్తోంది.

ఈ దేవతకు పూజారి రాజమ్మ. ఈమె నాయినోళ్ళ కులస్థురాలు. ఈమె గురుగింజ కుంటుకోడలు , గాలివీటి ఆడబిడ్డ. సొంత ఊరు వెంకటాపురం, అత్తగారి ఊరు చింతరాసుపల్లె. ఈమె ఒకరోజు గొర్రెపిల్లలకు బదులు మేకపిల్లను బలి ఇవ్వడంతో దేవత ఆగ్రహించి, ఎద్దురూపంలో వచ్చి ఆమెను పొడిచిందని, ఫలితంగా ఆమె శరీరం తెలుపుగా మారిందని ప్రత్యక్ష సాక్షుల కథనం. అలాగే ఆమె కుమారున్ని పిచ్చికుక్క కరవడం వలన అతడు పిచ్చివాడై కుక్క అరుపు అరచి చనిపోయాడని అంటారు. దీనికి కారణం వీరనాగమ్మ కన్నెర్ర చేయడమేనని వారి నమ్మకం. అందువలన జానపదులకు ఈమె అంటే మిక్కిలి భయం.

**నాగారపమ్మ జాతర:** సుండుపల్లి మండలం పెద్దనేని కాల్వ గ్రామంలో ఈ జాతర జరుగుతుంది. ప్రతి సంవత్సరం ఆషాడం మొదటి వారంలో ఈ తిరుణాళ్ళు మూడు రోజులు నిర్వహించబడును. ఈమె రాజకుల కులదేవత. ఇక్కడ పూజారులు కూడా రజకులే ఉంటారు. ఈ జాతరలో శనివారం దాసర్లు, ఆదివారం జాగర్లు, సోమవారం బండలాగడం ఉంటాయి. ఈ రోజున గుడిచుట్టూ చాందినీ బండ్లను తిప్పుతారు. తిరుణాళ్ళకు పది రోజుల ముందు దేవతను పల్లకీలో తీసుకొని పోయి చుట్టూ పల్లెల్లో ఊరేగింపు చేసి, విరాళాలు సేకరిస్తారు. ఈ డబ్బుతో జాతరను ఘనంగా నిర్వహిస్తారు.



సంతానం లేని వాళ్ళు, అనారోగ్యం పాలైన రోగులు మొక్కులు మొక్కి తిరుణాళ్ళ రోజున జంతుబలుల రూపంలో వాటిని తీర్చుకుంటారు. ఈ గ్రామం చుట్టుప్రక్కల గ్రామస్థులు దాదాపు 40వేలమంది పాల్గొంటారు. వేయికి పైగా జంతుబలి కన్పిస్తుంది.

**మల్లూరమ్మ జాతర:** చిన్నమండెం మండలం మల్లూరు గ్రామంలో ఈ జాతర జరుగును. ఈమె కులదేవత, గ్రామదేవత. ఇంజేటి గ్రామ చంద్రయ్య ఆధ్వర్యంలో మూడు సంవత్సరాల కొకసారి తిరుణాళ్ళ పేరుతో ఉత్సవం జరుగుతుంది. మార్చినెల పౌర్ణమి నుండి రెండు రోజులపాటు నిర్వహించబడుతుంది. బలి జరుగక మునుపు బ్రాహ్మణులచే పూజలు చేయిస్తారు. బలి జరిగిన తర్వాత కురవలు పూజలు చేస్తారు. కాపు, బలిజ, కురువ, సుగాలి, ఎరుకలు, నాయిక్‌లు ఈ దేవతను కులదేవతగా కొలుస్తారు. మిగిలిన కులాలవారు చుట్టుప్రక్కల గ్రామస్థుల గ్రామదేవతగా ఆరాధిస్తారు. తిరునాళ్ళ రోజు చాందినీ బండ్లు కట్టి భోగంవారితో పాటలు పాడిస్తూ, దేవతను ఊరేగించడం ఆనవాయితి. ఆరోజు బయిండ్లోండ్లు, ఆసాదులు కథలు చెప్పి జానపదులను రంజింపచేస్తారు. ఉత్సవంలో దాదాపు 40వేలమంది చుట్టుప్రక్కల గ్రామాల భక్తులు పాల్గొంటారు. ఐదువందలకు తక్కువ లేకుండా జంతుబలి జరుగుతుంది.

## గ్రామ దేవతలను పూజించడంలో ఆంతర్యం

జానపదుల అభిమతంలో గ్రామదేవతలను పూజించడం వల్ల తమకు, తమ బంధువులకు గజ్జి, గోకుడు, అమ్మవారువంటి వ్యాధులు సోకకుండా ఉంటాయనే నమ్మకం ప్రబలంగా ఉంది. అలాగే సంతానం లేనివారు రావిచెట్టును పూజించడం మనం చూస్తున్నదే. అలా సంతాన ప్రాప్తులవడం మనం గమనించదగింది. అలాగే సామాజికంగా గ్రామస్థులందరు గ్రామసంరక్షణ బాధ్యతను గ్రామదేవతపై పెట్టి, ప్రకృతి సంపదలు కాపాడమని వేడుకుంటారు. తనవారికి, తన పశుసంపదకు అంటువ్యాధులు సోకినప్పుడు గ్రామదేవతకు పొంగలిపెట్టి పూజించి, జంతుబలి ఇచ్చి ఆమె ముందున్న

బండారును ఇసుకలో కలిపి పైర్లమీద చల్లడం కూడా మనం చూస్తున్నాం. అమ్మవారు సోకిన వారికి ఆ బండారు పసుపునీళ్ళతో కలిపి శరీరానికి పూయడం కూడా చూస్తున్నాం. ఈ బండారు పసుపు తమ కష్టాలను నివారిస్తుందని జానపదుల విశ్వాసం. అలాగే చెరువులు నిండాలని, నిండిన చెరువులు తెగకుండా, గండ్లు పడకుండా వుండేందుకు కట్టమీద గ్రామదవేతను ప్రతిష్ఠించి ఊరంతా కలిసి దేవర రూపంలో దేవత అనుగ్రహాన్ని పొందుటకు ప్రయత్నిస్తారు.

జానపదుడు తనలో కల్గిన ఈ నమ్మకాలను విశ్వాసాలను ఆధారంగా గ్రామదేవతలను పూజించడం ఆచారంగా, సాంప్రదాయంగా భావించాడు. తద్వారా భక్తితో, శాంతియుత క్రమశిక్షణ జీవితానికి అలవాటుపడ్డాడు. ఈ దేవతలవల్ల భయంకరమైన వ్యాధులు వస్తాయని, వాటివల్ల ప్రాణనష్టం జరుగుతోందని గ్రహించాడు. ఫలితంగా వారిని సంతృప్తి పరచేటందుకు నియమానుసారంగా జాతర్లు నిర్వహించి జంతుబలిని ప్రోత్సహించాడు. ఈ బలిద్వారా గ్రామదేవత శాంతించి, గ్రామసంరక్షణ బాధ్యతను చేపట్టి, అరిష్టాలను నివారిస్తుందని జానపదుల విశ్వాసం.

## గ్రామదేవతల జాతర్లు -ప్రాధాన్యత

ఈ జిల్లాల్లో సాధారణంగా గ్రామదేవతల జాతర్లు ఎప్పుడెప్పుడు జరగాలో ఆయా ప్రాంతాల వారికే తెలుసు. ఆదినం రాగానే ఒకటి రెండు రోజుల ముందే గ్రామస్థులు చాటింపు వేస్తారు. ఈ జాతరలన్నీ తెలుగు తిథులు చాంద్రమాసం ప్రకారం జరుగుతాయి. అంగ్లమాసం ప్రకారం ఈ జాతర్ల తేదీలు మారుతుంటాయి. అందువలననే ఆయా జాతర నిర్వాహకులు తెలుగు తిథికి సరియైన అంగ్ల తేదీని ఎప్పటికప్పుడు నిర్ణయించి ముందుగానే ప్రకటిస్తారు. ఊర్లో చాటింపు వేస్తారు. ఇప్పుడైతే కరపత్రాలు, పత్రికలలో ప్రకటనలు కూడా రావడం మనం చూస్తున్నాం. ఈ జాతర్లు కొన్ని చోట్ల మూడు రోజులు, కొన్నిచోట్ల ఏడు రోజులు ఎక్కువగా జరుగుతాయి.

గ్రామదేవతల ఉత్సవాలు ఒకే తిథిలో జరగాలనే నియమం ఏమీ లేదు. కాని ఏ మాసం, ఏఏ వారాలలో చేయవలెనో నియమం ఉంది. ఎక్కువ శాతం ఆది, మంగళ, శుక్రవారాల్లో చేస్తారు. సాధారణంగా పుష్యమాసం నుండి వైశాఖమాసం వరకు జరుగుతుంటాయి. దీనికి కారణం జానపదులకు సంక్రాంతికి పంటలు చేతికి వస్తాయి. అప్పటి నుండి వ్యవసాయపనులకు కొంచెం వెసలుబాటుగా ఉంటుంది. జ్యేష్ఠమాసం పౌర్ణమిలో వర్షాలు మొదలవుతాయి. వ్యవసాయం పనులు ఆనాటి నుండి ఆరంభమౌతుంటాయి. అందువల్ల ఈ మధ్యకాలంలోనే ఈ గ్రామదేవతల జాతరలు జరుపుకుంటారు. గ్రామదేవతల జాతరలో ప్రధానమైంది బలి, ఈ బలిలో దున్నపోతులు గాని, పొట్టేలు, మేకపోతులు గాని, కోళ్ళను గాని సమర్పిస్తారు. బలి ఇచ్చేవాటికి అంగలోపం వుండకూడదు. ప్రభుత్వం ఈనాడు బలిని నిషేధించింది. అయినా జానపదులు బలివ్వడం మానలేదు. దున్నపోతులను, యాటలను, కోళ్లను బలి ఇవ్వడం సర్వసాధారణం. శాకాహారులు తీపి వంట కాలను నైవేద్యం పెట్టి బెల్లం నీళ్ళు సాకను పోస్తారు. తాము తినబోయే పదార్థాన్ని మొదట దేవతకు సమర్పించి, పిదప తాము భుజించాలనే నమ్మకమే ఈ బలి, సాక వెనకాల ఉన్న తత్వం.



ఇష్టదేవతల ఆలయాలలో పూజారులు విద్యావంతులు కావడం వల్ల అర్చన, హారతి, గోత్రాదులు అడిగి సంప్రదాయకంగా పూజలు చేస్తారు. కాని గ్రామదేవతల ఆరాధనలో పూజారులకు మంత్రాలు రావు. హారతి మాత్రం ఇస్తారు. బండారు ఇస్తారు. టెంకాయలు బయటనే కొట్టి ఇస్తారు. బలి ఇచ్చే జంతువులను మేళతాళాలతో దేవత చుట్టూ తిప్పుతారు. ముందు బోనం వుంటుంది. వెంబడి బలిపశువుతో భక్తులందరూ గుడిచుట్టూ ఐదుసార్లు ప్రదక్షిణ చేస్తారు. జంతుబలి కూడా ఆయా ప్రాంతాలకుగల సంప్రదాయాన్నిబట్టి పదునైన కొడవలితో ఒకేసారి నరకడం, గొంతు కోయడం, ఆటవికులైతే రక్తం చిందించకుండా మెడ తిప్పడం, నలిగిపోయేటట్లు చేయడం, ఊపిరి ఆడ కుండా చేయడం, ఎత్తు నుండి తోసేయడం వంటి పద్ధతులున్నాయి.

మన దేశంలో అనాదిగా పౌర్ణమి, అమావాస్య వంటి శుభ తిథులలో సెలవు ఉత్సవాలు జరుపుకోవడం శిష్టులకు అలవాటు. తర్వాత వారానికి ఒకసారి సెలవుదినంగా జరుపుకొనే పాశ్చాత్యులపద్ధతి మనకు అలవాట యింది. అలాగే ఏడాది పొడుగున కష్టపడే జానపదులకు కూడా విశ్రాంతి, వినోదం అవసరం. అందుకు భక్తితోడై ఏడాది కొకసారి జాతర రూపంలో విశ్రాంతి, వినోదాత్మకంగా భక్తి ప్రదర్శనలు గ్రామదేవతకు జరుపుతూ వుంటారు. సాధారణంగా అనారోగ్యం, ఆపదలు వచ్చినప్పుడు తమ ఆరాధ్య దేవతకు ముడుపు తీసి కడతారు. దీనిని వచ్చే జాతరలోపుగా మొక్కుబడి రూపంలో చెల్లించుకుంటారు.

"తినకుడవ తీర్థం పోవలె" అనగా పేదలైన జానపదులు ఏడాది కొకసారి జరిగే జాతర్లలో మద్యమాంసాలు దేవత పేరుమీదుగా ఆరగించి, ఆనందిస్తారు.

ఈ జాతరలు జానపదుల సమ్మిశ్రణ ప్రదర్శన అని చెప్పవచ్చు. దైవంపై భక్తి, మతంపై రక్తి, యాత్రా వినోదం, జాతర్లలో అనేక వస్తువులను కొనుక్కోవడం వారి ముఖ్యఉద్దేశం. జాతర ఒక వినోదయాత్ర. అనగా పాటలు పాడేవారు, ఆటలాడేవారు, యక్షగానాలు, నాటకాలు, తోలుబొమ్మలాటలు, చెక్కభజనలు అన్నీ ప్రదర్శిస్తుంటారు. ఈ కళాకారులు ఊరూరు తిరిగి వీటిని ప్రదర్శించాలంటే వ్యయ

ప్రయాసలతో కూడుకున్నది. అందుకే ఇలాంటి జాతర్లలో జానపద కళాకారులు తమ కళలను ప్రదర్శించి జానపదులకు ఆనందాన్ని కల్గిస్తారు.

పల్లెటూళ్ళలో జానపదులకు జాతర్ల ప్రాధాన్యం, అవసరం కూడా వుంది. కారణం వారికి వ్యవసాయానికి కావలసిన పనిముట్లు ఈ జాతర్లలో దొరుకుతాయి. జానపదులు జాతర్లకు పోయి ఏమి తెచ్చావురా! అని అడుగు తుంటారు. అప్పుడు వెంటనే పలుగో, పగ్గమో, మువ్వలదండో, మొచ్చుగత్తో, కొడవలో, చెర్నకోల వంటి సామాగ్రి తెచ్చానురా అంటారు. అలాగే ఒకనాడు ఇత్తడి, రాగి, కంచు సామాగ్రి జాతర్లలో తప్ప ఎక్కడ దొరికేవి కావు. ఇప్పుడు వాడవాడకో దుకాణం వుంది. ఒకనాడు ఇవి అన్నీ సంతలో దొరికేవి. ఈనాడు జాతర్లలో దొరుకుతున్నాయి.

జాతర్లు కుల, మత భేదం లేకుండా జానపదులందరిని ఒకతాటి మీద నడిపించేవి. ఉత్సవాలు, గ్రామాలు విడిచి వృత్తిరీత్యా దూరదేశాలకు పోయినవారు, ఏడాదికొకసారి వారిగ్రామంలో జరిగే జాతరకోసం రావడం నేటికి వుంది. ఇది జానపదుల విశ్వాసానికి ప్రతిబింబం. అలాగే జానపదులు తమ సంతానానికి ఏ శుభకార్యం జరిపినా తమ ఇలువేల్పు జాతర్లలో జరిపించుట ఆచారం. జానపదులు తమగ్రామంలోని జాతరకు ఆడపడుచులను, అల్లుళ్లను పిలిపించుకొనే ఆచారం నేటికి ఉంది. ఈ నెపంతో ఇంటికి సున్నం కొట్టుకునే ఆచారం ఇప్పటికీ కొనసాగుతోంది.

ఈ విధంగా జాతరలు జానపదుల జీవితంలో విడదీయరాని బంధంగా పెనవేసుకుని వున్నాయని నిస్సంశయంగా చెప్పవచ్చు.

## ఆధార గ్రంథాలు


1. జానపదుల నమ్మకాలు — డా॥ జి.ఎస్.మోహన్
2. తిరుపతి గంగ జాతర — డా॥ పేట శ్రీనివాసరెడ్డి
3. నల్గొండ జిల్లా జాతరలు - ఒక పరిశీలన — డా॥ చింతల యాదయ్య
4. జానపద సరస్వతి — ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు
5. కడపజిల్లా గ్రామదేవతలు — డా॥ ఎస్. పద్మనాభరెడ్డి
6. చిత్తూరు జిల్లా గ్రామదేవతలు — డా॥ టి. నారాయణ


# గురువయ్యల నృత్యం


డా॥ బి. రామాచార్యులు
తెలుగు ఉపన్యాసకులు
ఎస్.ఎం.ఆర్. డిగ్రీ కళాశాల, హైదరాబాద్.


గురువయ్యలు కురవ (బ) వంశస్థులు. ఈ వంశంలో పెద్ద కుమారుడు లేదా చిన్నకుమారుడు తప్పనిసరిగా గురవయ్యకావాలి అని వారే స్వయంగా తెలియజేసారు. శ్రీశైల మల్లికార్జునునిపై అనేక భక్తిపాటలు పాడతారు. కర్నూలు జిల్లా, అనంతపురం జిల్లాలో గురవయ్యలు తయారవు తున్నారు. గురవయ్యను తయారు చేయాలంటే గురువు లేదా 'గణాచారి' అవసరం. గురువులు కర్నూలు జిల్లాలో ఆలూరులో 'గట్టుమల్లయ్య కొండ'లో ఉన్నారు. గణాచారులు అనంతపురం జిల్లా 'కాట్నేకాలవ'లో ఉన్నారు.

ఈ జిల్లాలో ఉండే కురవ వంశస్థులు గురవయ్యలు కావాలంటే పిల్లవాన్ని గట్టుమల్లయ్య కొండలో మల్లేసుని గుడి దగ్గరికి తీసుకువెళతారు. అక్కడ కోనేటిలో స్నానం చేయించి నల్లకంబడి పరచి జాడిపోసి కూర్చో బెడతారు. పిల్లవాని మేనమామ పాలతో ప్రమాణం చేయిస్తాడు. అప్పుడు అక్కడుండే గురువు (కులపెద్ద) గవ్వలతో కూడిన దండను 'ముద్రదానం' చేస్తాడు. ముద్రదానాన్ని పిల్లవాని మెడలో కడతాడు. గురువు పాదాలకు నమస్కరించి కానుక సమర్పించుకొంటారు. పిల్లవానికి గురువు చెప్పే మాటలు.

**"మనకుల వృత్తికి ద్రోహం చేయకూడదు, ఇతరులను మోసం చెయ్యొద్దు అబద్ధం చెప్పొద్దు"** అని పిల్లవాని నోటి వెంబడి పలికిస్తాడు.

ఇలా ప్రమాణం చేయించిన పిల్లవాడు ఆ వంశంలో కోటీశ్వరు డైనప్పటికి 'సంక్రాంతి' పండుగ నాడు మాత్రం గురవయ్యగా అలంకరించుకొని 'ఐదు ఇండ్లు' అడుక్కొని రావాలి. ఇది వంశపారంపర్యంగా జరగాల్సిన విషయం. మెడలో గవ్వల దండను ధరించి, నల్లకమ్మిడి (కంబళి) శరీరమంతా కప్పుకొని (కుట్టించుకొని), ఎడిచేతిలో డమరుకాన్ని, ఎడమచేతిలో పిల్లనగొయి (పిల్లన గ్రోవి) పట్టుకొని, కాళ్ళకు గజ్జెలు కట్టుకొని, తలకు కిరీటంలాగా ఎలుగు బంటి చర్మాన్ని ధరించి, నుదుట బండారుపెట్టి, నడుముకు జింక చర్మంతో చేసిన బండారు తిత్తి (సంచి) ని కట్టుకొని,

ప్రతి ఇంటికి పోయి అడుక్కొంటూ, ఇంటిలోని పిల్లలకు, పెద్దలకు బండారు బొట్టుపెడ్తూ, ఢమరుకాన్ని వాయిస్తూ, పిల్లనగ్రోవి నూదుతూ ఇలా పాడుతారు:

"శివా మల్లేశ్వరా
బండారుదయ్యా
కాపాడప్పా
పిల్లలను పెద్దలను దీవించు
గాబెద్దులు కలిగి
గూటావులు కలిగి
కోటి సంపదలు కలిగి
కనక పాత్ర కలిగి
మల్లేసునట్ల మగబిడ్డగలిగి
మల్లికార్జున నీపాద పద్మాలకు
నమస్తే" అని

గురవయ్యలంతా 'దసరా' పండగనాడు ఆలూరులోని మల్లేశ్వర స్వామి సన్నిధిలో వివిధ పద్ధతులలో పాటలు పాడుతూ నాట్యం చేస్తారు. అంతేగాక వారి శరీరం నుంచి కొంత రక్తాన్ని తీసి 'ధారపోసి' దేవునికి నైవేద్యం చేస్తారు. వీరి నాట్యపద్ధతి కూడా చాలా వింతగా ఉంటుంది. చివరిగా కుక్కల మాదిరిగా అరుస్తూ, కొట్టుకొంటూ తర్వాత నాలుకతో పాలుతాగుతారు. దీనికి నిదర్శనంగా గురవయ్యలు చిన్న పిల్లల్ని చూస్తే తిప్పుకొని పోతారు. వారి చెవులు కొరుకుతారు. అందుకోసం గురవయ్యల్ని చూస్తే చిన్నపిల్లలు భయపడతారు.ఢమరుకం శబ్దాన్ని వింటూనే పిల్లలు జడుసుకోవడం కూడా ఉంటుంది.

గురవయ్యలు నృత్యం చేస్తున్నప్పుడు పాటలు పాడరు. పాటలు పాడేసమయంలో డమరుకాన్ని ఒక వైపు మాత్రమే నాలుగువేళ్లతో వాయిస్తారు. ఇళ్ల దగ్గరకొచ్చి అడుక్కొనే సమయంలోనూ, నృత్యం చేసే సమయంలోనూ ఢమరుకాన్ని వాయిస్తారు. పిల్లనగ్రోవిని లయాత్మకంగా ఊదుతారు. ఢమరుకం నుంచి పుట్టే ధ్వనులిలా ఉంటాయి.



"డడ బుడ్డ బుడ
యిరడ డడబుడ్డ
బుడబుడ్డ బుడ్
బుడబుడ్డ బుడ్
బుడబుడ్డ బుడ్"

బుడ బుడ్డ బుడ్
బుడ బుడ్డ బుడ్
బుడ బుడ్డ బుడ్

గురవయ్యల నృత్యాన్ని ఒకరు మొదలు ఎంత మందైనా చేస్తారు. అయితే సరిసంఖ్యలో పాల్గొంటారు. ఇల్లిల్లూ తిరిగే సమయంలో ఒకరు మాత్రమే నృత్యం చేస్తారు. ఇళ్ల ముంగిట ఢమరుకాన్ని వాయిస్తూ పిల్లన గ్రోవిని ఊదుతూ గుండ్రాకారంగా తిరగటం, ఒక్కొక్క కాలితో నేలపై కొట్టడం, తలను తిప్పటం, పిల్లల్ని భయపెట్టడానికి డమరుకాన్ని ఉన్నట్టుండి 'బడ్‌బుడ్డ' మనే శబ్దాన్ని వాయిస్తూ పరిగెత్తడం, నడుమును వయ్యారంగా ఆడించటం చేస్తారు.

సరిసంఖ్యలో పాల్గొని నృత్యం చేసే సమయంలో ఒక్కొక్కరు వరుసగా అందరూ నిలబడి ఢమరుకాన్ని ఒక్కసారిగా 'బుడబుడ్డబుడ్' అనే గీతిలో వాయిస్తుండగా అందరూ మొదటిగా గుండ్రాకారంగా తిరిగి వరుసలో నిలబడతారు. తర్వాత ఒక్కొక్క వరుసలో వారు ఎదురుబదురుగా పోటీగా అడుగులు వేస్తూ కూర్చొని లేవటం, కూర్చొని తిరగటం, ఒక్కొక్క అడుగు వేసుకొంటూ వరుసలోని వారు ఇంకో వరుసలోనికి మారుతారు. అలా మారిన తర్వాత ఇంకో జత అలాగే చేస్తూ మారుతారు. ఇలా ఎంత మంది ఉంటే అందరూ ఒకటయి వరుసలోని వారంతా రెండవ వరుసలోకి, రెండవ వరుసలోని వారంతా ఒకటవ వరుసలోనికి మారుతారు. ఇంత చేస్తున్న డమరుకం పిల్లనగ్రోవి వాయిస్తూనే ఉంటారు. తర్వాత అందరు గుండ్రాకారంగా తిరుగుతూ ఒక్కొక్క కాలిని నేలపై కొడుతూ మార్చుకొంటూ ఉంటారు. ఢమరుకం 'బుడబుడ్డబుడ్' అనే గతిలోనే వాయిస్తూనే నృత్యం చేస్తారు.

తర్వాత ఒకరు పాట పాడుతుండగా మిగిలిన వారు అందరూ ఢమరుకాన్ని ఒక ప్రక్క మాత్రమే నాలుగు వేళ్ల సహాయంతో వాయిష్తూ వంత పాడుతారు. అప్పుడు పుట్టే ధ్వనులిలా ఉంటాయి.

తక తక్క తక
తక తక్క తక
తక తక్క తక

ఒకరు పాడుతుండగా మిగిలిన వారందరూ, పాటకు వంత పాడుతారు. అలా అన్ని గొంతులు కలపడం ఒకొక్క కాలిని కొందరు నేలపై కొడుతుంటారు. అప్పుడు గజ్జెలు నినదిస్తూ ఉంటాయి. అలాంటి పాట.

శివుడు నీవయ్య శ్రీశైలమల్లయ్య
కానగరావయ్యా శివయ్య
సిక్కుజడలవాడు శివనీలకంటుడు
పైనిండ యీ బూదీ మహాశివుని
మెడలోన రుద్రాక్షలూ దేవాదిదేవా ॥శివుడు॥

సన్నా కమ్మడితెచ్చి సరిమడత వేయించి
సన్నగమ్మిటి మీదమ్మా మహాశివుని
గుండుమల్లెలుపోసి దేవాదిదేవా ॥శివుడు॥

గుండు మల్లెలపైన శివుని కొప్పిరిపెట్టి
పాలు బెల్లంపోసేనే మహా శివుని
మనసార తను కొలిసెనే దేవాదిదేవా ॥శివుడు॥

వారమారమునాడు సోమవారదినము నాడు
నానందమయ్యేడు శివుడు నానందమయ్యేడు ॥శివుడు॥

ఢమరుకాన్ని కొద్ది మార్పు చేస్తూ పాడే పాట మల్లేసుని వేటవర్ణనకు సంబంధించినది. వేటలో పరుగెత్తటం సహజం. అలాగే పాటలోనూ, వాద్యం వాయించే సమయంలోను బిరబిరా పాడటం వాయించడం ఉంది. పాటంతా బిరబిరా పాడుతారు. పల్లవిని అందరూ కలిసి పాడుతారు. డమరుకం నుండి పుట్టే ధ్వనులిలా ఉంటాయి.



"తక తక తక్
తక తక తక్
తక తక తక్
తక తక తక్"

యాట వెళ్లిన చూడరే మల్లేసుడు
యాట వెళ్లిన చూడరే మల్లేసుడు
స్వామి యాటకెళ్లిన చూడుకాడు కాపురమందు
సాటిలేని గట్టిసామి మల్లేసుండు ॥యాట॥

సామి మేలు బండరి నాదమేటి వసంతూరు
బూర్వ బండేశ్వరుల బంగారు గొలుసులు
పైరేన 'బగ్గులు' పెద్ద గంగుళమ్మ
సేరి తుప్పెదవేళె నిలియలిద్దరుగూడి
సేవసేవకులంత సేసేరు నీ సేవ
వాలుక జగమెల్ల మేలేటి సామి ॥యాట॥

సామి మెరుపు చందన కాయమెరుపు చందనకాయ
మెడనిండా తెల్యాలు మండు గంగవసాలు
ముడిసి పుట్టిన బోసికున్నులు దాగిన గురనీల జంగాము
కన్నె జింకను బట్టి కొంత యీబూదిని బట్టి
తనలోన బల్కిన శివనీల కంటూడు ॥యాట॥

చూడరమ్మ వందనిండ్లు చూడరమ్మ
చురటీలు జిమిటీలు చూడుగ వెలుగాయె
గగనకి ముట్టంగ కడిలారనే పరష
కడను కర్నూలువరకు, ఏవంక చూసినా,
వెలలేక నీ పరసు ॥యాట॥

శివరాత్రినాడు 'మల్లయ్యకొండ'కు ఎలా గురవయ్యలంతా పోతూ పాటలెలా పాడుతారో తెలిపేది ఈ పాట. శివరాత్రికి పోతూ పోతూ మధ్యలో వచ్చే గ్రామాల వారికి తెలియచేయాలనే సత్సంకల్పంతో పాటలో ఆమల్లయ్య కొండను, దేవాలయాన్ని గూర్చి తెలియచేయటం, కష్టాలు కడతేర్చే దేవుడు, కోనేరులోతు పాతులు తెలియవంటూ కోనేరు ప్రస్తావన చేయటం, మల్లయ్య ఒంటిస్తంభం మేడలో నివసిస్తున్నాడని అందరికి పాటరూపంలో తెలియచేస్తూ కొండకెళతారు. ఈ పాటలో పల్లవి ఎత్తుకొనే సమయంలో చివరిగా రెండు పదాలు పల్లవిలాగ ఆలపించడంతో పాటకొక తూగు వూపు వస్తుంది. డమరుకం 'తక తక తక' గతిలో కొడుతూంటారు.

శివకొండకని పోదాము రారమ్మ
మల్లయ్య కొండసామినే చూతాము రారమ్మ
శివాపురమికి పరమటంట
శిద్దులేలే మల్లయ్య కొండ
సిన్నగనే పోదాము రారామ్మ
ఆపరవతాలకు మెల్లగనే పోదాము రారమ్మ ॥శివయ్య॥

శివమల్లిపూవలు కోనలోన
మల్లికార్జునుడున్నాడంట
యిష్టముతో పూజించేవారికి
కష్టములు యెడబాపెదేవుడు
సిన్నగనే బోదామురారమ్మ
ఆ పరవతాలకు మెల్లగనే పోదాము రారమ్మ ॥శివయ్య॥

కొండపైన దేవళంబు
కొండదిగవన మందిరంబు
మందిరంబులో వెలిగేటి
మల్లికార్జునుడున్నడంట
సిన్నగనే పోదామురారమ్మ



లోతైన కోనేరంట
గాతమెవరికి తెలియదంట
అందులోన స్నానంబుచేసి
నిండ మోక్షంబుకలిగె కొండ
సిన్నగనే పోదాము రారమ్మ
ఆ పరవతాలకు మెల్లగానే బోదాము రారమ్మ ॥శివయ్య॥

గల్లు గల్లున తేనెగ దవమ్మ
ఆ పరమశివుడు యెన్ని మాయలు గల్లవాడమ్మ
సుట్టు తిరిగె కొండలవిగో
నట్టనడుమ దేవళంబు
ఒంటిస్తంబము మాలలోన
ఒక్కడే మల్లయ్య నిలిసె ॥శివయ్య॥

రెండు మూడు చరణాలు అయిన తర్వాత చివరలో పల్లవి ఉంటుంది. గేయానికి అనుగుణంగా ఆ పల్లవి ఉందా అనిపిస్తోంది. ఢమరుకం వాయించేటప్పుడు నాలుగు వేళ్లలో నడిమి వేలితో గట్టిగా కొడుతూండగా 'బుడబుడ్డ' మనే శబ్దం వస్తుంది. మల్లయను నిద్రలేపుమని తెలిపే మాట గేయానికొక తూగునిస్తోంది. గేయాన్ని ఒకరు పాడుతుండగా మిగిలిన వారంతా వంతపాడుతారు. పల్లవి కొన్ని చరణాలు పాడిన తర్వాత మొదలవుతుంది. అలాంటి గేయం:

కూరువత్తె మెలారులింగ జడ జడాలింగాలు
పాములే వరనంబు పార్వతీమల్లయ్య
మల్లయ్యను లేపురమ్మ
మల్లయ్య పూజారి మైలారులింగన్న
సద్గురుని లేపురమ్మ
పరమట దేశాన పాలుకావల్లొచ్చె

పంచనే దిగినాయి మల్లయ్యను లేపురమ్మ
మల్లయ్య పూజారి మైలారులింగన్న
సద్గురుని లేపురమ్మ

దక్షిణమ్ము దేశాన టెంకాయ ఓంబాళు
ఒప్పగనే పంచుకొలువు చేరున్నాయి
మల్లయ్యను లేపురమ్మ సద్గురుని లేపురమ్మ
జీనిగుల కుంటకు జిముకులొచ్చినాయి
వేట మార్గముతోన మల్లయ్యను లేపురమ్మ
కానుగలగుంటాకు కముజులొచ్చిన్నాయి
వేట మార్గముతోన మల్లయ్యను లేపురమ్మ
మల్లయ్య పూజారి మైలారు లింగన్న
సద్గురుని లేపురమ్మ

ఢమరుకాన్ని బిరబిరా వాయిస్తూ పాడేవ్యక్తి నేలమీద కుడికాలిని కొడుతుండగా మిగిలిన వారంతా అతనికి వంతకలుపుతారు. పల్లవిని ఎత్తుకొనే సమయంలో చివరిపాదాన్ని రెండు సార్లు పాడుతారు. అలాంటి సమయంలో కుడికాలును లయాత్మకంగా నేలపై కొట్టడంతో గేయానికొక ఊపు వస్తుంది. ఢమరుకం 'బుడబుడబుడ' మనే గతిలో వాయిస్తుంటారు.

శివుడు కాటిలో వుండే భూతాలను 'సిండాము' తొక్కించినాడని సోమవారం నాడు జంగమయినాడు కాబట్టి పూజిస్తున్నారని తెలిపే గేయం:

మనయింటి మల్లయ్య మనయింటి మల్లయ్య
వేటలాడేబోగతిరుబాయె గారు యింటిమందు
ఆ కోని వస్తేను పల్లు బోయంగ

మాపిటికి మందాకు రావయ్య
మందాకు పెద్దోడు బోయడుమారెన్న



కనుకొన్న కాముదేవుడమ్మ
నేనే మానలేడు శివుడు తానల అలిగినాడు ॥మన॥

కాటిలో కూర్చొని మేటి భూతములన్ని
నాటకములాడించినాడు
శివుడు సిండాము తొక్కించినాడు ॥మన॥

వారవారమునాడు సోమవారమునాడు
మరియె జంగామయినాడు శివుడు మల్లయ్య
వేడాము గంటాను శూలం చేతాబట్టి
యెదుట శంక వూదినాడు ॥మన॥

చివరిగా మంగళం పాటవంటిది గురవయ్యలు పాడతారు. ఎవ్వరైనా వీరిని శుభకార్యాలకు, ఇంటిలో అరిష్టాలు రాకుండా ఉండాలనే కోరికతో బండారిచ్చి పిలుస్తారు. గురవయ్యలొచ్చి ఇంటిలో శివున్ని పూజించి కొలిచి, ఇంటి యజమానులను కొలిపించిన తర్వాత వారికి ఇంటి యజమాని ఇనాములనిస్తారు. దానికి బదులుగా జింక చర్మంతో చేయబడిన తిత్తిలోని బండారును వారికి ఇస్తూ పాడుతారు. ప్రతి నృత్యం సందర్భంలోనూ ఈ పాటతో నిలుపుదల చేస్తారు. ఢమరుకం నిదానంగా 'బుడబుడబుడ' గతిలో కొడుతూండగా మిగిలిన వారంతా గట్టిగా పాడతారు. తర్వాత అందరూ గుండ్రాకారంగా తిరుగుతూ పిల్లన గ్రోవినూదుతూ నృత్యాన్ని నిలుపుదల చేస్తారు.

శివబండారు బండారు తలలో మల్లయ్య
యీబూది బండారు తలలో
శ్రీశైలమల్లయ్య యీ బూది
శివ మానంది యీశురుని యీ బూది ॥బండారు॥

గట్టుమల్లయ్య సామి బండారు
మాగంగుమాళమ్మ దేవి బండారు ॥బండారు॥

మైలారు లింగయ్య బండారు
మాగంటి ఈశరుని బండారు ॥బండారు॥

తిరుపతీ తిమ్మమ్మ బండారు
శివసామి గోవిందు రాజుని బండారు ॥బండారు॥

సువ్వెక్కలాడెనె బండారు
సామి కల్యాన మాడేనెబండారు
వైభోగమాడెనె బండారు ॥బండారు॥

ధరవయ్యలు నృత్యాన్ని చేస్తున్నప్పుడు పిల్లలు భయపడుతుంటారు. కాని పెద్దలు ఎత్తుకొని ఒడిలో కూర్చోపెట్టుకొంటారు. కాబట్టి ఆనుకొని కళ్ళను గట్టిగా మూసుకొంటూ అప్పుడప్పుడు చూస్తుంటారు. అందరి గుండెలు గుభేలుమనే లాగ ధ్వనులుంటాయి. పెద్ద గురవయ్యలు, అప్పుడప్పుడే తయారైన చిన్న గురవయ్యలు నృత్యం చేస్తుండగా అందరూ చూస్తూ నవ్వుతుంటారు. పాటలు పాడుతున్న సందర్భంలో చిన్న పిల్లలు బాగా వింటూ చప్పట్లు కొట్టడం. పెద్దలు వార్ని చూసి నవ్వటం ఉంటుంది. గురవయ్యలు ఇంటి దగ్గరకొచ్చి అడుక్కొంటున్న సమయంలో ధాన్యాన్ని పెడితే వారు బండారు పెట్టి పోతుంటారు.

### కళా కారులు

**గురవ రామాంజనేయులు** : 35 సం॥లు, వేషం వేసుకొని ఇల్లిల్లూ తిరగటం, పల్లెల్లో తిరగటం, చెరువు కట్టకింద కొట్టాలు, టెలివిజన్ కేంద్రం వెనకభాగం, పాతూరు అనంతపురం

**గురవయ్య కాటమయ్య** : 40 సం॥లు, వేషం వేసుకొని ఇల్లిల్లూ తిరగటం, పల్లెల్లో తిరగటం.

**గురవ చిన కాటమయ్య** : 40 సం॥లు వేషం వేసుకొని ఇల్లిల్లూ తిరగటం పల్లెల్లో తిరగటం.

**జానపద కళాభారతి** : సుబ్బారావు పేట , ధర్మవరంతాలుకా, అనంతపురం జిల్లా .

# తూర్పుగోదావరి జిల్లాలో గొబ్బిళ్ళు నాడు - నేడు

- కె. విజయభాను
ప్రాజెక్ట్‌ఫెలో/డి. ఆర్. ఎస్ - 1
(ఎస్.ఎ.సి-యు.జి.సి)/ నిఘంటు నిర్మాణశాఖ
పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.

## పరిచయం

జానపద సాహిత్యంలో పాటకు ఎంతో ప్రాధాన్యం ఉంది. జానపదులు తమ అలసటను మరిచి ఉల్లాసం, ఉత్సాహం ఆనందాన్ని పొందడానికి వారు పాడుకునే పాటలే ఈ జానపద కళారూపాలుగా ఉన్నాయి. అటువంటి జానపద ప్రదర్శన కళలలో స్త్రీలు మాత్రమే ప్రదర్శించే కళలు కొన్ని ఉన్నాయి. వాటిలో గొబ్బిళ్ళు ఒకటి. అన్ని ప్రాంతాలలోను ఇవి ప్రదర్శింప బడుతూ నేటికీ ఎంతో ప్రచారంలో ఉన్నాయి. అయితే తూర్పుగోదావరి జిల్లాలో గొబ్బిళ్ళు ఆనాడు ఏ విధంగా ప్రదర్శించబడ్డాయి. నేడు వీటిలో వచ్చిన మార్పులేమిటి? అని చర్చించటమే ఈ వ్యాసము ముఖ్యోద్దేశం.

## నిర్వచనం

ప్రదర్శనకళలకు సంబంధించి చాలా మంది చాలా నిర్వచనాలు చెప్పారు. కాని వాటిలో టాల్‌స్టాయ్ చెప్పిన ఈ నిర్వచనం జానపద ప్రదర్శన కళలకు సరైన నిర్వచనంగా కనిపిస్తుంది.

Art is the Production of some permanent object or passing action which is fitted not only to supply an enjoyment to the producer, but to convey a pleasurable impression to a number of spectators or listeners.

- టాల్‌స్టాయ్ (జి.ఎస్.మోహన్-2001)

## గొబ్బి - అర్థం

గొబ్బి అనే పదం "గర్భా" అనే పదం నుండి పుట్టిందని డా॥ బిరుదురాజు రామరాజు, డా॥ తూమాటి దొణప్ప అభిప్రాయపడ్డారు. గొబ్బి అంటే "ధనుర్మాస

దినాల్లో సాయంకాలాల్లో గడపలకు ముందు బాలికలు పాటలు పాడి, చేతులు తట్టుతూ చుట్టివచ్చి జరిపే వేడుక." అని తెలుగు వ్యుత్పత్తికోశం వివరించింది.

(తెలుగు వ్యుత్పత్తి కోశం. పుట. 416)

గొబ్బిళ్ళు పెట్టుకోడం, గొబ్బిళ్ళు చేయడం, గొబ్బిళ్ళు ఆడటం, గొబ్బిళ్ళు పాడటం అనే మాటలు వ్యవహారంలో ఉన్నాయి.

## ప్రాచీన సాహిత్యంలో గొబ్బిళ్ళు - ప్రాముఖ్యం

క్రీ॥శ॥ 15వ శతాబ్దానికి చెందిన సంకీర్తనాచార్యుడు, పదకవితా పితామహుడు అన్నమయ్య కొన్ని గొబ్బిపాటలు రచించాడని చెబుతారు. వాటిలో ఒకటి

"కొలనిదోపరికి గొబ్బిళ్ళో యదు
కులము స్వామికిని గొబ్బిళ్ళో
కొండ గొడుగుగా గోవులు గాచిన
కొండక శిశువుగా గొబ్బిళ్ళో"

అంటూ కృష్ణుణ్ణి వర్ణిస్తూ రాసిన పై గొబ్బి పాటను బట్టి గొబ్బిళ్ళను ఉండే ప్రాముఖ్యాన్ని, ప్రాచీనతను మనం తెలుసుకోవచ్చు.

## జానపద ప్రదర్శనకళగా గొబ్బిళ్ళు

పల్లెల అందమంతా సంక్రాంతి పండుగలోనే చూడాలి. ధనుర్మాసంలో సంక్రాంతి వస్తుంది. నెలంతా సందడి సందడిగా, ఇల్లంతా కళకళలాడుతూ ఉంటుంది. ఇంటి ముంగిట ముగ్గులు వేయడం భారతీయుల అలవాటు. ఇంటి ముంగిట ముగ్గులను పెట్టి, ధాన్యలక్ష్మిని ఆహ్వానిస్తారు. ఈ ముగ్గుల్లో రథం, పద్మం, నెమళ్ళు, హంసలు, చిలకలు, నక్షత్రాలు, త్రిభుజాలు, షడ్భుజాలు, స్వస్తిక్‌లు ఇలా ఎన్నో రకాలుగా చుక్కలతో ముగ్గులు పెట్టి, స్త్రీలు ఎంతో వేడుకగా సంక్రాంతి పండుగను జరుపుకుంటారు. ఈ ముగ్గులతో పాటు సూర్యారాధన, శ్రీకృష్ణుని ఆరాధన కూడా ఈ పండుగలో భాగంగా కనిపిస్తాయి.

ఆంధ్రదేశంలో అన్ని ప్రాంతాల్లోనూ స్త్రీలు జరుపుకునే జానపద పండుగ గొబ్బిళ్ళు.

'కడివెడు పసుపు కల్లాపిజల్లి
గొబ్బిళ్ళో గొబ్బిళ్ళో...'



అంటూ సంక్రాంతి పండుగ ప్రారంభంతోనే, అంటే డిసెంబరు 15వ తేది నుంచి (నెల పట్టడం అనీ, నెలపొడుపు అని ఒక్కో ప్రాంతంలో ఒక్కో పేరుతో పిలుస్తూ) పండుగ వాతావరణం ఆరంభమవుతుంది.

పండుగ నెల పట్టింది మొదలు గ్రామాల్లో సందడి కనిపిస్తుంది. వీటిలో మనకి ఎక్కడ చూసినా గంగిరెద్దుల సన్నాయి వాద్యాలు, కోడికూతతో మొదలయ్యే హరిదాసుల సంకీర్తనలు బాగా వినిపిస్తాయి. వాస్తవానికి ఈ రెండూ మన ప్రాచీన జానపద కళారూపాలు. అయితే కాలక్రమేణా గంగిరెద్దులవారిని ముష్టివారిగాను, హరిదాసులను కూడా దాదాపు అదే విధంగా చూస్తున్నాం. గంగిరెద్దులు ఒకనాటి మన జానపద కళారూపం అని ఇప్పటి చాలామందికి తెలియదు. ఇంటి ముందు గంగిరెద్దును నిలబెట్టి సన్నాయి వాయిస్తుంటే అదొక శుభసూచకంగా ఆనాడు భావించేవారు.

సంక్రాంతి సమయంలో పెద్ద పండుగ సందర్భంగా గ్రామాల్లో దొమ్మరి ఆట, గెడసాని విన్యాసాలు, తోలు బొమ్మలాటలు, భజనలు, కోలాటాలు, మహిళల బొమ్మలకొలువు అంటూ గౌరీ దేవి నోము మొదలైన జానపద కళారూపాలెన్నో మనకు కనిపిస్తాయి. వాటిల్లో ఒకటి మనం చెప్పుకునే గొబ్బిళ్ళు.

## తూర్పుగోదావరి జిల్లాలో గొబ్బిళ్ళు - ప్రత్యేకత

సంక్రాంతి పండుగ సమయంలో స్త్రీలు ఎంతో ఆనందోత్సాహాలతో జరుపుకునే వేడుక గొబ్బిళ్ళు. సంక్రాంతి నెల పట్టడంతో ప్రారంభమై, భోగిపండుగతో ఇవి ముగుస్తాయి. దాదాపు అన్ని ప్రాంతాల్లోనూ స్త్రీలు గొబ్బిళ్ళు తమ ఆచార, సంప్రదాయాలకు అనుగుణంగా వారివారి పద్ధతుల్లో జరుపు కుంటారు. అయితే తూర్పుగోదావరి జిల్లాలో ఈ గొబ్బిళ్ళు కొంత భిన్నంగా, ప్రత్యేకంగా ఉండటం మనం గమనించవచ్చు. ముఖ్యంగా ఈ ప్రాంతంలో "గొబ్బిళ్ళు" పెట్టుకునే సందర్భంలో ముందుగా పూజావిధానం తర్వాత పాటలు పాడటం ప్రత్యేకంగా కనిపిస్తుంది.

గొబ్బిళ్ళను సాయంకాలం సమయంలో స్త్రీలు ఎంతో ఆనందంగా జరుపుకుంటారు. ముందుగా ఇంటి ముందు రకరకాల ముగ్గులు వేసి రంగులతో అలంకరిస్తారు. ఇలా వేసిన ముగ్గుల్లో గొబ్బిళ్ళను ఆవు పేడతో చేసి వాటిదానిపై గుమ్మడి, బంతి, చేమంతి వంటి పూలను వుంచుతారు. గొబ్బిళ్ళను పిల్లలు, పెళ్ళికాని అమ్మాయిలు మాత్రమే జరుపుకుంటారు.

గొబ్బిళ్ళు తూర్పుగోదావరిజిల్లాలో ప్రధానంగా బ్రహ్మవైశ్య కులాలవారు మాత్రమే ఎక్కువగా చేసుకోవడం కనిపిస్తుంది. మిగిలిన కులాలవారు వీరితో పాటుగా కలిసి పాటలు పాడతారు, కానీ ప్రత్యేకంగా మాత్రం గొబ్బిళ్ళు పెట్టుకోవడం కనిపించదు. వీటిని కూడా అందరూ చేయరు. ఆనవాయితీగా ముందుతరంవారు జరుపుతున్నట్లయితేనే తర్వాత తరంవారు సంప్రదాయంగా చేస్తారు.

గొబ్బిళ్ళు పెట్టుకునేవారు ముందుగా తమ స్నేహితుల్ని, బంధువుల్ని పిలుస్తారు. దీనికి దేవతలుగా ముఖ్యంగా కృష్ణుడిని ఆరాధిస్తారు. అందుకే గొబ్బి పాటలు చాలా వరకు కృష్ణుడిపైనే ఉంటాయి. గొబ్బెమ్మను దేవతగా పూజించి.

"సుబ్బిగొబ్బెమ్మా సుబ్బయ్యణ్ణియ్యవే
చామంతి పువ్వంటి చెల్లెల్నియ్యవే
తామర పువ్వంటి తమ్ముణ్ణియ్యవే
బంతి పువ్వంటి బావనియ్యవే
మొగలి పువ్వంటి మొగుణ్ణియ్యవే"

అంటూ పాడుతారు.

ఈ గొబ్బిముద్దలు 5,7,9,11....ఇలా బేసి సంఖ్యలలోనే ఉంచుతారు. వీటిని ముందుగా దేవుని వద్ద పీటపై వుంచి పూజచేసి, తర్వాత ముగ్గుపై పెట్టి చుట్టూ తిరుగుతూ, చేతితో చప్పట్లు కొడుతూ ముందుకు, వెనక్కు తిరుగుతూ పాటలు పాడతారు. వీటిల్లో పిల్లలు వివిధ కోర్కెలు తీర్చమని వేడుకుంటూ పాటలు పాడుతారు. ఈ గొబ్బిముద్దలను మరునాడు తీసి మొక్కల్లో వేస్తారు.

## గొబ్బి పాటలు

సాధారణంగా జానపదులు పాడే పాటల్లో ప్రకృతిలోని ప్రతి వస్తువూ కనిపిస్తుంది. అదే విధంగా ఈ గొబ్బిపాటల్లో కూడా పండ్లు, ఆకులు, పువ్వులతోపాటు, కృష్ణుని గాథలు, సీతారాముల కథలు ఇలా ఎన్నో కనిపిస్తాయి.

పాట : 1

పల్లవి॥ "దుక్కి దుక్కి దున్నారంట
ఏం దుక్కి దున్నారంట
రాజావారి తోటలో జాందుక్కి దున్నారంట



ఔనాటి అక్కల్లారా చంద్రగిరి భామల్లారా
భామలగిరి గొబ్బిళ్ళో, గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో

చరణం 1 : విత్తు విత్తు నాటారంట
ఏం విత్తు నాటారంట
రాజా వారి తోటలో జాంవిత్తు నాటారంట
ఔనాటి అక్కల్లారా చంద్రగిరి భామల్లారా
భామలగిరి గొబ్బిళ్ళో గొబ్బియళ్ళో గొబ్బియళ్లో ॥2॥

చరణం 2: ఆకు ఆకు వేసిందంట
ఏం ఆకు వేసిందంట
రాజావారి తోటలో జామాకు వేసిందంట
ఔనాటి అక్కల్లారా చంద్రగిరి భామల్లారా
భుమలగిరి గొబ్బిళ్ళో గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో

చరణం 3: పూత పూత పూసిందంట
ఏం పూత పూసిందంట
రాజావారి తోటలో జాంపూత పూసిందంట
ఔనాటి అక్కల్లారా చంద్రగిరి భామల్లారా
భామలగిరి గొబ్బిళ్ళో గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో

చరణం 4: పిందె పిందె వేసిందంట
ఏం పిందె వేసిందంట
రాజావారి తోటలో జాంపిందె వేసిందంట
ఔనాటి అక్కల్లారా చంద్రగిరి భామల్లారా
భామలగిరి గొబ్బిళ్ళో గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో

చరణం 5: కాయ కాయ కాసిందంట
ఏం కాయ కాసిందంట
రాజావారి తోటలో జాంకాయ కాసిందంట
ఔనాటి అక్కల్లారా చంద్రగిరి భామల్లారా
భామలగిరి గొబ్బిళ్ళో గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో

పై పాటలో ఒక విత్తనం నాటిననాటి నుంచి పండు అయ్యే వరకు జరిగే దశలను పాడటం కనిపిస్తుంది.

**పాట:2**

1. ఒకటేసి పువ్వు నీ మెడలో
రెండేసి పూలు నా మెడలో
చాల్ చాల్ చక్కల్లారా సంపెంగి మొగ్గల్లారా
జానకి రాములు ఉయ్యాలలో...

2. మూడేసి పూలు నీ మెడలో
నాలుగేసి పూలు నా మెడలో
చాల్ చాల్ చక్కల్లారా సంపెంగి మొగ్గల్లారా
జానకి రాములు ఉయ్యాలలో....

3. ఐదేసి పూలు నీ మెడలో
ఆరేసి పూలు నా మెడలో
చాల్ చాల్ చక్కల్లారా సంపెంగి మొగ్గల్లారా
జానకి రాములు ఉయ్యాలలో...

ఈ పాటల్లో పువ్వుల్ని, సీతారాములను తలచుకుంటూ, ఎన్ని పువ్వులకైనా పాడటం కనిపిస్తుంది.



**పాట 3**

ఏల వచ్చెనమ్మ కృష్ణుడేల వచ్చెను
ఈమాయదారి కృష్ణుడొచ్చి మహిమచేసెను
ఉట్టి మీద పాలు పెరుగు ఎట్లందించెను
నే కొట్టబోతే దొరకడమ్మ చిన్ని కృష్ణుడు

ఈ పాటలో కృష్ణుని చరిత్ర వివరించటం కనిపిస్తుంది.

**పాట 4**

గొబ్బియళ్ళో సఖియా వినవే
చిన్నికృష్ణుని చరితము వినవే
దరిద్రుడైన కుచేలునకును
దర్శనమొసగిన నారాయణుడు
ఆయన కోర్కెలు తీర్చెనే
గొబ్బియళ్ళో...గొబ్బియళ్ళు...

గొబ్బిళ్ళను స్త్రీల జానపద నృత్యంగా చెప్పవచ్చు. జానపద కళల వల్ల మన ఆచార సాంప్రదాయాలు తెలుస్తాయి. గొబ్బిళ్ళు తెలంగాణ ప్రాంతంలో జరుపుకునే బతకమ్మ పండగకు దగ్గరగా ఉన్నట్లు కనిపిస్తుంది. ఇవి రెండూ ప్రదర్శించే తీరు ఒకటే. గొబ్బి ముద్దల చుట్టూ తిరుగుతూ పాటలు పాడటమే. అయితే రెండింటికీ భేదం తప్పనిసరిగా ఉంది.

## ఆరోగ్యపరంగా గొబ్బిళ్ళు

ఇంటి ముందు ముగ్గులు పెట్టడానికి దానిలో గొబ్బిళ్ళు పెట్టడం వెనుక ఆరోగ్య పరమైన సూత్రం కూడా ఉందని పెద్దవాళ్ళు అంటారు. పొద్దున్నే లేచి ఇంటి ముందు శుభ్రంగా ఊడ్చి, కళ్ళాపు జల్లి, దానిపై ముగ్గులు పెట్టి, దానిలో గొబ్బెమ్మలు పెట్టడం అనారోగ్యాలను పారద్రోలే ఓ సూత్రం అనుకోవచ్చు. శీతాకాలంలో చలిబాగా ఎక్కువగా ఉంటుంది. దానివల్ల ఇంటి పరిసరాలల్లోకి క్రిమికీటకాదులు చేరడం, తద్వారా పిల్లలు ఆడుకునే సమయాల్లో వివిధ మార్గాలద్వారా వారి శరీరంలోకి చేరడం. ద్వారా అనారోగ్యానికి గురిచేసే అవకాశం ఉంది. కనుక ఇంటి ముందు కల్లాపు జల్లి,

రసాయనాలుగా పనికొచ్చే వివిధ రంగులు, బియ్యప్పిండి, రాతిపొడి కలిపి ముగ్గులు పెట్టడంవల్ల వాటిలోని ఫూటు, ఇతర కారణాలవల్ల క్రిములు చనిపోవడం జరుగుతుంది. తద్వారా పిల్లలు రోగాల బారిన పడకుండా కాపాడుకున్నవారవుతాం.

ఈ గొబ్బిళ్ళలో పసుపు, కుంకుమ, నవధాన్యాలు వేయడం ద్వారా వాటిని పక్షులు తినడం ద్వారా పుణ్యం వస్తుందని మన వారికి నమ్మకం.

## తూర్పుగోదావరి జిల్లాలో గొబ్బిళ్ళు నాడు - నేడు

ఏ పండుగ అయినా కాలంతోపాటే వాటిలో మార్పులు రావటం సహజం. అలాగే ఈ గొబ్బిళ్ళు కూడా మార్పు చెందాయని చెప్పొచ్చు. పూర్వం రెండు, మూడు గంటలపాటు పెద్దవాళ్ళంతా పిల్లలతోపాటే కూడా ఉండి ఇంకా ఎన్నో రకరకాల పాటలు పాడిస్తూ చేసేవారు. ఆ కాలంలో ఆడపిల్లలు ఆనవాయితీగా ఉంటే మాత్రం ఖచ్చితంగా చేసేవారు కానీ నేడు దీనిలో ఆహార్యంలోనూ, ఆంగికంలోనూ మార్పు కనిపిస్తోంది.

నేడు ఈ గొబ్బిళ్ళు ఆనవాయితీగా ఉన్నవారు మాత్రం ఏదో సంప్రదాయం కాబట్టి పెట్టుకోవాలి అన్నట్టుగా గంటలో ముగించేస్తున్నారు. ఏవో రెండు పాటలు పాడి పూజ చేస్తున్నారు. ఆనాడు గొబ్బిళ్ళలో ప్రసాదంగా కృష్ణుడికి ఇష్టమైన అటుకులు, బెల్లం, శనగలతో రకరకాల పిండివంటలు చేసి పంచేవారు. రాను రాను వాటిల్లో కూడా మార్పు కలిగి హల్వా, పులిహోర, బొంబాయి రవ్వ (ఉప్మారవ్వ)తో చేసిన తీపి పదార్థాలను ప్రసాదాలుగా పంచుతున్నారు.

పూర్వం గొబ్బిళ్ళు పెట్టుకునే ఆడపిల్లలు పట్టుపరికిణీలు, పావడాలు, ముక్కెర, పెద్ద జడగంటలు, పూలజడ నడుముకు వడ్డాణం, కాళ్ళకు మువ్వలు, చేతినిండా గాజులు, మెడలో హారాలు ధరించి చేసేవారు. కానీ నేడు పంజాబీ డ్రస్సులు, స్కర్ట్స్, జీన్స్, టీషర్టులు ధరించి నామమాత్రంగా జరుపుతున్నారు.

పాశ్చాత్య నాగరికతా ప్రభావం వల్ల గొబ్బిళ్ళు పెట్టేవారి శాతం కొంత తగ్గిందనే చెప్పాలి. దీనికి కారణం ఆడపిల్ల కూడా మగపిల్లలతో సమానంగా పోటీపడుతున్నారు. కంప్యూటర్స్, గేమ్సులలో ముందంజ వేస్తున్నారు. కోనేరు హంపి, సానియా మీర్జా వంటి ఆడపిల్లలంతా పాశ్చాత్య ఆటల్లో ఎంతో రాణిస్తుంటే వారిలా తయారవమని చెబుతున్నారు కానీ బామ్మలు చెప్పే గొబ్బిళ్ళు ఆడటం లేదు. అయితే పూర్తిగా మరిచిపోయారని మాత్రం చెప్పలేం. గ్రామాల్లోనూ, పట్టణాల్లో కొంతమంది ఇంకా ఈ కళను ప్రదర్శిస్తున్నారు.



## ముగింపు

ఏది ఏమైనప్పటికీ తరతరాలుగా సంప్రదాయంగా మనకు అందింపబడుతున్న ఈ కళారూపాలు ఆధునికత వల్ల ఏమాత్రం నాశనం కాకపోయినా, ఆదరణలేక ఎదగడం లేదని, అందుచేత జానపద కళారూపాల విలువలను ఆయా ప్రాంతాల వారికి తెలియజెప్పడం ద్వారా ఈ కళలను తిరిగి ఉన్నత స్థితికి తీసుకురావచ్చునని ఆశిద్దాం!

## ఉపయుక్త గ్రంథ సూచి


1. చక్రధరరావు, లకంసాని 1981 : "తెలుగు వ్యుత్పత్తికోశం" (క-ఘ) రెండవ సంపుటం, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, విశాఖపట్నం
2. మోహన్, జి.యస్. 2001 : "జానపద విజ్ఞానాధ్యయనం, శ్రీనివాసపబ్లికేషన్స్, బెంగుళూరు
3. రాధాకృష్ణ, మిక్కిలినేని, 1992 : "తెలుగువారి జానపద కళారూపాలు" పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు
4. రామరాజు, బిరుదురాజు, 1990 : "తెలుగు జానపద గేయ సాహిత్యం" జానపద విజ్ఞాన ప్రచురణలు, హైదరాబాదు
5. సుందరం, ఆర్వీయస్, 2004 : "ఆంధ్రుల జానపద విజ్ఞానం" పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్


6. **పాటల సేకరణకు సహకరించినవారు** :

1. **వి. అరుణకుమారి**, వయసు25, శివకోడూరు, రాజోలు మండలం తూర్పు గోదావరి జిల్లా.
2. **వెంకట లక్ష్మి**, వయసు 28, రాజోలు, తూర్పుగోదావరి జిల్లా.
3. **కె. ప్రసన్నకుమారి**, వయసు 29, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా.

# జానపదుల కామునిపున్నమి ప్రదర్శనలు నాడు - నేడు

- ఎ. యాదగిరి
ప్రాజెక్ట్‌ఫెలో/డి. ఆర్. ఎస్ - 1
(ఎస్.ఎ.సి-యు.జి.సి)/ నిఘంటు నిర్మాణశాఖ
పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్.

## ఉపోద్ఘాతం

జానపదం అనేపదం సామాన్యమైన లక్షణాన్ని కలిగివున్న ఏ జన సమూహాన్ని అయినా సూచిస్తుంది. వాళ్ళను కలిపివుంచే సామాన్యలక్షణం ఏదైనా కావచ్చు. ఆ లక్షణం సామాన్యమైన వృత్తి కావచ్చు, భాష కావచ్చు, మతం కావచ్చు. అయితే ఆ సమూహానికి తనదంటూ చెప్పుకోదగిన కొన్ని సంప్రదాయాల్ని కలిగి ఉండాలి అనేది మాత్రం చాలా ముఖ్యమైన విషయం (అలెన్‌డండస్, 1965).

జానపద విజ్ఞానమనేది చిన్న సమూహంలో కళాత్మకమైన సమాచారాల చేరవేత వంటిది. జానపద విజ్ఞానం ఒక కళాత్మకమైన విధానంగా ఏ సమాచార చేరవేత మాధ్యమంలోనైనా కనిపిస్తుంది. ఆ మాధ్యమం సంగీతం, దృశ్యం, చరకళ, ప్రదర్శన, నాటకం ఏదైనా కావచ్చు. సమాచారాల చేరవేత విధానంలో జానపద విజ్ఞానం ఒక సాంఘిక పరిమితిని అంటే చిన్న సమూహాన్ని కలిగి ఉంటుంది. ఇతిహాసం, దేశం, పురాణం, సమాజం, ఆచారం ఇవన్నీ సమాచారాల చేరవేతను, సమూహాన్ని ఒకటిగా కలుపుతాయి.

జానపదవిజ్ఞానం స్వరూపస్వభావాలకంటే, ఆవిర్భావం కంటే విధులే చాలా ముఖ్యమైనవిగా జానపదులు భావిస్తూ ఉంటారు. అందుకే వారు ఆచారమనే ముసుగులో వారివిధులను, వారు చేసేపనులను తప్పకుండా చేస్తూవుంటారు. పురాణాల్లోని లేదా మతాచారాల్లోని పదహారణాల పవిత్ర లక్షణాలన్నీ అంతరించిపోయి వుంటే లేదా విస్మృతికి గురవుతుంటే పురాణం జనపద కథగానో, పాటగానో తయారవుతుంది. ఆచారం నాటకం, నాట్యం, సంగీతం, ఆటప్రదర్శనగా అవతారమెత్తుతుంది.

పురాణంలోని 'మన్మథ దహనం' అనే సంఘటన విస్మృతికి గురికాకుండ జానపదులు 'కామునిపున్నమి' పేరుతో జరుపుకునే పండుగ నేపథ్యం, ప్రదర్శనలు, ఒకనాటి కామునిపున్నమి ప్రదర్శనలకు నేటి కామునిపున్నమి ప్రదర్శనలకు గల వైవిధ్యాన్ని గురించి తెలియజేయడమే ఈ పత్ర ముఖ్య ఉద్దేశ్యం.

## కామునిపున్నమి - పరిచయం

ఫాల్గుణ మాసంలో వచ్చే పౌర్ణమిని 'కామునిపున్నమి' అని పిలుస్తారు. ఈ పౌర్ణమిరోజు జరుపుకునే పండుగను కామునిపండుగ అని పిలుస్తారు. భారతదేశమంతటా కామునిపున్నమి ఉత్సవాలను వివిధ రీతులలో జరుపుకుంటారు. కన్నడదేశంలో కామునిపండుగను కామునహుణ్ణమి (కాముని పున్నమి), కామనహబ్బ (కామన్న పండుగ) అని పిలుస్తారు. తెలంగాణలో దీనిని కామునిపున్నమి, రంగుల పండుగ, హోళి పండుగ, కామునిపండుగ అని పిలుస్తారు.

ప్రపంచంలో కామునిపున్నమి ఉత్సవాలు అనేక విధాలుగా అతి ప్రాచీనకాలం నుండే జరుపుకుంటున్నట్లు తెలుస్తుంది. ఇటలీ దేశంలో 'లూపర్కేలియా', పర్షియాలో 'నౌరోజ్', ఈజిప్టులో 'పల్లికా' అనే పేరుతో జరిపే ఉత్సవాలు కామునిపున్నమి ఉత్సవాలను పోలివున్నాయి.

## కామునిపున్నమి నేపథ్యం

తారకాసురుడి బాధల నుండి విముక్తి పొందాలంటే శివునికి పుత్రుడు కలగాలని తలంచిన దేవతలు మన్మథుని సహాయం కోరుతారు. పార్వతిపై శివుడికి ప్రేమభావం కలిగే వాతావరణాన్ని కల్పించమని వేడుకుంటారు. దేవతల మేలుకోరి మన్మథుడు అరవింద, అశోక, చూత, నవమల్లిక, నీలోత్పలమనే పంచసుమబాణాలను శివునిపై ప్రయోగిస్తాడు. వీటి ప్రభావంతో శివుడికి తపోభంగమై పార్వతి రూపలావణ్యాలను తిలకించి, అంతలోనే తనకు కలిగిన భావనకు కారణమేమని క్రీగంట చుట్టూ పరికించి చూచి, పొదచాటున విల్లు ఎక్కుపెట్టి తననే చూస్తున్న మన్మథుని చూసి, కోపోద్రిక్తుడై తన మూడవ కంటి అగ్ని జ్వాలలతో మన్మథున్ని క్షణంలో భస్మం చేస్తాడు. ఈవిధంగా దేవతల క్షేమం కోసం మన్మథుడు భస్మమైపోతాడు. పురాణంలోని ఈ దయనీయ సంఘటనను గ్రహించిన జానపదులు ఫాల్గుణమాసంలో వచ్చే పౌర్ణమిని కామునిపండుగ పేరుతో ఉత్సవాన్ని జరుపుకుంటారు. ఇదే ఈ పండుగకు నేపథ్యం.

## కామునిపున్నమి ప్రదర్శనలు

"ప్రదర్శనం అంటే విశదపరిచి చూపుట అని, ప్రదర్శితం అంటే చూపబడింది, విశదపరిచి చూపబడింది, వివరింపబడింది, బోధింపబడింది" అని శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు తెలుపుతుంది. కళ్లముందు విశదపరిచి చూపే ఆటపాటలూ, ఆచార సాంప్రదాయాల పేరుతో చేసే దహనాలు, కర్మకాండలు మొదలైన వాటన్నింటిని ప్రదర్శనలు అనవచ్చు.

పురాణసంబంధమైన కథతో కూడిన 'కుమారసంభవము' అనే కావ్యంలో నన్నెచోడుడు కామదహనాన్ని గురించి ఒక పద్యంలో కళ్ళకు కట్టినట్లు ఈవిధంగా వర్ణిస్తాడు.

"పొగయక రాజకొక్క మొగిభేరన మంటలు విస్ఫులింగముల్
నెగసి రయంబునం గలయనిండి ఛటచ్ఛట ఛుఘ్ఛగద్ధగ
ద్ధగయని మండి, పంచశరు దగ్ధముచేయు చయాక్షణంబులో
మగిడి పురారినేత్ర శిఖిమల్పె మహాశనిపాత భీమమై"

జానపదులకు పురాణాల్లోని పాండిత్యంతోగాని, అలంకారాలతోగాని, వర్ణనలతోగాని పనిలేదు. వారికి కావలసిందల్లా మంచి, మానవత్వం, దయాస్వభావం. అది ఎక్కడున్నా వారు దానిని స్వీకరిస్తారు. అది జానపదుల జాలిగుండెకు ప్రతీక. అందుకే దేవతల క్షేమంకోసం భస్మమైపోయిన మన్మథదహనం సన్నివేశాన్ని, మన్మథున్ని దేవతలు మరిచిపోయారో ఏమోగాని జానపదులు మాత్రం మరువలేదు. నేటికీ పల్లెటూళ్లలో కామదహనానికి సంబంధించిన అంశాన్ని వివిధ ప్రదర్శనల ద్వారా ప్రదర్శిస్తున్నారు. ఈ సందర్భంగా వీరు ప్రదర్శించే కామమ్మ ప్రదర్శన, కామయ్య ప్రదర్శన, ఎలగొడ్డు ప్రదర్శన, కామదహన ప్రదర్శనలు ప్రధానమైనవిగా చెప్పవచ్చు.

మహబూబ్‌నగర్‌జిల్లాలోని గోపాల్‌పేట మండలంలో కామునిపున్నమి సందర్భంగా అనేక ప్రదర్శనలను నియమనిష్టలతో ప్రదర్శిస్తారు. కామునిపున్నమి సమీపిస్తుండగా వారంరోజుల ముందునుండే వివిధ రకాల ప్రదర్శనలు ప్రదర్శిస్తారు. గ్రామంలోని పిల్లలు వివిధ సమూహాలుగా ఏర్పడి కామమ్మ, కామయ్య, ఎలగొడ్డు వేషాలతో ప్రతిఇల్లు తిరుగుతూ, పాటలు పాడుతూ ధాన్యాన్ని సేకరిస్తారు. కామమ్మవేషం వేసిన అమ్మాయి తలపై సన్నని రంధ్రాలు చేసిన ఒక కుండను వుంచి, అందులో ఒక దీపాన్ని వెలిగిస్తారు. వెలుగులు వెదజల్లుతున్న దీపపుకాంతులతో



కామమ్మ వారి బృందం ప్రతి ఇల్లు తిరుగుతూ, ఈకింది విధంగా పాటలు పాడుతూ ఊరంతా తిరుగుతారు.

"గుడుగూడె గుసిసింత
దిగినాది దొమ్మరిల్లు
దొమ్మరింటి దొరబిడ్డ
మా ఇంటి ఆడుబిడ్డ
సిక్కుదీసి కొప్పుగట్టి
సిరిగందం బొట్టువెట్టిక
ఎక్కడమ్మ జగడ్డంపు
బాలుండే చెందురయ్యాది
బర్రెనిచ్చి కొన్నడేమొ
ఆవునిచ్చి కొన్నడేమొ"

అలాగు ఎలగొడ్డు వేషం వేసిన అబ్బాయిల బృందం నల్లని గొంగడిని ధరించి ఎలగొడ్డులా గెంతుతూ, హాస్యపు పాటలు ప్రతిఇంటి ముందు పాడుతూ, ధాన్యాన్ని సేకరిస్తారు. ఇలా వారంరోజుల్లో ఊరిలోని ప్రతి వీధిని కలియతిరిగి వారి ఆటపాటలతో హోరెత్తిస్తారు. చివరగా పౌర్ణమిరోజు మోదుగ పూలతో అల్లిన దండలతో కామమ్మ, కామయ్యలు రతీమన్మథులను తలపించేలా అలంకరించుకుని, ఊరంతా తిరిగి సాయంకాలం సావిడి దగ్గర వారి అలంకరణలను, దుస్తులను, వేషాలను కామదహనానికి సిద్ధం చేసిన చితిలో వేస్తారు. వడ్రంగి చెక్కిన కాముని ప్రతిమను కావలివాళ్లు పాడెపై (ఒక కట్టెకు బట్టను కట్టి అందులో కాముని ప్రతిమను వుంచుతారు) పెట్టుకొని, డప్పులతో ఊరంతా తిరిగి (తమ్మల సీతాపతి) ఇంటిదగ్గర కొంతసేపు వుంచుతారు. తర్వాత పిండాకూడుతో సావిడి దగ్గరికి చేరుకొని, చితిదగ్గర పూజించి, కాముని ప్రతిమను చితిలో పెడుతారు. కోరవోనికులంవారు చిన్న రంధ్రం చేసిన నిండు కుండను భుజంపై పెట్టుకొని మూడుసార్లు చితి చుట్టూ తిరిగి, చితి దగ్గర పగులగొడ్తారు. తర్వాత బేగరవారు నల్లకోడిపెట్టను చితిపై నుండి అటూ, ఇటూ మూడు సార్లు ఎగురవేసి పట్టుకొంటారు. తర్వాత చితికి నిప్పంటిస్తారు. ప్రజలు పూర్తిగా కాలిన కామునిబూడిదను వివిధపాత్రలలో, కుండలలో భద్రపరచుకుంటారు. ఈ బూడిదకు అతీతశక్తులున్నట్లు వారు నమ్ముతారు. వైద్యంలో కూడా దీనిని వాడుతారు.

కామదహనం అనంతరం మోదుగపూలతో తయారు చేసిన 'బసంతం' (రంగునీరు) ఒకరిపై ఒకరు వావివరుసలు లేకుండగా చల్లుకుని సంబరాలు జరుపుకుంటారు.

## కామునిపున్నమి ప్రదర్శనల్లో ఆహార్యం

ఆహార్యం అంటే తెచ్చి పెట్టుకున్నదని అర్థం. నటీనటులు తమ సహజత్వాన్ని కప్పిపుచ్చుకొని పాత్రోచిత రంగు, రూపాలను తీర్చిదిద్దుకోవడాన్ని ఆహార్యం అంటారు. కాముని పున్నమి ప్రదర్శనల్లో ఆహార్యం ప్రముఖపాత్ర వహిస్తుంది. కామమ్మ ప్రదర్శనలో రతీదేవిని తలపించేలా మోదుగపూలతో కూడిన అలంకరణ, కాటుక, బొట్లతో చేసిన అలంకరణలను ప్రధాన ఆహార్యాంశాలుగా చెప్పవచ్చు. కామయ్య ప్రదర్శనలో మన్మథున్ని తలపించే విధంగా శరీరమంతా పూలతో అలంకరించడం, ప్రత్యేకంగా మోదుగపూలతో అల్లిన దండలను, విల్లు, బాణాలను ప్రదర్శించడాన్ని బట్టి చూస్తే వారు ఆహార్యంపై చూపే ఆసక్తి మనకు అర్థం అవుతుంది. కామదహన ప్రదర్శనలో కాముని ప్రతిమను శవంలా పాడెపై ఊరేగించడం, డప్పుమోతలతో ఊరేగించి, సావిడి దగ్గర పిండాకూడు పెట్టి పూజించడం, కామదహనం మొదలైన వాటిని పరిశీలిస్తే జానపదుల ఆంగిక, ఆహార్య, అభినయాలు అద్భుతంగా గోచరిస్తాయి.

## కామునిపున్నమి ప్రదర్శనలు : నాడు - నేడు

మా ఊరిలో (గోపాల్‌పేట: మహబూబ్ నగర్ జిల్లా) జరుపుకునే కామునిపున్నమి ప్రదర్శనలను దాదాపు 25సంవత్సరాల నుండి అంటే నా చిన్ననాటి నుండి అతి సన్నిహితంగా పరిశీలిస్తూవున్నాను. 25సంవత్సరాల ముందు జరుపుకున్న కామునిపున్నమి ప్రదర్శనలకు నేడు జరుపుతున్న కామునిపున్నమి ప్రదర్శనలకు ఆహార్యంలో, ప్రదర్శనల్లో అనేక మార్పులు కనిపిస్తున్నాయి.

పూర్వం కామునిపున్నమి సందర్భంగా కోలాటం, కామయ్య, కామమ్మ, ఎలగొడ్డు ప్రదర్శనలు ప్రదర్శించేవారు. నేడు కామయ్య, కామమ్మ, ఎలగొడ్డు ప్రదర్శనలు ప్రదర్శించబడుతున్నప్పటికీ కోలాటం అనే ప్రదర్శన కళ కనుమరుగైపోయింది.

* పూర్వం రాణిరంగనాయకమ్మ పరిపాలనలో కామునిపున్నమి ప్రదర్శనలు వైభవంగా జరపబడినట్లు పెద్దలు తెలుపుతున్నారు. కాని నేడు మొక్కుబడిగా గ్రామంలోని విలేజ్ సెక్రటరీ మండల రెవిన్యూ అధికారి ఆజ్ఞలతో ఈ పండుగకు అవసరమైన వస్తువులు (కొత్త తెల్లని వస్త్రం, కామునిప్రతిమ తయారు చేసినందులకు వడ్రంగికి ఇచ్చే కూలి మొదలైనవి) సమకూరుస్తున్నారు.



* పూర్వం ఈకామదహన ప్రదర్శనలో గ్రామంలోని పిల్లలు, పెద్దలు అందరూ పాల్గొనేవారు. నేడు ఈప్రదర్శనల్లో పిల్లల భాగస్వామ్యమే అధికంగా కనిపిస్తుంది.
* నాడు కామదహన ప్రదర్శన అనేది పవిత్రమైన భావనతో అందరు బాధ్యతతో నిర్వహించే కార్యం. కాని నేడు అది పిల్లలకు సంబంధించిన ప్రదర్శనగా భావించబడుతున్నది.
* పూర్వం ఈ కామునిపున్నమి ప్రదర్శనల్లో ఊర్లోని ప్రతికులంవారూ విధిగా పాల్గొనేవారు. నేడు అది వ్యక్తుల ఇష్టాయిష్టాలపై ఆధారపడి వున్నది.
* ఒకప్పుడు కామమ్మ ప్రదర్శనలో సన్నని రంధ్రాలు చేసిన మట్టి కుండను ప్రదర్శించేవారు. నేడు మట్టికుండ స్థానంలో లోహపు పాత్రను (లోట) ప్రదర్శిస్తున్నారు.
* పూర్వం ఎలగొడ్డు ప్రదర్శనలో నల్లని గొంగడిని ఉపయోగించేవారు. నేడు నల్లగొంగడి స్థానంలో గోనెసంచులను ఉపయోగిస్తున్నారు. అంతేకాకుండా ఆ గోనెసంచులను ప్యాంట్ ఆకారంలో కుట్టి ఆధునిక హంగులతో ప్రదర్శిస్తున్నారు.
* కామదహనానికి కావలసిన చితిని ఏర్పాటు చేయడంలో పూర్వం గ్రామస్తులందరూ ప్రతి ఇంటి నుండి ఒక నుగ్గును విధిగా తీసుకొని వచ్చేవారు. నేడు చితిని ఏర్పాటు చేయడం అనే తంతు ఒక సమూహానికో లేదా ఒక వ్యక్తికో పరిమితమైపోయింది.
* ఒకప్పటి కామునిపున్నమి ప్రదర్శనలు కులమతాలకతీతంగా అందరూ కలిసి ప్రదర్శించేవారు. నేడు జరుపుకునే కామునిపున్నమి ప్రదర్శనల్లో విభిన్న కులాల భాగస్వామ్యం వున్నప్పటికీ కొన్ని రకాల ప్రదర్శనలు అంటే కామయ్య ప్రదర్శన, కామమ్మప్రదర్శన, ఎలగొడ్డు ప్రదర్శనలను కొన్ని కులాల వారు మాత్రమే ప్రదర్శిస్తున్నారు.
* నాడు ఉపయోగించే రంగులు ప్రకృతి ప్రసాదాలైన మోదుగపూలతో తయారు చేసేవారు. నేడు వివిధ రసాయనాలతో తయారుచేసిన రంగులను ఉపయోగిస్తున్నారు. అంతేకాకుండా కళ్లకు హానిచేసే కందెనలు వంటి వాటిని వాడుతున్నారు. నేటి యువత నాగరికత, ఆధునికత పేరుతో కొందరు కోడిగుడ్లను తలపై పగులగొట్టుకుంటే, మరికొందరు మురికినీళ్ళల్లో మునకలేస్తూ వేడుకలు చేసుకుంటున్నారు.

## ముగింపు

జానపద విజ్ఞాన సమాచారాన్ని చేరవేయడానికి జానపద ప్రదర్శనలు ఎంతగానో దోహదం చేస్తాయి. అలాంటి విజ్ఞాన ప్రదర్శనల్లో కామునిపున్నమి ప్రదర్శనలు పేర్కొనదగినవి. ప్రపంచీకరణ, ఆధునిక పోకడల కారణంగా జానపద ప్రదర్శనకళలు అనేక పరిణామాలకు లోనవుతున్నాయి. ప్రదర్శనలోను, వాద్యాల్లోను నూతనత్వం చోటు చేసుకుంటున్నాయి. కాముని పండుగ ప్రధానంగా కులాలను, వ్యక్తులను సంఘటితంచేసి, మనుష్యులమధ్య అంతరాలను తొలగించి, ఐక్యమత్యాన్ని పెంపొందిస్తుంది. ప్రతి ఇంటి నుండి నుగ్గులను సేకరించడం, ప్రతి కులానికి గుర్తింపును, బాధ్యతలను ఇవ్వడం, కామునిబూడిదకు అతీతశక్తులు వున్నట్లు భావించడం అనే అంశాలు మనుష్యులను ఒక దగ్గర చేర్చడానికి తోడ్పడ్డాయి. కాని నేడు కామునిపండుగ ఒక పండుగగానే వంటరిగా మిగిలిపోయింది. కాముని పండుగ నిర్వహణలో తమ బాధ్యత కచ్చితంగా వుందని ఏ కులంవారుగాని, ఏ వ్యక్తిగాని భావించడం లేదు. కామునిబూడిదకు అతీత శక్తులున్నాయనే ఒకే ఒక నమ్మకంతో ఆచారంగా నేడు పండుగను చేసుకుంటున్నారు. ఆధునిక ముసుగులో కొన్ని రకాల ప్రదర్శనలను ప్రదర్శించడం మానివేస్తున్నారు. దీనివల్ల ఒకనాటి విలువైన ప్రదర్శనకళ మరుగున పడిపోయే ప్రమాదం పొంచివుంది. "మానవులంతా జన్మత: మంచివారే, నాగరికత పట్టణవాసం వారిని మలిన పరుస్తుంది." అన్న రూసో మాటల్లో నిజం లేకపోలేదు. పూర్వీకులు ప్రదర్శించిన కళలు, ఆచారాలను మరుగుపరచకుండా వాటిని ఆదరించి, ఆచరించిన వారే నిజమైన నాగరికులు. జానపద ప్రదర్శనలను, కళలను భద్రపరిచి మన ముందుతరాలకు అందించవలసిన బాధ్యత నాగరికులమని చెప్పుకుంటున్న మనందరిపై వున్నది.

### ఉపయుక్త గ్రంథ సూచి


1. ప్రతాపరెడ్డి, సురవరం, 1987, **హిందువుల పండుగలు.** సురవరం ప్రతాపరెడ్డి సాహిత్యవైజయంతి, ఆంధ్రసారస్వత పరిషత్తు: హైదరాబాద్

2. ప్రసాదరావు, వై.ఎస్. డబ్ల్యు (సం), 2008, విద్యామనోవిజ్ఞాన శాస్త్ర ఆధారాలు, తెలుగు అకాడమి, హైదరాబాద్

3. యాదగిరి, ఎ, 2007, **కాముని పున్నమి జానపదుల ప్రదర్శనలు (గోపాలపేట మండలం మహబూబ్ నగర్‌జిల్లా),** ఎం.ఫిల్ సిద్ధాంత గ్రంథం (అముద్రితం) జానపద కళలశాఖ, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.

4. రాధాకృష్ణ, మిక్కిలినేని, 1992, **తెలుగు వారి జానపద కళారూపాలు,** పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్

5. రామకృష్ణయ్య, కోరాడ (సం), 1948, **కుమారసంభవం.** మద్రాసు విశ్వ విద్యాలయం, మద్రాసు.

6. రామచంద్ర, తిరుమల, 1975. **తెలుగు పండుగలు,** ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ: హైదరాబాద్.

7. రామయ్యపంతులు, జయంతి, 1958, **శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.** ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్.

8. రామరాజు, బిరుదురాజు, 1968, **తెలంగాణ పల్లెపాటలు,** ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాద్.

9. రామరాజు, బిరుదురాజు, 1978, **తెలుగు జానపద గేయసాహిత్యం,** జానపద విజ్ఞాన ప్రచురణలు, హైదరాబాద్.

10. సుందరం, ఆర్వీయస్, 1983, **ఆంధ్రుల జానపద విజ్ఞానం,** పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.

# జడకోపులు, రకాలు - ప్రదర్శన పద్ధతి : నాడు - నేడు

- యర్రంపల్లె సుధాకర్
ఎం.ఫిల్. పరిశోధకులు - జానపదకళల శాఖ
పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,నాంపల్లి
హైదరాబాద్

## పరిచయం

తెలుగు సాంస్కృతిక వారసత్వంలో జానపద కళారూపానికి ఒక ప్రత్యేకస్థానం ఉంది. జన జీవన నిర్మాణంలో కళారూపాలు ఆదినుంచి తమవంతు పాత్రని పోషిస్తూనే ఉన్నాయి. జానపద కళారూపాల అధ్యయనం ఒకరకంగా జన చరిత్రగా చెప్పుకోవచ్చు. ఆంధ్రదేశానికి సంబంధించినంత వరకు అనేక జానపద కళారూపాలు వారసత్వ సంపదగా ఇప్పటికీ సజీవంగా ఉన్నాయి. అలాంటి జానపద కళారూపాలలో 'జడకోపు'కు ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది.

జానపదుల మానసిక ఉల్లాసానికి, సంతోషానికి కళలున్నాయి. ఉత్సవాలలో వేడుకల్లో ప్రజల మనసుల్ని రంజింపచేయడానికి సృష్టించబడిన ప్రదర్శన కళారూపాలలో జడకోపుకళారూపం ఒకటని చెప్పవచ్చు. జానపదులను మోటువారని, ప్రాకృతులని, అజ్ఞానులని వేరువేరు పేర్లతో పిలుస్తున్నారు. కానీ భారతంలో శాంతిపర్వంలో వ్యాసులవారు "కృతమజ్ఞశ్చ మేధావీ బుధో జానపదశ్చ" అన్నారు. అనగా యజ్ఞం చేసినవారితో జానపదులు సమానం అని భావం. జానపదులు పదం పాడుతూ, కదం తొక్కుతూ ఎన్నో కాలక్షేపాలు చేస్తుంటారు. అందుకే పటపటమని చెమటబొట్లు తాళాలై పడుతుంటే "పాట పనితోపాటే పుట్టింది, పని పాటతో పాటే జతకట్టింది." అని అన్నారు. ఆపదాలే జానపదంగా, జానపదకళారూపాలుగా ఆవిర్భవించాయి.

## 2. జానపద కళారూపాలు

జానపదకళారూపాలను తరతరాలుగా సంతరించుకున్న వైభవాన్ని తెలియని వారు లేరనటంలో అతిశయోక్తి లేదు. ప్రదర్శింపబడే కళారూపాలలో అత్యంత ప్రాచీన విభాగానికి చెందినది జానపద నృత్య ప్రక్రియ. ఇది ప్రకృతికి అనుగుణంగా ఆవిర్భవించి, మతాచార కార్యకలాపాల్లో ఒక భాగంగా అవతరించి లౌకిక కళగా మార్పు చెందింది. నృత్ అనే ధాతువు నుండి నృత్యం అనే పదం ఉత్పన్నమైంది. నృత్ అంటే గాత్రవిన్యాసం. ఇది ఆంగికాభినయాన్ని సూచిస్తుంది. నృత్యమంటే ఒక సంగీత సరళి యొక్క తాళాలను అనుసరించి అంగప్రత్యంగ ఉపాంగాలను క్రమపద్ధతిలో విన్యాసం చేయడం. ఒక సంగీత సరళి యొక్క అర్థాన్ని కూడా అనుసరించి భావాభినయం చేయడమే నృత్యం. దేహానికే కాక మనసుకు కూడా క్రమశిక్షణను అలవాటు చేసే కళలే జానపద కళారూపాలు.

## 3. జడకోపులు పుట్టుక : రకాలు

పురాణకాలం నుండి స్త్రీలు అలంకారానికే ప్రాధాన్యం ఇచ్చేవారు. శుభకార్యాలలో స్త్రీలు చక్కగా అలంకరించుకోవడం పరిపాటి. నగలు, చీరలు ధరించడం, పొడవైన తమ కురులను చక్కగా దువ్వి, వివిధరకాలుగా కేశాలంకరణ చేసుకోవడం ఒక ఎత్తు, రకరకాలుగా జడలు అల్లి, ఆ జడలకు వివిధ రకాల ఆభరణాలు అలంకరించి అందంగా కనిపించాలనే తపన ప్రతివారిలోనూ ఉంటుంది. అలా స్త్రీ కేశాలంకరణలో జడ ప్రధాన పాత్ర వహించింది. జడ అల్లడం ఒక కళ, వివిధ ఆకృతులలో జడలు అల్లి, పెళ్ళి కూతురిని తయారు చేయడంలో అందెవేసినవారు ఉంటారు. అందుకే వివిధ వేడుకల సమయాలలో ఆయా స్త్రీలు తమకేశాలను అలంకరణలో నిష్ణాతులచే అలంకరింపచేయడం కూడా ప్రస్తుతం జరుగుతున్నది (బ్యూటీపార్లర్లు).

ఆ స్త్రీలు అలంకారంగా అల్లిన జడలలో వివిధ రకాలు ఉన్నట్టే వీటిని అనుకరిస్తూ జానపదులు తమ కళారూపాలలో ఈ జడలల్లడం ప్రారంభించారని చెప్పవచ్చు. సాధారణంగా చక్కగా దువ్విన వెంట్రుకలను మూడు పాయలుగా విడదీసి ఒక్కొక్క దానిని మరొక దానిపై కుదిర్చి అల్లడం జడ. అదే జడను ఇక్కడ కళాకారులు జతలుగా ఏర్పడి, తమ చేతులలోని తాళ్ళ సహాయంతో అదే విధంగా అల్లడం అలవాటు చేసుకున్నారు. అదే మూడు పాయల జడ.

జానపదులు తమ జీవన సరళిలో చుట్టూ పరిసరాలలో వివిధ ఆకృతులను తమ కళలలోనికి మార్చుకొంటుంటారు. జానపదులు తమ పొలాలు దున్నడానికి నాగలి బరువులు మోయడానికి బండ్లు ఏర్పాటు చేసుకొంటారు. నాగలికిగాని, బండికిగాని కాడిమానుకావాలి. రెండు ఎద్దులకు మెడపై ఉంచేది కాడిమాను.

ఆ కాడిమాను చివర రెండు రంధ్రాలకు తాడుతో కట్టేవి పట్టెడ. ఈ పట్టెడలను ఒక వైపు కాడిమానుకు కట్టి ఎద్దు మెడ నుండి మరో వైపుకు మెడచుట్టూ చుట్టి, రెండవ రంధ్రానికి తాడుకడతారు. అదే పట్టెడ. ఆ పట్టెడను నూలుదారాలతో గాని, నారతోగాని పేనుతారు. ఆ అల్లికకూడా అందంగానే ఉంటుంది. ఆ పట్టెడ అల్లిన విధముగానే అదే ఆకారంలో పట్టెడ జడవేయటం కళాకారులకు మరోసరదా.

పూర్వం వ్యవసాయ దారులు పంటపొలాలకు నీళ్ళు తోడటానికి బావికి కపిల కట్టి నీళ్ళు తోడేవారు. ఎద్దులను ఉపయోగించి బొక్కెన సహాయంతో బావిలోని నీరుతోడి పొలాలకు మడవకడతారు. ఈ బొక్కెన నీరు నిండినప్పుడు చాలా బరువుగా ఉంటుంది. కపిల బిళ్లపైన పెద్ద మోకు వేసి, దానిని బొక్కెనకు కడతారు ఈ మేకు బలంగా ఉండడానికి గోగునారతోనో లేక ఏపెనార, కలబంధ లేదా జనపనారలతోనో సన్నసన్నని తాడుపేని, అలా పేనిన తాడులను మళ్ళీ ఇద్దరు కలిసి ఒకే పెద్ద మోకుగా తయారు చేస్తారు. ఈ మోకు అల్లడం చాలా కష్టమైన పని, ఒక చోట లావుగా ఒక చోట సన్నగా లేకుండా సమానమైన మందంతో ఈ మోకును అల్లుతారు. ఆ కపిలమోకు ఆకారంలోనే కళాకారులు జడఅల్లి కపిలమోకు జడగా పిలుస్తారు.

చెరువులలో, కుంటలలో, సముద్రాలలో లేదా నదులలో చేపలు పట్టడం మనకు తెలుసు. ఆ చేపలు పట్టేందుకు వలకావాలి. నైలాన్ లేదా సిల్కుదారాలతో గంగపుత్రులు ఎన్నో రోజులు శ్రమించి వలలు అల్లుకుంటారు. ఈ వల అల్లి విసిరితే ఆయా ప్రాంతాలలోని చేపలన్నీ ఈ వలలో చిక్కు కుంటాయి. ఆ వల ఆకారంలో కళాకారులు తాళ్ళ సహాయంతో అల్లేదే 'వలజడ'.

పల్లెటూర్లలో పాడి మీద ఆధారపడి జీవించేవారు ఎక్కువ ఉంటారు. అలనాడు ద్వారకలో యాదవులు ఈ పాడివలనే జీవించారు. తమ పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, మున్నగు పాల పదార్థాలు పిల్లులు, కుక్కలు మున్నగునవి తినకుండా, అదే విధంగా చెడిపోకుండా దాచేందుకు తగిన చోటు కావాలి బోడ కొట్టానికి నిట్టాటి చూరుకు, మిద్దె యింటిలో దంతెలకు తాడుతో అల్లిన "ఉట్టి"ని ఉపయోగిస్తారు. ఈ ఉట్టిలో పాలకుండలను, వెన్నముంతలను ఉంచుతారు. పిల్లలకు అందని ఎత్తులో పెద్దలకు మాత్రమే అందే విధంగా ఈ ఉట్టిని అమర్చుతారు. వీటిలోని వెన్న, పాలు, పెరుగును దొంగిలించి తినడం శ్రీకృష్ణునికి ఒక లీలా వినోదం. ఆ ఉట్టి ఆకారంలో అల్లిన జడ "ఉట్లజడ" గోకులాష్టమిరోజు ఉట్టిమీద రంగులనీళ్లు ఉంచి, ఆ ఉట్టికొట్టడం, గొప్పదనంగా భావిస్తారు. అందుకే ఉట్టికి అంత ప్రాధాన్యం." ఉట్టిజడ అల్లడం నేర్పరులైన గురువులకే సులభసాధ్యం.



**జడకోపులలో ఈ కింది రకాలున్నాయి**

1. నూగాయ జడకోపు, 2. డబల్‌నూగాయ జడకోపు, 3. బెత్తం జడకోపు, 4. పట్టెడ జడకోపు, 5. చాప జడకోపు, 6. గుండు జడకోపు, 7. ఉట్టి జడకోపు, 8. గొలుసు జడకోపు, 9. సైకిల్ జడకోపు, 10. రెండు జడకోపు, 11. మూడు పచ్చాల జడకోపు, 12. నాలుగు పచ్చాల జడకోపు, 13. జెర్రిపోతు జడకోపు, 14. నాగబందన జడకోపు, 15. పొట్టు సక్కెం జడకోపు, 16. చినజల పుష్పం జడకోపు, 17. పెద్ద జల పుష్పం జడకోపు, 18. ప్రతిజడ కోపు, 19. దప్రేయుతీగజడకోపు, 20. కిటికి జడకోపు, 21. మూడు పాయల జడకోపు, 22. వంకి జడకోపు, 23. తదిక అల్లకం జడకోపు, 24. కపసిల మోకు జడకోపు.

## 4. జడకోపులు - ప్రదర్శన పద్ధతి

జడబిళ్ళను చెక్కతో తయారు చేసి రంధ్రాలు పెట్టి రంధ్రంలో ఒక్కో తాడును అమర్చుతారు. ఆ బిళ్ళను, తాళ్ళను ప్రదర్శన స్థలం వద్దకు తీసుకెళ్ళి ఊరిమధ్యలో లేదా రచ్చబండ మీద లేదా దేవాలయం వద్ద కానీ అటువైపు, ఇటువైపు తాడుకట్టి మధ్యలో జడ బిళ్ళను వేలాడదీస్తారు. జడకోపులు ప్రదర్శించే కళాకారులందరూ రంగురంగుల దుస్తులను ధరించి అందంగా అలంకరించు కొని బిళ్ళ నుండి కొండికి వేలాడదీసిన తాళ్ళను పురుషుడు కానీ, స్త్రీకాని ఎడమచేతితో పట్టుకుంటారు. కుడిచేతితో చిడతలను లేదా చెక్కలను పట్టుకొని రకరకాల జడలను అల్లడం మరల విప్పడం చేస్తారు. కొన్ని ప్రాంతాలలో స్త్రీలు మాత్రమే ఈ ప్రదర్శనలో పాల్గొంటారు. స్త్రీలు పురుషులు కూడా ఈ జడకోపులను అల్లుతారు. కొన్ని ప్రాంతాలలో పురుషులు కూడా ఈ జడకోపులను అల్లుతారు. ఈ జడకోపులు అల్లేటప్పుడు వాద్యాల శబ్దాలకు అనుగుణంగా లయబద్ధంగా రకరకాలుగా నృత్యం చేస్తుంటారు. రామాయణ, మహాభారత, భాగవతాల్లో నుండి పాటలను చేస్తారు. అంతేకాక హాస్యానికి సంబంధించిన, శృంగారానికి సంబంధించిన పాటలను పాడుతూ జడలను అల్లడం విప్పడం చేస్తారు.

## జడకోపుల ప్రదర్శన నాడు - నేడు

ఆనాడు ప్రదర్శింపబడుతున్న జడకోపుల ప్రదర్శనకు ఈనాడు ప్రదర్శింపబడె జడకోపుల ప్రదర్శనలో అనేక రకాలైన మార్పులు చోటు చేసుకున్నాయి. నాడు ప్రదర్శన కచ్చితంగా దేవాలయాల దగ్గర ఊరి నడిబొడ్డున ప్రదర్శనకు అనుగుణంగా ప్రదర్శన స్థలాన్ని ఏర్పాటు చేసుకొనేవాడు. నేడు అన్ని వేదికల మీద

అవసరమైన ప్రతిచోట జడకోపుల ప్రదర్శన జరుగుతూ వుంది. జడకోపు బిళ్ళకు వాడే తాళ్లను గొగునార, ఏపినార, జనపనారతో అందంగా పేని, జడ బిల్లకు కట్టేవారు, నూలు తాళ్ళు, నైలాను తాళ్ళు, ప్లాస్టిక్ తాళ్ళు వాడుతున్నారు. వేషధారణలలో మార్పుల వచ్చాయి, అలంకరణలోనూ మార్పులు వచ్చాయి, గాయాలలోను మార్పులు వచ్చాయి.

## గేయాలు

### 1. నూగాయ జడకోపు గేయం

కూర్చొని చెరిగే చేడకారులపై
భామకురులపై తుమ్మెద వాలెనె భామ
గండుతుమ్మెద వాలెనె భామ ॥కూర్చొని॥

చెరిగేటప్పుడు చేతిలో గాజులు
నిగనిగలాడేనె భామ
గండుతుమ్మెద వాలెనేభామ ॥కూర్చొని॥

గొప్పదిరోకలి గుప్పున దంచగ
జబ్బలు కదిలెనె భామ
గండుతుమ్మెద వలెనె భామ ॥కూర్చొని॥

చెమటకు తడిసిన చెదిరిన గందము
గుమగుమలాడునె భామ
గండు తుమ్మెద వాలెను భామ ॥కూర్చొని॥

### 2. ఉట్టిజడకోపు గేయం

యశోదమా నీ కొడుకు ఏడి ఎప్పుడో వస్తాడని
ఏదో తెస్తాడని ఎదురుచూచితి, నిదురా కాచితి
ఎందు దాగినాడో ॥యశోదమ్మ॥

మూడు వేల భామలతో ముద్దులాడేనే
నాల్గు వేల భామలతో నాట్యమాడేనే
నల్ల నల్లని వాడమ్మా నామాలు గొల్లవాడే ॥యశోదమ్మ॥



పల్లెభామలంత కూడి పెరుగు చిలకగా
వెన్నముద్ద దోచుకొని వెళ్ళిపోయేనే
ఎంత టక్కరోడే నీ ముద్దుల తనయుడు ॥యశోదమ్మ॥

పల్లె భామలంత కూడి చల్లలమ్మగా
సల్లబాన చిల్లి చేసి వెల్లి పోయేనే
ఎంత తుంటరోడే నీ ముద్దుల తనయుడు ॥యశోదమ్మ॥

ఈ విధంగా జానపద గేయాలలో కూడా అనేకమైన మార్పులు చోటు చేసుకున్నాయనడం సమంజసంగా ఉంటుంది. ఎందువలన అంటే ప్రస్తుతం జానపద గేయాలు కూడా సినిమా బాషశైలి వినిపిస్తున్నాయి. అయితే మూలాలు మారకుండా మేము అలపించే విధానంలో మార్పులు జరిగాయని తెలియుచున్నది. ఈ విధంగా ఆ నాటి ప్రదర్శనకు ఈనాడు ప్రదర్శించే ప్రదర్శనకు చాలా మార్పులు ఉన్నట్లు తెలియుచున్నది.

## ఆధార గ్రంథాలు


1. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి — తెలుగు జానపద కళారూపాలు
2. డా॥ సుబ్బరామిరెడ్డి — కడపజిల్లా జానపద గేయ గాథలు- నిర్మాణం- సమాజం- సంస్కృతి.
3. డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి — జానపద కళా వ్యాసావళి, ధర్మవరం తాలుకా జానపద గేయాలు
4. డా॥ బి. రామరాజు — తెలుగు జానపద గేయ సాహిత్యం
5. డా॥ ఆర్వీయస్ సుందరం — ఆంధ్రుల జానపద విజ్ఞానం
6. అమళ్ల దిన్నె గోపీనాథ్ — రాయలసీమ జానపదగేయాలు
7. డా॥ బిట్టు వెంకటేశ్వర్లు — పల్నాటి సీమలో కోలాటం, 1988 తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.
8. అనసూయాదేవి వింజమూరి — జానపద గేయాలు1980 మంజీరా-2-2-18/31, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్- 13
9. నేదునూరి గంగాధరం — మునేరు(1973), మిన్నేరు,(1963), సెలమీరు(1955)ప్రాచీన గ్రంథావళి రాజమహేంద్రవరం.

# గోండుల 'దండారి నృత్యం' ప్రదర్శన కళగా నాడు - నేడు

కె. రత్నాకర్ బాబు
ఎమ్.ఎ. (ఆంథ్రోపాలజీ)
పిహెచ్.డి. రిసెర్చ్ స్కాలర్
ఆంధ్ర విశ్వవిద్యాలయం
విశాఖపట్నం.

బి.కె. శ్రీనివాస్
ఎమ్.ఎ. (ఆంథ్రోపాలజీ)
పిహెచ్.డి. రిసెర్చ్ స్కాలర్
శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ
తిరుపతి

## పరిచయం

గోండులు ఎంతో ఆనందోత్సాహాలతో జరుపుకునే వేడుక దండారినృత్యం. ఈ నృత్యాన్ని ప్రత్యేకించి గోండులు మాత్రమేకాక కొలాం, ప్రధాన్, తోటి తెగవారు కూడా ప్రదర్శిస్తారు. ఈ నృత్యంవల్ల గ్రామాల మధ్య స్నేహ సంబంధాలు మెరుగుపడతాయి. వారు తమ నృత్యాల ద్వారా, ఆటపాటల ద్వారా వారి సంస్కృతి, సంప్రదాయాలను కాపాడుకుంటున్నారు.

ఆధునిక నాగరికత తెలియని అమాయకులైన గిరిజనులకు ఆనందాన్ని పంచేవి వారి నృత్యాలే. గిరిజనులలో నృత్యానికి ఎంతో ప్రాధాన్యం ఉంది. సంవత్సరం పొడువునా రకరకాల పండుగలను జరుపుకుంటూ, అందులో వారి రకరకాల వాద్య పరికరాలతో అనేక కళారూపాలను ప్రదర్శించటం గిరిజనుల ప్రత్యేకత.

దండారి నృత్యం నాడు ఏ విధంగా చేసుకునేవారు, దానిలోని విశేషాలు, దండారి బృందం ప్రత్యేకత, పురుషులు స్త్రీల వేషంతో చేసే విచిత్రమైన వేషాలు, గుస్సాడి నృత్యం మొదలైన అంశాలతోపాటు నేడు నృత్యంలో వచ్చిన మార్పులను చర్చించటం ఈ వ్యాస ఉద్దేశ్యం.

## గోండుల పుట్టు - పూర్వోత్తరాలు

గోండుల పుట్టినిల్లు మధ్యప్రదేశ్‌లోని 'గోండ్‌వాన' అనే ప్రాంతం. తర్వాతి కాలంలో వీరు మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్, కర్ణాటక, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్‌లకు వలస వచ్చి స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. గోండులలో ప్రధానంగా నాలుగు ఉపతెగలు ఉన్నాయి. అవి 1. రాజ్‌గోండ్, 2. మురియా గోండ్, 3. మరియా గోండ్, 4. దుర్వే గోండ్. వీరిలో కేవలం రాజ్ గోండ్‌లు మాత్రమే ఆంధ్రప్రదేశ్‌లోని ఆదిలాబాద్ జిల్లాలో కనిపిస్తారు. వీరికి ప్రత్యేకంగా ఉన్న భాష 'గోండి'. ఈ భాష ద్రావిడ భాషాకుటుంబానికి చెందింది. వీరు ఒకరిని ఒకరు సంబోధించుకునేటప్పుడు 'కొయితుర్' అని సంబోధిస్తారు. అయితే ఈ భాషకు ఎటువంటి లిపి లేదు. గోండులు భీముడు, హిడింబిల సంతతికి చెందినవారని చరిత్ర చెబుతోంది. గోండులు చేసే దండారి నృత్యం సంప్రదాయ నృత్యం. దీన్ని వారు తరతరాలుగా ప్రదర్శిస్తున్నారు.

## దండారి నృత్యం

గోండులు ఆశ్వీయుజ మాసంలో (దివాడి) దీపావళి పండుగ సందర్భంగా జరుపుకునే వేడుక 'దండారి నృత్యం'. దీన్ని గిరిజన నృత్యాలలో చాలా ప్రాచుర్యం పొందిన నృత్యంగా చెపుతారు. ఈ దండారి నృత్యాన్ని దీపావళికి పది రోజుల ముందు నుంచి మొదలు పెడతారు. ఈ సమయంలో గ్రామస్థులందరి వద్ద పుష్కలమైన ధనధాన్యాలు, పశుసంపద, ఎక్కువ విశ్రాంతి సమయాన్ని కలిగి వుంటారు.

'దండారి నృత్యం' గోండులదే అయినా దీనిని కొలాం, ప్రధాన్, తోటి తెగలు కూడా ఈ నృత్యాన్ని ప్రదర్శిస్తారు. 'దండారి నృత్యం' గోండు దేవతల సంస్కృతి, సంప్రదాయాలను తెలియ జేస్తుంది. ఈ నృత్యం గోండుల పూర్వీకుల పౌరాణిక గాథలను, మతపరమైన ఆచారాలను వెల్లడిస్తుంది. ముఖ్యంగా ఈ నృత్యం 'దండ్రియారావుర్' 'సిపి సేమ రావుర్'ల పేర్ల మీదుగా జరుపబడుతుంది. వీరిని గోండు సమాజంలో పురాణ పురుషులుగా పూజిస్తారు. కావున వీరిని 'ఏత్మసారోపేన్' (గోండుల నృత్య దేవుళ్ళు)గా భావిస్తారు.

ఆషాఢమాస పౌర్ణమి రోజున 'ఆకాడి' పండుగ చేస్తారు. ఈ సందర్భంగా గ్రామ పూజారి(దేవరి) సంగీత వాద్య పరికరాల (ఆకర)పై కోడిని కోసి, దాని రక్తాన్ని వాటిపై చిలకరించి పూజచేస్తాడు. అయితే 'ఆకాడి' పండుగ రోజున ప్రత్యేకంగా పిచ్చుక (కొట్కపిట్టె)ను కోసి, 'ఆకాడి పేన్'కు అర్పించి, దాని మాంసాన్ని దండారి బృందం తింటారు. ఈ రోజు నుండి గ్రామంలో జరిగే ఏ శుభకార్యానికైనా ఈ వాద్యాలను (ఆకర) వాయిస్తూ, నృత్యాలు చేయవచ్చు. దండారి నృత్యంలో పాల్గొనదలచిన వారందరు ఈ పండుగ రోజున పూజకు హాజరవుతారు. ఈ పూజలో దండారి నృత్య సభ్యులకు ఎటువంటి హాని జరగకూడదని, మంచి ఆరోగ్యం కలిగి వుండాలని 'రావూర్ సోదరులను' వేడుకుంటారు.

గోండులు దీపావళి (దివాడి)కి పది రోజుల ముందుగా 'భోగి' పండుగ జరుపుకుంటారు. ఈ 'భోగి' పండుగ నుండి దీపావళి తర్వాత జరుపుకునే 'కోలబొడి' పండుగ వరకు ఈ దండారి బృందం వివిధ గ్రామాలను సందర్శి స్తుంటారు. ఈ పండుగ రోజున పూజారి(దేవరి) అన్ని రకాల సంగీత వాద్య పరికరాలు, కర్రలు (కోలాలు), గుస్సాడి టోపీలను తెల్లని వస్త్రంపై ఉంచి పూజ చేస్తారు. ఈ పూజ ప్రతి గ్రామంలోని గ్రామపెద్ద (పాట్లల్) ఇంటి ముందు జరుపుతారు. ఇత్తడి పళ్ళెంలో కొంచెం అన్నం, జొన్న ఆకులు పెట్టి అగరవత్తులు వెలిగించి, 'రావూర్ సోదరులకు' స్మరిస్తూ కొబ్బరికాయ కొడతారు. పూజకు వచ్చిన ప్రతి ఒక్కరు వాద్య పరికరాలను నమస్కరించి వెళతారు. పూజారి 'ఆకిపేన్', 'పాడి అవ్వల్' లకు కూడా పూజ నిర్వహించిన తర్వాత నృత్యబందం దండారి నృత్య ప్రారంభసూచకంగా వాద్యాలను వాయిస్తూ నృత్యాలు చేస్తారు. ఆరోజు సాయంత్రం నుండి దండారి నృత్య బృందం, గుస్సాడిలు, గుమ్మెల పొరి (గోండి స్త్రీ వేషం ధరించే యువకులు) అందరు తమతమ వేషాలు ధరిస్తారు.

ఈ దండారి బృందం తమ గ్రామం నుండి వేరొక గ్రామానికి అతిథులుగా ఆహ్వానించబడతారు. అదేవిధంగా వేరే గ్రామ దండారి బృందాన్ని తమ గ్రామానికి ఆహ్వానిస్తారు. ఒక గ్రామానికి చెందిన బృందాన్ని వేరొక గ్రామం వారు ఆహ్వానించినట్లయితే తర్వాత సంవత్సరం ఆతిథ్యం స్వీకరించిన గ్రామాన్ని వారు తప్పకుండా సందర్శించాలి. ఈ విధమైన స్నేహపూర్వక సంబంధాలు గ్రామాల మధ్య పెంపొందించడం దండారి నృత్యంలో ఒక భాగం. ఈ పండుగ గ్రామస్థుల మధ్య ప్రేమబంధాన్ని, ఆత్మీయుల మధ్య అనురాగాన్ని, గ్రామాల మధ్య సత్సంబంధాలను నెలకొల్పుతుంది. ఇదే దండారి నృత్యంలోని విశిష్టత.

ఒక ఊరి దండారి బృందం వేరొక ఊరి ఆహ్వానం మేరకు వారి గ్రామానికి సందర్శించడానికి సాధారణంగా రాత్రి సమయంలో గ్రామ పొలిమేరలకు చేరుకుంటారు. ఎవరయినా ఒకరిచేత గ్రామ పెద్దకు తమ రాక గురించి కబురు చేస్తారు. దండారి బృందం రాక విషయాన్ని తెలిసిన గ్రామస్థులందరు తమ గ్రామ దండారి బృందంతో కలిసి ఊరి పొలిమేరలో ఉన్న దండారి బృందం వారిని ఆహ్వానిస్తారు. అక్కడి నుండి రెండు బృందాల వారు పెద్దపెద్ద శబ్దాలతో వాద్యాలను వాయిస్తూ, నృత్యాలు చేస్తూ గ్రామంలోని 'పాట్లాల్' ఇంటికి చేరుకుంటారు. అక్కడ గుస్సాడీల చేతిలో ఉండే 'రోకల్' (గంగారామ్ సోట)లను కడిగి, తర్వాత బృందంలోని వారి కాళ్ళు కడుగుతారు. వారికి మర్యాద పూర్వకంగా బీడీలు, ఛాయ్ ఇచ్చి ఒకరినొకరు



'రామ్‌రామ్' అని పలకరించుకొని, ఒకరినొకరు మూడుసార్లు ఆలింగనంచేసుకొని (కలివల్) క్షేమ సమాచారాలను తెలుసుకుంటారు. వారికి గ్రామంలో ఏర్పాటు చేయబడిన వసతి గృహం దగ్గర భోజన కార్యక్రమాలు చేపడతారు. ముందుగా గుస్సాడీలు భోజనం చేసిన తర్వాత మాత్రమే మిగిలిన సభ్యులు ఆహారం తింటారు. అయితే ఈ బృందంలో 'గుస్సాడీ'లు అందరికీ కలిపి ఒకే కంచంలో ఆహారాన్ని పెడతారు. కొద్దిసేపు విరామం తీసుకున్న తర్వాత దండారి నృత్యాన్ని ప్రారంభిస్తారు.

## సంగీత వాద్య పరికరాలు

ఈ దండారి నృత్యంలో వివిధ రకాల వాయిద్య పరికరాలను ఉపయోగిస్తారు. ప్రతి వాయిద్య పరికరం ఒక్కొక్క ప్రాముఖ్యాన్ని కలిగి ఉంటాయి.

### గుమెల

ఇది గుండ్రని ఆకారం గల కాల్చిన మట్టికుండకు ఒక పక్క చర్మంతో కప్పబడి ఉంటుంది. రెండవ పక్క తెరచబడి ఉంటుంది. దీన్ని చర్మం ఉన్న భాగంవైపు కుడిచేతితో వాయిస్తూ, తెరచబడివున్న భాగంవైపు ఎడమచేతిని పెట్టి ఉంచుతారు.

### పార్ర

ఇది రెండు పొరల చర్మంతో చేయబడి ఉంటుంది. దీని మధ్య భాగంలో దళసరిగా ఉండి చివరిభాగాలలో పలుచగా ఉంటుంది. దీని మధ్య భాగంలో దళసరిగా ఉండి, చివరి భాగాలలో పలుచగా ఉంటుంది. దీనిని కాళ్ళ మధ్య పెట్టుకొని రెండు చేతివేళ్ళతో వాయిస్తారు. ఇది చిన్న నగారానుపోలి ఉంటుంది.

### తుర్‌బులి / వెట్టె

ఇది 10 అంగుళాల చుట్టుకొలత మించకుండా, మూకుడు ఆకారం కలిగి, ఒక పొరచర్మంతో కప్పబడి ఉంటుంది. దీన్ని కలప లేదా ఇనుము లేదా మట్టితో తయారు చేస్తారు. ఈ వాద్యాన్ని రెండు సన్నని వెదురు బద్దలతో వాయిస్తారు.

### డోల్

ఇది వృత్తాకారమైన చెక్క చట్రాన్ని డ్రమ్ములా మలచి ఇరువైపుల నుండి చర్మంతో కప్పబడి ఉంటుంది. దీనికి కుడివైపు కర్రతో (డోల్‌కోల), ఎడమవైపు చేతితో వాయిస్తారు. ఈ ఎడమవైపు భాగంలో రెండవ వ్యక్తి కూడా రెండు సన్నని కర్రలతో దరువు వేస్తుంటాడు. దీన్ని సాధారణంగా చిన్న పిల్లలు వాయిస్తారు. వారిని గోండు భాషలో 'చడంగా' అని సంబోధిస్తారు.

**డప్**

ఇది వృత్తాకార చెక్క చట్రంతో చేయబడి చర్మంతో కప్పబడి ఉంటుంది. దీన్ని ఎడమచేతితో సన్నని కర్రను, కుడిచేతితో కొంచెం లావుగా ఉండే కర్రతో వాయిస్తారు. వీటిని సాధారణంగా దండారి నృత్యకారులు ఊరేగింపుగా వెళుతున్నప్పుడు, గుస్సాడీల మధ్య నృత్య సందర్భంగా వాయిస్తారు.

**పెప్రె**

ఇది బూరవంటి వాయిద్య పరికరం. దీన్ని ముఖ్యంగా ప్రధాన్ తెగకు చెందిన వారు మాత్రమే వాయిస్తారు. ఈ పరికరం 'షహనాయి'ని పోలి ఉంటుంది.

**కాలిఖోమ్**

ఇది 4 అడుగుల పొడవు కలిగి అర్ధవృత్తాకార కొమ్ము వంటి సంగీత వాద్య పరికరం. దీన్ని ఇత్తడి లోహంతో తయారు చేస్తారు. దీన్ని ముఖ్యంగా ప్రధానులు లేదా తోటి తెగకు చెందిన వారు ఊరేగింపుగా వెళ్తున్నప్పుడు వాయిస్తారు. దీనిని దండారి నృత్యబృందం ఇతర గ్రామాలను సమీపించే టప్పుడు, గ్రామాన్ని విడిచివెళ్ళేటప్పుడు ఎక్కువగా వాయిస్తారు. దీని శబ్దం సుమారు చుట్టుప్రక్కల అన్ని గ్రామాలకు వినిపిస్తుంది.

**'గుస్సాడి' వేషం**

గోండులు ఎంతో భక్తి భావాలతో గుస్సాడివేషం ధరిస్తారు. గుస్సాడీలు తప్పనిసరిగా కొన్ని కఠిన నియమ నిబంధనలు పాటిస్తారు. 'దివాడి' పండుగ అయ్యే వరకు కఠిన బ్రహ్మచర్యం పాటిస్తూ నేలపై పడుకుంటారు. 'భోగి' నుండి 'కోలబోడి' వరకు స్నానం చేయకుండా పవిత్ర దీక్షాపరులై ఉంటారు. కాళ్ళకు చెప్పులు కూడా ధరించరు. దండారి నృత్యబృందంలో ఎక్కువగా చూపరులను ఆకట్టుకొనేవి 'గుస్సాడి'ల వేషధారణ.

'గుస్సాడి' వేషం వేసేవారు తలకు నెమలి ఈకలతో చేసిన టోపీలు ధరిస్తారు. దీనిని 'మల్‌జాలీన టోపీ' అంటారు. వీరి శరీరమంతా బూడిద, సున్నం, మసి మొదలైనవి పూస్తారు. శరీరమంతా నల్లని, ఎర్రని బొట్లు పెట్టుకుంటారు. కాళ్ళకు, చేతులకు సున్నంతో దట్టమైన తెల్లని చారలు వేస్తారు. మొలచుట్టూ తెల్లని లేదా నల్లని గొంగళి చుట్టుకుంటారు. జంతుచర్మంతో లేదా నారతో చేయబడిన గడ్డాలు, మీసాలు పెట్టుకుంటారు.



అడవిలో దొరికే రకరకాల పూసలు, విత్తనాలతో చేయబడిన గొలుసులను మెడలోనూ, కాళ్ళకు, మోచేతులకు మువ్వలు, నడుము చుట్టూ మూడు నుండి నాలుగు గజ్జెలు (గాగ్రా) ధరిస్తారు. మేక లేదా జింక చర్మాలను ఎడమవైపు భుజానికి తగిలించుకుంటారు. వస్త్రంతో చేయబడిన చిన్న సంచి (జోలె)ని కూడా ధరిస్తారు.

వెదురుతో చేయబడిన వృత్తాకార చట్రంలో నెమలి ఈకలు వరుసగా పేర్చి ఒక టోపీలా తయారు చేస్తారు. ఈ టోపీ తలకు ధరించినప్పుడు అది కదలకుండా ఉండేందుకు దాని కింది భాగంలో మెత్తని గుడ్డను చుడతారు. ఈ టోపి ముందు భాగంలో జింకకొమ్ములు లేదా మేక కొమ్ములను పెడతారు. టోపీ చుట్టూ అద్దాలు, పూసలు, మెరుపులు, గవ్వలతో అలంకరిస్తారు.

గుస్సాడీలు కుడి చేతిలో రెండు అడుగుల నల్లరంగు కర్రను ధరిస్తారు. దాన్ని 'రోకల్ (గంగారామ్ సోటా) అంటారు. ఈ కర్రను చాలా పవిత్రమైన దానిగా భావిస్తారు. గుస్సాడీలు తమ చిలిపి చేష్టలతో అందరిని నవ్విస్తూ ఉంటారు. కాని వారిని దండారి బృందంలో ఎంతో గౌరవంగా చూస్తారు. గ్రామస్థులు గుస్సాడీలను తమ జన్మస్థలం నుండి దేవుళ్ళను తీసుకువచ్చే మధ్యవర్తులుగా భావిస్తారు. అందుచేతనే వారికి మొదట ఆహారం పెట్టిన తర్వాతనే ఇతరులకు పెడతారు.

**'దండారి' బృందం వస్త్ర ధారణ, అలంకరణ**

దండారి నృత్యబృందంలో ఇతర సభ్యులు తెల్లటి చొక్కా, ధోవతి ధరిస్తారు. కాళ్ళకు గజ్జెలు, తల, మెడ చుట్టూ రంగు రంగుల వస్త్రాలు ధరిస్తారు. ఈ నృత్యంలో ఇరవై నుండి నలభై మంది కళాకారులు పాల్గొంటారు. ఈ బృందం రెండు జట్లుగా విభజింపబడి ఉంటుంది. ఒక జట్టును 'పర్రపోరిక' అని, రెండవ జట్టును 'కొయితుర్' అని అంటారు. ఈ బృందంలో పాల్గొనే నృత్యకారుల సంఖ్య ఎప్పుడూ సరిసంఖ్యలో ఉంటుంది. 'పర్రపోరిక' జట్టులో 10 నుండి 15 సంవత్సరాల లోపు పెళ్ళికాని యువకులు గోండు స్త్రీల వలె చీరలు, ఆభరణాలు మొదలైనవి ధరిస్తారు.

**'దండారి', 'గుస్సాడి' నృత్యరీతులు**

దండారి నృత్యం ప్రారంభమయ్యే కాలంలో చలి ఎక్కువగా ఉండటం వలన నెగళ్ళు వెలిగించి దానిచుట్టూ ప్రధాన్ తెగకు చెందినవారు వాద్యం వాయిస్తూ ఉంటే నృత్యకారులు నృత్యం చేస్తుంటారు.

ప్రధాన్ తెగవారు 'పెప్రె'ను వాయిస్తూ ఉంటే వారికి అనుగుణంగా పారా లేదా గుమెల / తుర్‌బులిని గోండులు వాయిస్తారు. ఈ సంగీతానికి అనుగుణంగా

తోటి, ప్రధానులు పాటలను పాడతారు. ఈ పాటలకు అనుగుణంగా దండారి నృత్యకారులు వివిధ రకాలైన కదలికలతో నృత్యం చేస్తుంటారు. మొదట రెండు వలయాకారులుగా ఏర్పడతారు. అందులో బయటి వలయంలో మగవారు, లోపలి వలయంలో ఆడవారి వేషం వేసుకున్న వారు తమ చేతులతో కోలలు పట్టుకొని కుడివైపు నుండి మొదలుపెట్టి కోలాటం వలె ఆడుతూ అపశవ్యదిశలో కదులుతూ ఉంటారు. ప్రారంభంలో ఈ విధంగా చేసే నృత్యాన్ని 'మాన్‌కోలా/ సార్‌కోలా' అంటారు. ఇది అందరినీ ఆహ్వానించే నృత్యం.

ఒక స్త్రీ, ఒక పురుషుడు ఉండే విధంగా వలయంలో జంటలుగా ఏర్పడతారు. వారు తమ కోలాలతో కొట్టుకుంటూ కుడి నుండి ఎడమకు, ఎడమ నుండి కుడివైపుకు మారుతూ ప్రతి రెండు అడుగులకు ఒక సారి ముందుకు కదులుతూ తమ జతకానిని మారుస్తూ అపశవ్యదిశలో నృత్యం చేస్తుంటారు. ఈ విధమైన నృత్యాన్ని 'సంధికోలా' అంటారు. ఈ విధంగా నృత్యం చేస్తూ రెండు, మూడు పాటలైన తర్వాత దండారి బృందం వారికి భోజనం ఏర్పాట్లు చేస్తారు. భోజనం తరువాత స్వల్ప విరామం తీసుకున్న తర్వాత మరల నృత్యాన్ని ప్రారంభిస్తారు. భోజనం చేసిన అనంతరం చేసే నృత్యాన్ని 'హుర్రేకొలా' అంటారు. ఈ నృత్యంలో ఎక్కువగా 'పాౡా' సంగీతాన్ని ఎక్కువగా వాయిస్తారు. అందువలన దీనిని 'పాౡానృత్యం' అని కూడా అంటారు.

దండారి బృందంలో ఒక వ్యక్తి చెక్కతో చేసిన కవచాన్ని ముఖానికి ధరించి, దండారి బృందంతో పాటు నృత్యం చేస్తాడు. ఇలా కవచం ధరించిన వ్యక్తిని 'కోడల్' అంటారు. ఇతనికి నృత్యం చేస్తున్నప్పుడు మధ్య మధ్యలో పూనకం వస్తూ ఉంటుంది.

దండారి నృత్యం చేస్తున్న సమయంలో 'గుస్సాడీ'లు వారిచుట్టూ తిరుగుతూ ఉంటారు. గుస్సాడీలు ఎక్కువగా పూజా సమయంలోనూ గ్రామాలను సమీపించేటప్పుడు, విడిచి వెళ్ళేటప్పుడు డప్పు వాద్యానికి అనుగుణంగా నృత్యం చేస్తారు. ఇది చాలా ఉధృతంగా ఉండి చూపరులను ఎంతో ఉత్సాహపరుస్తుంది. గుస్సాడీ వేషం ధరించిన వారికి అతీతశక్తులు ఉంటాయని వారిని ముట్టుకుంటే అన్ని రకాల కీడులు పోతాయని గోండుల నమ్మకం. ఈ దండారి నృత్యంలో సుమారుగా 16 రకాల నృత్యరీతులు, 18 రకాల సంగీత వాద్య రీతులు ఉంటాయి.
దండారి నృత్య సందర్భంగా పాడే పాటలలో రెండింటిని ఈ కింద ఉదహరించడం జరిగింది.



1. ప. పారోపాటర్ దనేగావ్ - అగా నివిడి కీతోర్ కోయగంతోర్ పహాండి కూపర్‌లింగాల్
చ. సోలాడెంసాంగ్ అట్రా వాజాంగ్-అగా నివిడి కీతోర్ కోయగంతుర్ పహాండి కూపర్ లింగాల్
నాలుంగ్ మూలాంగ్ నాలుంగ్ జెండాంగ్ నడుం వుంది ముండా
నాలుంగ్ మూలాంగ్ నాలుంగ్ సమ్యా నడుం వుంది సమ్యా
అగా నివిడి కీతోర్ కోయ గంతోర్ పహాండి కూపర్ లింగాల్
నాలుంగ్ సగనాపేన్క్ నివిడి కీతోర్ - కోయ గంతోర్ పహాండి కూపర్ లింగాల్
సీయుంగ్ సగానాపేన్క్ నివిడి కీతోర్ - కోయ గంతోర్ పహాండి కూపర్ లింగాల్
సారోం సగానా పేన్క్ నివిడి కీతోర్ - కోయ గంతోర్ పహాండి కూపర్ లింగాల్
ఏడుం సగానా పేన్క్ నివిడి కీతోర్ - కోయ గంతోర్ పహాండి కూపర్ లింగాల్
అకాడి సాదికీకట్ పేన్క్ నివిడి కీతోర్ - కోయ గంతోర్ పహాండి కూపర్‌లింగాల్
పారోపాటల్ దనేగావ్ - అగా నివిడి కీతోర్ కోయ గంతోర్ పహాండి కూపర్ లింగాల్
అర్థం.
భావం: ఈ పాటను దండారి నృత్య సమయంలో తప్పకుండా పాడతారు.

దీని భావం పహాడి కూపర్ లింగాల్ అనే గోండుల ఆధ్యాత్మిక గురువు పారో పాటర్ దనేగావ్ అనే ప్రదేశంలో గోండు జాతి మత ఆచారాలు, సంస్కృతి, సాంప్రదాయాల ఆవిర్భావానికి కృషి చేసాడు. వాటిలో కొన్ని ఏవనగా 16 రకాల నృత్యరీతులు, 18 రకాల సంగీత వాద్యరీతులను, గ్రామం నాలుగు దిక్కుల నాలుగు గ్రామ దేవతలు వాటికి సంబంధించిన జెండాలు, నాలుగు దీపాలు మరియు 4,5,6,7 గట్లు (సగా) గోండు సమాజానికి ఈయన మొదటి సారిగా పునాది వేసారు. వీటన్నింటిని మనకోసం చేసినందుకు మనం ఆకాడి పండుగ చేసుకొని దండారి నృత్యం చేసుకుందాం.

2. కుకుకుమిడి మెట్టాతె మలియన్డా లాక్ర, మలియన్డా లాక్ర
తరాయంగే బాన్‌డే మల్‌పాసి వాక
పాయ్‌మ కోకో పాయ్‌మ మల్‌మేస్‌కున్ వాత
కుకుకుమిడి మెట్టాతె మలియన్డా లాక్ర, మలియన్డా లాక్ర

అర్థం: అందమైన నెమలి అడవిలో తిరుగుతుంది. దానిని చంపి తీసుకువస్తాను. తుపాకి తీసుకురమ్మని మరిది తన వదినను అడిగినప్పుడు, నెమలిని చంపవద్దు అది గుడ్లు పెట్టే దశలో ఉంది అని భావం వచ్చేపాట.

నృత్యం మధ్యలో గ్రామస్థులు చిన్న చిన్న నాటకాలు వేస్తూ అందరినీ నవ్విస్తుంటారు. దీనినే 'ఖేల్' అంటారు. ఈ ఖేల్‌లో అనేక మంది పాత్రధారులుంటారు. పాత్రలకు అనుగుణంగా వేషధారణ వేసుకుంటారు. ఈ ఖేల్‌లో ప్రజలకు

ఉపయోగపడే సామాజిక, రాజకీయ పరిస్థితుల అవగాహనకు సంబంధించిన నాటకాలతో పాటు అందరికి హాస్యాన్ని పంచే కార్యక్రమాలు ప్రదర్శిస్తారు. దండారి మధ్యలో గోండు దేవుళ్ళను ఆరాధిస్తూ భజనలు చేస్తారు. ఇందులో భాగంగా ఒక వ్యక్తి స్త్రీవేషం వేసి భజనలకు అనుగుణంగా నర్తిస్తాడు. ఈ విధంగా తెల్లవారు జాము వరకు ఈ కార్యక్రమాలు జరుగుతూ ఉంటాయి.

మరుసటి రోజు ఉదయమే గ్రామపూజారి (దేవరి) గ్రామదేవత (ఆకిపేన్) పూజ చేస్తారు. ఈ సందర్భంగా అక్కడ ఉన్న పాత జెండాని తీసి కొత్త జెండాను ప్రతిష్ఠిస్తారు. ఈ ఆకిపేన్ జెండా త్రిభుజాకారంలో ఉండి అందులో సూర్య చంద్రుల ప్రతిబింబాలుంటాయి.

దండారి నృత్యంలో సంగీత వాద్యాలు, 'గంగారామ్ సోట', 'మల్ జాలీన టోపీ' పెట్టి కొబ్బరికాయకొట్టి 'రావుర్ సోదరుల'ను తలచుకుంటూ పూజ చేస్తారు. ఈ పూజ అనంతరం దండారి బృందానికి ఆహారం పెడతారు. ఒకరికొకరు ఆప్యాయంగా ఆలింగనం చేసుకొని, 'రామ్ రామ్' అని వీడ్కోలు చెప్పుకుంటారు. వచ్చిన అతిథులందరు గ్రామస్థులకు కృతజ్ఞతలు తెలియజేసి, వచ్చే సంవత్సరం తమ గ్రామానికి ఆహ్వానిస్తూ దండారి బృందం వాద్యాలు వాయిస్తూ, నృత్యాలు చేస్తూ తిరిగి తమ గ్రామానికి వెళతారు.

## ప్రదర్శన కళగా 'దండారి నృత్యం' నేడు

దండారి నృత్యాన్ని జానపద ప్రదర్శన కళలలో భాగంగా చెప్పవచ్చు. దానిలోని నృత్యం ఒక ప్రదర్శన కళగా కనిపిస్తుంది. ఈ నృత్యం చేసే దండారి బృందం సభ్యుల విషయంలో మనకు ప్రపంచమంతా ఆధునికత చోటు చేసుకుంటున్న తరుణంలో ఈ దండారి నృత్యంలో కూడా కొన్ని మార్పులు కనిపిస్తున్నాయి. అయితే అవి జానపద ప్రదర్శనలో ఉండే ఆహార్యం, ఆంగికం, వాచిక, సాత్త్వికాల విషయంలో కాకుండా సాధారణ విషయాలలో మార్పులు కనిపిస్తున్నాయి. అంటే వీరి వేషధారణలో గానీ, పాటలలోగానీ, వారి నృత్యం చేసే విధానంలోగానీ మార్పు పొందినట్లుగా కనిపించదు.

దండారి బృందం వేసుకొనే అలంకార సామాగ్రిని, వాద్య పరికరాలను, గుస్సాడీలు పెట్టుకునే టోపీ (మల్‌జాలీనా టోపీ), రోకల్ (గంగారామ్ సోటా) మొదలైన వాటిని పూర్వం అయితే దీపావళి (దివాడి) పండుగ అయిపోయిన తర్వాత మళ్ళీ పండుగ వచ్చే వరకు అంటే సంవత్సరం వరకు ముట్టుకోకుండా భద్రంగా ఉంచేవారు. కానీ నేడు వీటిని ఎవరైనా పెద్దవారు గ్రామానికి వచ్చినప్పుడు, ఇతర పండుగల



సమయాలలోనూ ప్రదర్శించడం కోసం వాటిని తీసి ఎప్పుడు పడితే అప్పుడు ఉపయోగిస్తున్నారు.

పూర్వం వీరు ధరించే టోపీలను గుస్సాడీలు తప్ప మరెవరూ ధరించేవారు కాదు. కానీ నేడు వీటిని ప్రముఖులెవరైనా గ్రామానికి వస్తే వారికి అలంకరిస్తున్నారు.

గుస్సాడీలు 'భోగి' నుండి 'కోలబోడి' వరకు వారి భుజానికి ధరించే చర్మంపైనే పడుకునే వారు. కానీ నేడు దీనిలో మార్పు వచ్చి ఈ చర్మం బదులు దుప్పట్లను కప్పుకొని పడుకుంటున్నారు.

గుస్సాడీ వేషం ధరించినవారు చెప్పులు వేసుకోరు. కానీ నేటితరం గుస్సాడీలు చెప్పులు ధరించే సందర్భాలు కూడా ఉన్నాయి.

## References:


1. Haimendor, C.V.F. 1979. "The Gonds of Andhra Pradesh". Vikas Publishing House Pvt. New Delhi.
2. Mohan Rao, K. 1990. "The Kolams", Book links Corporation, Hyderabad.
3. Sastry, V.N.V.K. Subba Reddy K.V. 1991. "Dandari Festival of Gonds of Adilabad District, TCR & TI, Hyderabad.


## Informants:

1. Barikar Kotnak Sathpath Rao (58 Years), Ex - President, Raj Gond Seva Samithi, Adilabad.
2. Sidam Arju(60 Years), Ex- Chairmen, ITDA, Utnoor.

# ప్రజాకళారూపాలు - ప్రకృతివాద్యాలు

- డా॥ మాడ పుష్పలత
తెలుగు పండితులు, ప్రభుత్వ ఉన్నత పాఠశాల
న్యూటౌన్, మహబూబ్‌నగర్

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణి"

గానరసాన్ని పశువు, శిశువు,పాము కూడా ఎరుగును అని సంస్కృత నానుడి. సంగీతం అందరికిప్రీతిపాత్రమైనది. 'వాద్యం లేనిదే గాత్రం లేదు'. హిందూ సంప్రదాయంలో ఒక విశేషమేమిటంటే పుట్టుకకు, చావుకు అన్నింటికి వాద్యాలు కావల్సిందే. ఈ వాద్యాలు శుభానికి, అశుభానికి వేరువేరుగా వాయించడం గమనించవచ్చు. ఈ సంగీతం ఉద్రేకం, ఆవేశం, ఆనందం కల్గిస్తుంది.

## వాద్యాల పుట్టుపూర్వోత్తరాల కథనం

మొదట్లో ఉరుములే తాళాలనీ, మెరుపులే కరదీపికలనీ, జల జలపారే నీటి గలగలలు, ఫెళ ఫెళమంటూ మ్రోగే మేఘాల గర్జనలనుండి వివిధ తాళగతుల్ని జానపదులు

జానపదులు తామే రకరకాల వాద్యాలను తయారుచేసుకుంటారు. జీవితంలో తన చుట్టూ ఉన్న సామాగ్రితోనే ఈ వాద్యాలను నిర్మించుకొంటారు. ఒక్కొక్క వాద్యం ఒక్కొక్క జానపద కళారూపానికి అనుగుణంగా నిర్మాణం ఉంటుంది. జానపదుని చాకచక్యానికి నిర్మాణకౌశలానికి మచ్చుతునకలే ఈ వాద్యాలు. వీటినే మట్టివాద్యాలని, చర్మవాద్యాలని, వాయువాద్యాలని, తీగ వాద్యాలని విభజించవచ్చు.

## మట్టివాద్యాలు

మట్టి అనేక రకాలు-ఎర్రమట్టి, నల్లమట్టి, చౌడుమట్టి. వీటిలో వంట వండే పాత్రల్ని విశ్వకర్మ కులస్థులు తయారుచేస్తారు. వాటిలో కుండ, కడవ, గోళం, ముంత, లొట్టి, గంజేటుక, కద్ద, కాగు మొదలైనవి. వీటిలో కుండ ప్రధానమైంది. వీటితోపాటు అన్ని పాత్రలు జానపదజీవితానికి ముడిపడి ఉంటాయి. చావు,పుట్టుకలలో కూడా వీటి స్థానం అపారమైంది.

### కుండ

ఇది మట్టితో చేసిన కుండను బోర్లపెట్టి లయబద్ధంగా కొడ్తారు. ఇది సంగీతంలో ప్రక్కవాద్యంగా వాడతారు. దీనిని వాయించేవారు లయబద్ధంగా తల ఊపుతారు.

### గుమ్మెట (బుర్ర)

గుమ్మెట కూజాకారంలో ఉండి ఒకవైపు చర్మంతో బిగించబడి ఉంటుంది. రెండవ వైపు ఖాళీగా ఉంటుంది. దీనిని బుర్రకథలో ఉపయోగిస్తారు. ప్రధాన కథకుడు శారదను, ఇరుప్రక్కల వారు ఈ బుర్రను ఉపయోగిస్తారు. కుడిచేత్తో ఒకవైపు కొడ్తూ, రెండవవైపు ఎడమ చేతితో లయబద్ధంగా మూస్తూ, తెరుస్తూ ఉంటారు. వీరు వంత పాటగా 'తందాన తాన, తానే తందనాన' అంటూ పాడతారు.

## చర్మవాద్యాలు

చర్మాలు అనేకం. జంతుచర్మాలైన గొర్రె, మేక, గాడిద, ఉడుము, గుర్రం, ఎద్దు మొదలైన వాటితో రకరకాల వాద్యాలను జానపదులు తయారుచేస్తారు. ఒక్కొక్క చర్మంపై ఒక్కొక్క గతి ఉంటుంది.

### తప్పెట (డప్పు)

మూడు,నాల్గు అంగుళాల వెడల్పు గల రీపర్ కట్టెను పచ్చిగా ఉన్నపుడు లేక నానబెట్టి వృత్తాకారంలో వంచి కడతారు. దీనికి దూడ చర్మాన్ని బిగిస్తారు. ఒక తాడు వేలాడదీసి చంకకు తగిలించుకొని, రెండు కట్టె పుల్లలతో వాయిస్తారు. ఈ తప్పెట్లు ఒకటి నుండి ఏడు, ఎనిమిది వరకు బృందంగా వాయిస్తారు. పల్లెటూళ్ళలో చాటింపు వేయడానికి, గ్రామదేవతను చేయడానికి తప్పెట ద్వారా ఊరేగింపు తీసుకెళ్తారు. జాతర్లలో తప్పెట గతులకు నృత్యం చేస్తారు, సిగం నిండుతుంది. దీని శబ్దం "కిరగడజణ కిరగడజణ" అని వస్తుంది.

### కుర్వడోలు

డోలు గుండ్రంగా డ్రమ్ము ఆకారంలో ఉంటుంది. దీని వ్యాసార్థం ఆరు అంగుళాలు మొదలుకొని మూడు అడుగుల వరకు ఉంటుంది. ఇరువైపుల మేక చర్మం అంటించి, తాళ్ళతో బిగిస్తారు. ఇది మోయడం కష్టమే అయినా మెడకు వేలాడేసుకొని వాయిస్తుంటారు. దీనిని కురవలు, గొల్లలు వివాహాలలో వాడతారు.

వినాయక నిమజ్జనం రోజు ఈ డోలును తప్పనిసరిగా వాడతారు. ఈ డోలునే ఒగ్గుడోలు అంటారు. ఈ డోలు వాయిస్తుండగా "డిల్లెం పల్లెం" అని శబ్దం వస్తుంది. భక్తి సమయాలలోను, వివాహ సమయాలలోను ఈ డోలుతో కుర్వలు విడదీయరాని పవిత్రబంధాన్ని కల్గి ఉంటారు.

### మద్దెల (మృదంగం)

డోలు మాదిరిగానే మద్దెల ఉంటుంది. కొంచెం పొడవు ఎక్కువగా ఉంటుంది. దీనిని రెండు చేతుల వేళ్ళతో రెండు వైపు వాయిస్తారు. ఈ మద్దెల మొదటి నుంచి చివరివరకు ఒకటే వృత్తాకారంగా ఉంటుంది. దీనికి ఒక సామెత కూడా అంటుంటారు.

"తప్పెట పోయి మద్దెలతో మొరపెట్టుకున్నదట"

అంటే, నన్ను అదేపనిగా వాయిస్తారని తప్పెట అంటే, నన్ను రెండువైపుల వాయిస్తారని, ఇక నేనెవరితో చెప్పుకోను అని అన్నదని మద్దెల అర్థం.

### డోలు

డోలు డ్రమ్ము ఆకారంలో ఉండి మూడునుండి నాలుగు అడుగుల వ్యాసం కల్గి ఉంటుంది. ఇరువైపుల గేదె చర్మం అంటించి, తోలు దారాలతో బిగించి కడతారు. ఒక కర్ర సన్నని, ఒక దొడ్డు కర్రను తీసుకొని, వాటితో ఇరువైపుల వాయిస్తారు. దీని శబ్దం"దిం తకదిణదిం తకదిణదిం" అని వస్తుంది. డోలు ఎంత ప్రసిద్ధం అంటే 17వ శతాబ్దం నాటికే అయ్యలరాజు నారాయణగారు 'రంకుటాలు'ను డోలుతో పోల్చాడు.

"అదియును దొమ్మరి వాని డోలు" అని పెళ్ళాన్ని దొమ్మరి వాని డోలుతో పోల్చాడు. ఈ దొమ్మరివారు డోలును వాయించి, ప్రేక్షకులను ఆకర్షించి, ప్రదర్శనను ప్రారంభించేవారు.

### ఢమరుకం

ఢమరుకం పురాణ ప్రసిద్ధమైన శివుని వాద్యం. ఇది చిన్నగా చేతిలో పట్టుకునేందుకు అనువుగా ఉండి, ఇరువైపుల మేక చర్మాన్ని తాళ్ళతో బిగిస్తారు. దీని మధ్య నుండి రెండు ముడులుగల దారాన్ని అటూ ఇటూ ఉన్న ముఖాలకు కొట్టుతుంటారు. దీని శబ్దం "ఢం ఢం ఢం ఢం ఢమరుక" అని వినిపిస్తుంది. దీనిని బుడుబుడుక్కలోళ్ళు వాడతారు. దీన్ని వీరు వాడడం వల్ల బుడుబుక్క అయ్యింది.



### తబలా

ఇది ఆధునికమైన చర్మవాద్యమని చెప్పవచ్చు. నాటకాలు ప్రారంభ మైనప్పటి నుండి కూడా తబలా, హార్మోనియం ప్రచారానికి వచ్చాయి. ఇవి రెండు భాగాలుగా ఉంటాయి. ఒకటి గుండ్రంగా పొట్టిగా ఉంటుంది. దీనిని ఎడమ చేతితో వాయిస్తారు. రెండవది కొద్దిగా పొడవుగా ఉంటుంది. దీనిని కుడి చేతితో వాయిస్తారు. వీటిని కుదురుపై ఉంచి కూర్చొని వాయిస్తారు. ఇవి ఒకవైపు మాత్రమే వాయించడానికి అనుకూలం. వీటికి చర్మాన్ని బిగించడానికి తోలు దారాలను రింగుల ద్వారా లాగి బిగిస్తారు. దీనిని బిగించేటప్పుడు కట్టెసుత్తెతో కొట్టి బిగిస్తారు.

### తాశె

తాశె ముస్లింల చర్మవాద్యం. ఎక్కువగా ముస్లింల పెళ్ళిళ్ళలో వాడతారు. కుంభాకారంలో తప్పెటంత వెడల్పు కల్గిన దీనిని చర్మంతో బిగిస్తారు. ఒకటిన్నర అడుగుల రెండు కట్టె పుల్లలతో వాయిస్తారు. దీని శబ్దం "తాడె తాడె తాడె తత్తాడ తత్తాడ" అన్నట్టుగా ఉంటుంది. దీనికి ఒక సామెతను ఉపయోగిస్తారు. "తళ్ళె కొట్టినా పెళ్ళే తాశె గొట్టినా పెళ్ళే" అంటే ఏమిలేని వాడు తళ్ళెనే తప్పెటలాగ కొట్టి పెళ్ళి చేసుకుంటాడు, అన్నీ ఉన్నవాడు తాశె గొట్టి పెళ్ళిచేసుకుంటాడని అర్థం.

## గాలి వాద్యాలు

గాలిలోని రకాలు తెల్పడం కష్టం. ముఖ్యంగా ఈదురుగాలి, సుడిగాలి, చల్లగాలి, వడగాలి ముఖ్యమైనవి. నోటితో గాలిని ఊదడం ద్వారా అనేక రకాల లయ ప్రధానమైన వాద్యాలను జానపదులు నిర్మించుకున్నారు.

### కొమ్ము

ఈ వాద్యం ఇత్తడితో చేయబడి, కొమ్మువలె వంకర తిరిగి ఉండే ఒక గొట్టంవంటిది. మూతివైపు సన్నగాను, పోను పోను వెడల్పవుతూపోతుంది. ఇది ఊదిన ధ్వని "తూతూ తుతూ తూతూతూ" అని శబ్దం వస్తుంది. ఈ కొమ్ము ఊదిన శబ్దం ఒక పిలుపువంటిది. పూర్వం యుద్ధాల ప్రారంభంలో శంఖం వంటిది. ఇప్పటికి దీనిని ఉత్సవాలలోను, ఊరేగింపుల్లోను, జాతర్లలోను ఊదుతూనే ఉన్నారు.

### పిల్లనగ్రోవి

జానపదులు దీనిని పుల్లంగొయి అంటారు. దీనిని సన్నపాటి వెదురు బొంగుతో తయారుచేస్తారు. పూర్వం క్రిమికీటకాదులు వెదురు బొంగులకు రంధ్రాలు

చేసినపుడు, దానిగుండా గాలి వీచినపుడు పిల్లనగ్రోవి ధ్వనులు పలికేది అని కవులు వర్ణించారు. ప్రకృతి సహజమైన దీన్ని చూచే, సన్నని బొంగుతో పిల్లనగ్రోవి తయారుచేసి ఉంటారు. సన్నని బొంగుకు మొదట్లో ఊదడానికి అనుకూలంగా ఎనిమిది రంధ్రాలు చేస్తారు. మన జాతీయవాద్యం ఏమిటని ప్రశ్నిస్తే శ్రీకృష్ణపరమాత్ముడు వాడిన ఈ పిల్లనగ్రోవియే అని పెద్దలంటారు. దీనికి వంశి, వేణువు, మురళి, బాన్సురి అని పర్యాయపదాలు. పల్లెల్లో పిల్లలు పిల్లంగోయిని తీసుకొని పశువులను కాయటానికి పోతుంటారు. వీటిని ఆధునికయుగంలో ఇత్తడి, స్టీల్‌తో కూడా చేస్తున్నారు.

### సన్నాయి

దీని ఆకారం బాజా వలెనే ఉంటుంది. దీనిని భజంత్రి అని కూడా అంటారు. "బాజాభజంత్రీలు మ్రోగుతాయి పందిట్లో" అని అంటారు. ఈ సన్నాయికి రంధ్రాలుంటాయి. ఊదడానికి పీక ఉంటుంది. దీని ద్వారా పాటలు పాడడానికి అవకాశముంటుంది. దీనిని శుభకార్యాలోను, గంగిరెద్దులవారు ఆడించేటప్పుడు వాడతారు.

### హార్మోనియం

హార్మోనియం చాలా ప్రసిద్ధం. ఇది పెట్టెవలె ఉంటుంది. ఒక పలక పెట్టె మధ్యలో చర్మం ఉంటుంది. దానిని నొక్కడం వలన గాలి నింప బడుతుంది. పైన మెట్లు నొక్కడం ద్వారా రాగాలు ఏర్పడతాయి. దీనిని ఎక్కువగా వీధి నాటకాలు, యక్షగానాలలో వాడతారు.

### శంఖం

ఇది సముద్ర గర్భంలో దొరికేది. ఒక పురుగు దీనిని ఆ విధంగా తయారు చేస్తుంది. పూర్వం యుద్ధారంభంలో శంఖం ఊదేవారు. కృష్ణుడి శంఖానికి పాంచజన్యమని, అర్జునుని శంఖానికి దేవదత్తం అని పేర్లున్నాయి. దేవాలయాలలో కూడ శంఖును పూజలకు, సేవకులను పిలవడానికి ఊదేవారు. ఈ శంఖును బాలసంతువాళ్ళు, వీరముష్టివాళ్ళు, హరిదాసులు ఊదుతూ బిక్షాటన చేస్తుంటారు. హరిదాసులు శంఖు ఊది, తెల్లవారుజామున నిద్ర లేపడానికి వస్తారు. "శంఖులో పోయనిదే తీర్థం కాదు" అనే నానుడి కూడా ఉంది.



### నాగస్వరం

మన పూర్వీకుల విజ్ఞానం ఎంతో విశేషమైనది. మనుష్యులను ఆడించటానికే కాదు. పాములను, పశువులను కూడా ఆడించే సంగీత వాద్యాలను కనుగొన్నారు. అట్టి వాద్యాలలో నాగస్వరం ఒకటి. నాగస్వరం మధ్యలో ముంతవలె ఉండి, కింది భాగంలో చిన్న పిల్లనగ్రోవి మాదిరిగా ఉంటుంది. దానికి రెండు,మూడు రంధ్రాలు మాత్రమే ఉంటాయి. పై భాగంలో ఊదడానికి గొట్టంలాంటి ఒక పీక ఉంటుంది. దీని నాదం ప్రత్యేకంగా ఉంటుంది. ఈ స్వరం పాములను ఆకర్షిస్తుంది. ఈ నాగస్వరం ఊదినంత వరకు పాము పడగ విప్పి ఆడుతూనే ఉంటుంది.

## తీగవాద్యాలు

తీగతో తయారు చేసే వాద్యాలను తీగవాద్యాలంటారు. వాద్యాలను రాగి తీగలతోను, ఇనుపతీగలతోను జానపదులు నిర్మించుకొంటారు. తీగలపై చేతితో, గోళ్ళ సహాయంతో తీగవాద్యాలను మ్రోగిస్తారు.

### జమిడిక

ఈ జమిడిక వాద్యం తీగతో ధ్వని వస్తుంది. దీనిని బైండ్లవారు లేదా పంబలు, బవనీలు కథ చెప్పేటప్పుడు వాడతారు. ప్రధాన కథకుడు జమిడిక వాయిస్తూ కథ చెప్తుండగా, ఇరువురు ప్రక్కనుండి వంత పలుకుతారు. ఈ జమిడిక శబ్దం "జుక జుం జుకజుం జుకజుం" అని వస్తుంది. దీని పేరే జమిళిక, జముకుగా మారింది. దీనిని కట్టెతోగాని, ఇత్తడిరేకుతోగాని చేస్తారు. డ్రమ్ము మాదిరిగా ఉంటుంది. ఒకవైపు తక్కువ వ్యాసం, రెండవవైపు ఎక్కువ వ్యాసం ఉంటుంది. కింది భాగంలో పల్చని చర్మాన్ని బిగిస్తారు. ఆ చర్మం కేంద్రబిందువు నుండి ఒక తంతిని చిన్న మూతివైపు ఒక పొడవైన కట్టెకు కడతారు. రెండవవైపు ఖాళీగా ఉంటుంది. కుడి చేతిని అందులోకి పోనిచ్చి తీగను మీటుతారు. జమిడిక గ్రామదేవతల కొలువులో తప్పకుండా వాడతారు.

### శారద

దీనికే ఇంకొక పేరు తంబూర. శారదాదేవి ఈ వాద్యాన్ని వాడతారని పురాణప్రసిద్ధం. కావున శారద అని పేరు వచ్చిందని అంటారు. ఇది కట్టెతో చేయబడి ఉంటుంది. ఇది కూడా ఒక రకమైన వీణ అని చెప్పవచ్చు. జానపదుల్లో వాడే శారద తంత్రివాద్యమే. దీనిని శారదకాండ్రు కథ చెప్పునపుడు ప్రధాన కథకుడు చేతితో వాయిస్తూ కథ చెప్తుంటారు.

### ఏక్‌తార

దీనికి ఒకటే తీగ ఉంటుంది. కాబట్టి దీనిని ఏక్‌తార అంటారు. అడుగు భాగంలో ఆనపకాయ (సొరకాయ) బుర్ర ఉండి, ఒక పొడవాటి కట్టెకట్టి, దానికి తీగను బిగిస్తారు. దీనిని ఎక్కువగా దాసర్లు వాయిస్తూ బిక్షాటన చేస్తుంటారు. ఇది కూడా తంత్రి వాద్యమే. జాతర్లలో వీరు దాసంగం పెట్టాలని ఒక దీపస్తంభం పట్టుకొని ఉంటారు. వీరు గోవిందా, గోవిందా అంటూ పూజ జరిపిస్తారు. నైవేద్యం సమర్పిస్తారు.

## లోహవాద్యాలు

లోహంతో చేసే వాద్యాలను లోహవాద్యాలంటారు. ముఖ్యంగా కంచు, ఇనుము, ఇత్తడి, రాగిలోహలతో రకరకాల వాద్యాలను తయారు చేస్తారు. ఒక్కొక్క లోహంతో తయారైన వాద్యం రకరకాల లయ ప్రాధాన్యం కల్గి ఉంటుంది. శబ్దాలు ప్రత్యేకంగా ఉంటాయి.

### గంట

గంట మన వాద్య విశేషాలలో ఒకటి. గంటలు అనేక రకాలు. కంచుతో చేయబడి దేవాలయాలలో వేలాడదీసే గంటలు. దేవాలయంలో ప్రవేశించినపుడు దేవునికి నమస్కరించినపుడు కొట్టేగంట, పూర్వం న్యాయం చేకూర్చే రాజులు ఒక పెద్ద గంట కట్టేవారు. అన్యాయం జరిగినవారు వచ్చి గంట కొట్టేవారు. దేవునికి మంగళహారతి ఇచ్చేటప్పుడు ఎడమ చేతితో కొట్టే గంట ఒకటి. భద్రాచలం, తిరుపతి మొదలైన దేవాలయాలలో పెద్ద మంగళారతి ఇచ్చేటప్పుడు గంటతో పాటు జేగంటను కూడా వాయిస్తారు. కొందరు ఈ గంటను నడుంకు కట్టుకొని, భుజానికి తగిలించుకొని కొడ్తారు. ఈ జేగంటను గంగిరెద్దులవారు కూడా చేతికో లేక నడుంకో తగిలించుకొని వాయిస్తుంటారు.

### అందెలు

ఇవి ఒక రకమైన గజ్జలు. ఇవి రెండు లోహలతో చేయబడి వృత్తా కారంలో ఉండి, మధ్య సందు ఉంటుంది. బొటనవేలికి సరిపోయేటంత సందు ఉండి, వీటి మధ్యలో కొన్ని లోహపుగుండ్లు, రాళ్ళు వేస్తారు. బొటనవేలికి తగిలించుకొని ఆడిస్తారు. ఒక దానికి ఒకటి తగిలి చిన్న గజ్జెల చప్పుడు వస్తుంది. వీటిని జంటగా బొటనవేలికి వేసుకొని, పైన తుండుగుడ్డను కడ్తారు. శారదాకాండ్రు, బుర్రకథకులు వీటిని ఎక్కువగా వాడతారు.



### గజ్జెలు

"ఎవరి గజ్జెల రవళివే మంజీర నీవు" అని దాశరథి కృష్ణమాచార్యులు అన్నట్లుగా గజ్జెలు కాళ్ళకు కట్టుకొని నృత్యం చేసేవారు. ఈ గజ్జెలు పిల్లలు ఆడే గోటికాయలంత పరిమాణంలో కంచు లేక ఇత్తడితో చేయబడి, వాటి మధ్యలో శబ్దం రావడానికి ఏవైనా లోహపు గుళ్ళనుకాని, చిన్నరాళ్ళనుకాని వేస్తారు. వీటికి ఒక కొక్కెం అతుకబడిఉంటుంది. వీటిని మూడువేళ్ళ వెడల్పుగల పట్టిలాంటి గుడ్డకు కుడతారు. కోలాటం ఆడేవాళ్ళు, లంబాడివాళ్లు, భరతనాట్యంలోను వాడతారు.

### తాళాలు

సంగీతానికి తాళం రెండవప్రాణం. రెండు తాళాలు కలిస్తేనే ధ్వని వస్తుంది. రెండు చేతులతో చప్పట్లు కొట్టినట్లు కొడ్తారు. "తప్పెట్లోయ్ తాళాలోయ్ దేవుని గుడిలో బాజాలోయ్" ఇది చిన్నపిల్లల నోటి పాట. తాళాలు భజనలో వాడేవి చిన్నవిగా ఉంటాయి. ఇవి కంచు, ఇత్తడితో చేయబడి చివరలకు తాడుతో కట్టబడి ఉంటాయి. వీటిలో పెద్దవి కూడా ఉంటాయి. తిక్కన విరాటపర్వంలో ఎంత పెద్ద తాళాలను గురించి రాశాడో చూద్దాం-

**"నేలయు నింగియు తాళముల్‌గాజేసి**

**ఏపున రేగి వాయించియాడ"** అని

భీమునికి కోపం వచ్చినపుడు నేలనొక తాళంగా, నింగినొక తాళంగా చేసి, ఉవ్వెత్తుగా ఎగిరి ఆడాలనిపించింది అని వివరించారు.

ఈ సంగీత వాద్యాలు పూర్వకాలం నుండి వస్తున్నాయి. కాని ఆనాటి రూపం నేడు లేదు. క్రమపరిణామం చెందుతూ వచ్చాయి. ఒక దాని నుండి ఒకటి మార్పుచెందుతూ పేర్లల్లో కూడా మార్పును సంతరించుకున్నాయి. వీటన్నింటివల్ల జానపదుల వాద్యవిజ్ఞానం ఎంత గొప్పదో తెలుస్తుంది. ఇప్పటికి తప్పెట్లు, జమిడికను గ్రామదేవతల కొలువుల్లో, జాతర్లలో వాడుతున్నారు. ఎంతో సహజసిద్ధంగా ఉన్న వాద్యాలు ఆధునిక రసాయనిక పదార్థాలు- ప్లాస్టిక్, రబ్బర్, స్టీలు, అల్యూమినియం, ఫైబర్-ఉపయోగింపబడి, వాటి మూలస్వరూపానికి అనుగుణంగా రూపుదిద్దు కొంటున్నాయి.

# పొడుపు కథల్లో కొబ్బరి కాయ

- డా॥ పగడాల చంద్రశేఖర్
అసోసియేట్ ప్రొఫెసర్
పొ.శ్రీ. తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

ఉద్దేశ్యం: (కొన్ని) భారతీయ భాషల్లోని పొడుపు కథల్లో కొబ్బరికాయను భావించిన తీరును పరిశీలించడం.

తెలుగులో కొబ్బరికాయను టెంకాయ అని కూడా పిలుస్తాం. కొబ్బరిని ఇస్తుంది కాబట్టి కొబ్బరికాయ అంటాం. తమిళంలో తెన్ అంటే దక్షిణదిక్కు అని అర్థం, దక్షిణదేశంలోని చెట్టుకు కాసింది కాబట్టి తెంకాయ అదే టెంకాయగా మారిందని భావించవచ్చు. వివిధ భారతీయ భాషల్లో కొబ్బరికాయ/టెంకాయను ఏవిధంగా పొడుస్తారో (భావిస్తారో) తెలుసుకుందాం.

'తెలుగులో పొడుపు కథకు విడుపు, తట్టు, మారుతట్టు, మారుకత, శాస్త్రాలు, సమస్యలు - సమిచ్చలు, చిటుకులు, చిట్కాలు, చిక్కుముళ్ళు, యక్షప్రశ్నలు, వేసే కథలు - విప్పే కథలు, అడ్డుకత, ఒడ్డుకథ అనే పర్యాయపదాలు ఉన్నాయి. పొడుపు కథను సంస్కృతంలో ప్రహేళిక, ప్రవల్హిక, ప్రశ్న, ప్రత్యుత్తర కూట, బ్రహ్మోదయ, వివాద, సస్యా గూఢ, హృదయాలిక అని; ప్రాకృతంలో పహేలి, హియాలియా అని; కన్నడంలో ఒగటు లేక వగటు, ఒంటు, ఒడగతె, ఒడకతె, ఒడ్డకతె, ఒగణు అని; తమిళంలో విడికత్తె, విడుకత్తె, వుడుర్ అని; మళయాళంలో విడికద, కటకద, కటం కథ అని; హిందీలో పహెలీ, బుజోవల్, భుల్ భులైయా, ముకరియా అని; మరాఠీలో ఉఖాణా, ఆహణా, ఉమణా, కోహడా, కులంగాదే, కోడే, బయాణా అని; బెంగాలీలో పహెలీ, దాంథా, పెయ్ అని; గుజరాతీలో ఉఖణో, ఉఖాతచా, కొహ్యాడో, అభియాణు, కోడు అని; సింధీలో ఉఖాణీ అని; పంజాబీలో పహేలీ, భుజాత్ అని; బిహారీలో బాహా, పహేలీ అని; ఉర్దులో పహేలీ, చుట్ కులే అని అంటారు. సంక్షిప్తత, నిగూఢత, అపార్థద్యోతకత, కథాత్మకత, కథారహితాత్మకత, ప్రతీకాత్మకత, ఘటన విశిష్టత, శబ్దతీక్షణత, చమత్కారచారుత, దృశ్యాత్మకత, ఆలంకారికత, సమశ్యాత్మకత, రసాత్మకత, ధ్వన్యాత్మకత, సాంప్రదాయకత, కవితాత్మకత అనే లక్షణాలు ఉంటాయి. పొడుపు కథవల్ల లోకజ్ఞానం, శాస్త్రవిషయ విజ్ఞానం, క్రీడాసక్తి, ఆలోచనాశక్తి, జ్ఞాపకశక్తి, వాచకశక్తి, సమన్వయశక్తి, జిజ్ఞాస, ఏకాగ్రత, విచిత్రవాగ్వ్యవహారం, మానసిక వికాసం, రహస్య గోపనం, దివ్యయోగం అనే ప్రయోజనాలు ఉన్నాయి' అని డా. కసిరెడ్డి(1990, 27-86) తెలిపారు.

A riddle is statement or question having a double or veiled meaning, put forth as a puzzle to be solve. Riddles are of two types: enigmas, which are problems generally expressed in metaphorical or allegorical language that require ingenuity and carefull thinking for their solution, and conundrums, which are questions relying for their effects on punning in either the question or the answer.

http.//en.wikipedia. org/wiki/Riddle

A question or statement requiring thought to answer or understand, a conundrum. One that is perplexing, an enigma. Riddle, a puzzlingly indirect description of some thing, person, or idea, framed in such a way as to challenge the reader to identify it. Riddles, usually in verse, are found as a popular literary from in most cultures and periods.

http://www. answers. com/ topic/ riddle,

Riddle puzzling question, specifically one that consists of a fanciful description or definition of something to be guessed. A famous riddle was asked by the Sphinix: "What goes on four legs in the morning, on two at noon, on three at night?" Oedipus guessed the answer correctly: "Man - in infancy he crawls, at his prime he walks, in age he leans on a staff."

http://www. reference. com/ browse/ riddle

కొబ్బరికాయ స్వరూప స్వభావాలను స్థూలంగా తెలుసుకుందాం. అవి - కొబ్బరికాయ చాలా ఎత్తైన చెట్టుకు కాస్తుంది. అయితే ఇప్పుడు పొన్నాయి (తక్కువ ఎత్తున్న) చెట్లకు కాసేలా శాస్త్రీయంగా రూపొందించారు. కొబ్బరికాయకు పైభాగంలో పీచు ఆకుపచ్చ, పసుపుపచ్చ రంగులో ఉంటుంది. పీచును వొలిచిన తరువాత రంధ్రాలు ఉన్న భాగంలో పిలకలాగా కొంత బాగాన్ని వదిలివేస్తాము. పీచులోపల గట్టి పెంకు, దానికి పైవైపు గుండ్రటి ఆకారంలో మూడు రంధ్రాలు ఉంటాయి. పెంకులో తెల్లటి కొబ్బరి ఉంటుంది. అందులో నీళ్ళు ఉంటాయి. ఇది స్థూలంగా

కొబ్బరికాయ స్వరూప స్వభావాలు. ఇక అందులోని కొబ్బరి, నీళ్ళు తియ్యగా ఉంటాయి.

భారతీయ భాషల్లో టెంకాయను పొడిచిన (భావించిన) తీరును చూద్దాం. తెలుగులో తప్ప మిగిలిన భారతీయ భాషల్లో కొబ్బరికాయపై పొడుపు కథలు తక్కువగా లభించాయి.

**కన్నడంలో పొడుపుకథ :**

1. *ఒందు మడకె, మడకె యొళగొందు శంఖు, శంఖనాక గొందు సముద్ర.*

(ఒక కుండ, కుండలో ఒక పాత్ర, పాత్రలోపల శంఖం, శంఖంలో సముద్రం.)

2. *అగస మాడిద మడియల్ల, కుండార మాడిద మడికె యల్ల, సూర్యన కణ్ణిగె హొళసిల్ల.*

(చాకలి చేసిన బాన కాదు, కుమ్మరి చేసిన కుండ కాదు, సూర్యుడు చూడని నీళ్ళున్నాయి.)

**తమిళంలో పొడుపుకథ :**

*కాడువెట్టి పారకంటు, పారవెట్టి వెళ్ళంకంటు*

(అడవిని తీసేస్తే రాయి కనిపిస్తుంది. రాతిని తీసేస్తే నీళ్ళు కనిపిస్తాయి.)

**మలయాళంలో పొడుపుకథ :**

చుట్టు ముట్టు కంప, కంపలో పెంక, పెంకలో శంఖు, శంఖులో తీర్థం.

**పంజాబీలో పొడుపు కథ :**

*He lives at the tree top, but is not bird*
*He has three eyes but he is not siva*
*He gives milk but is not a cow*
*He has hair but is not a sadhu*
*He is full of water but is not pitcher.*

(Balbir Singh Sandhu, 1984 -116)



(వాడు చెట్టుపైన ఉంటాడు కానీ పక్షి కాదు, వాడికి మూడు కళ్ళుంటాయి కానీ శివుడు కాదు, వాడు పాలిస్తాడు కానీ ఆవు కాదు. వాడికి జుట్టు ఉంటుంది కాని సన్యాసి కాదు. వాడి కడుపు నిండా నీళ్ళే కానీ మట్టికుండ కాదు.)

**సింధీలో పొడుపుకథ :**

*It is round like a hedge - hog but it is not hedge - hog*
*It has bread like men but it is not a man*
*It wears yellow robes but it is not a sanyasi*
*It is full of water but it is not water skin*
*what is it?* (M.K.Jetley, 1984- 127)

(ముళ్ళ పందిలా ఉంటుంది కానీ ముళ్ళపంది కాదు. మనిషికి ఉన్నట్లు గడ్డం ఉంటుంది కానీ మనిషి కాదు, పసుపు పచ్చని బట్టలు తొడుక్కుంటాడు కానీ సన్యాసి కాదు. నిండుగా నీళ్ళుంటాయి కానీ నీళ్ళు మోసే తోలుతిత్తి కాదు, ఏమిటో చెప్పుకో చూద్దాం?)

**తెలుగులో కొబ్బరికాయ :**

తెలుగులో కొబ్బరికాయను పొడవటానికి (ప్రశ్నించటానికి) సుమారు 50 పొడుపుకథలు కనిపిస్తున్నాయి. అంటే కొబ్బరికాయను అన్ని విధాలుగా భావించారన్నమాట. భావం ఒకటే అయినా భావనలో, చెప్పిన తీరులో, ఊహలో తేడాలు కనిపిస్తున్నాయి.

1. అంగట్లో చూసినోడు, చూసిందే కొన్న(న్నా)డు, కొనిందే వలిచాడు, వలిచిందే కొట్టినాడు, కొట్టితే నవ్వింది.
2. ............................ గుట్టకు మూడు కళ్ళు.
3. ............................ బుట్టకు మూడు కళ్ళు ........................
4. అబ్బకు డెబ్బయి, బిడ్డ బిడ్డకు చారెడు (తవ్వెడు) పాలు.
5. అంబుకు చెంబు, చెంబులో చారెడు నీళ్ళు.
6. ఆకాశంలో అంబు, అంబులో చెంబు, చెంబులో చారెడు నీళ్ళు.
7. ఆకాశంలో అంబు, అందులో చెంబు, చెంబులో చారెడు నీళ్ళు.
8. ఆకాశంలో రాణి, కొప్పుంది, జుట్టులేదు, కళ్ళు మూడు చూడలేదు.
9. ఆకాశంలో అప్పయ్య నా గడ్డం పట్టి పీకయ్య.
10. ఆకాశ గిరిగిర, నేలకి ధాం, రాతికి రంగం, నోటికి సైతాన్.

11. ఆకాశాన అంబు, అంబులో చెంబు, చెంబులో నీళ్ళు.
12. ఆ వీధిరాజులకు కొప్పుంది, కాని జుట్టులేదు. కళ్ళున్నాయి కాని చూపులేదు.
13. ఉత్తరాల చెరువు ఊరకే నిండె.
14. ఉరుములు లేవు, మెరుపులు లేవు, ఉత్తరాది చెరువు ఊరకే నిండె.
15. ఒంటి స్తంభం మేడపైన ఒప్పుగ చలువ పందిరి, చలువ నీటికుండల్లో చవులూరె మీగడ.
16. ఒక అమ్మాయికి డెబ్బయిమంది బిడ్డలు, ఒక్కొక్క బిడ్డకు ఒక్కొక్క గ్లాసు పాలు.
17. ఒకరాజుకు మూడు కళ్ళున్నాయి కాని ముక్కులేదు, జుట్టుంది కాని ముడిలేదు.
18. కంపలో పెంకు, పెంకులో శంఖం, శంఖంలో తీర్థం.
19. కాయకు మూడు కళ్ళు.
20. కుంతమంత కాయ, మంచమంత ఆకు.
21. కొప్పుంది కాని జుట్టులేదు. కళ్ళున్నాయి కాని చూపులేదు.
22. గింజలు లేని కాయ.
23. గుండ్రాయికి గుప్పెడంత పిలక, మూడు కళ్ళు.
24. గుడి అంతా ఎర్రన, గుళ్ళో తెల్లన.
25. గుడి అంతా తెల్లన, గుడిపైన నల్లన
26. గుడి చుట్టూ తాళం, గుళ్ళో నీరు.
27. చక్కని స్తంభం చేతి కందదూ, చెయ్యని కుండా పొయ్యని నీళ్ళూ, వెయ్యని సున్నం తియ్యగా.
28. చక్కని స్తంభం, చేయని కుండ, పోయని నీరు, వెయ్యని సున్నం.
29. చక్కని స్తంభం, వెయ్యని కుండ, పొయ్యని నీళ్ళు, వెయ్యని సున్నం.
30. చుట్టు ముళ్ళకంప, కంపలో పెంక, పెంకులో శంఖు, శంఖులో తీర్థం.
31. చుట్టుముట్టు కంప, కంపల పెంక, పెంకుల శంఖు, శంఖులో తీర్థం.
32. చూస్తే చిన్నోడు, వాడి ఒంటి నిండా నారబట్టలు.
33. చుట్టూ ముళ్ళకంప, కంపల మధ్య పెంక, పెంకులమధ్య శంఖు, శంఖుల తీర్థం.
34. చుట్టింటికి మూడే కళ్ళు.
35. చెట్టుకొమ్మలూ పిట్ట, పిట్టకు మూడు కా(క)ళ్ళు, కంటికి కడివెడు నీళ్ళు.



36. చెట్టుపై నివశిస్తాను గాని పక్షిని గాను, చర్మం ధరిస్తాను కాని సోమయాజిని కాను. మూడు కాళ్ళు కలిగి యుంటాను గాని శూలపాణినిగాను, నీరు కలిగి వుంటాను గాని కుండానుగాను, అంతకంటే మేఘాన్ని కాను, మరినే నెవరిని?
37. చెట్టు మీదుంది కాని పక్షి కాదు, మూడు కాళ్ళున్నాయి కాని ఈశ్వరుడు కాదు, చర్మవస్త్రమే కలవాడు కాని స్థిరయోగి కాడు.
38. చెయ్యని కుండ, పొయ్యని నీళ్ళు, వెయ్యని సున్నం, తియ్యగనుండు.
39. తాగడానికి నీరు వుంది. కాని తానమాడ్డానికి తగినంత లేదు.
40. (నామాలవాడు, బోడివాడు) బొచ్చువాడు.
41. నింప నిండె.
42. నీరు కాని నీరు నీరు కాయలోనే ఊరు.
43. నీళ్ళ బిందె తలమీద మోస్తే దాహం తీరుస్తుంది.
44. నేను ఒక చెట్టుని, నా కాయలు అందరూ తింటారు; కొత్తలో ఉన్నాను గాని పాతలో లేను; పబ్బములో వున్నాను గాని పండుగలో లేను; మరి నేను ఎవరినో పోల్చు పోల్చుకోండి.
45. నేల మొలవని తుంగ, కుమ్మరి చెయ్యని కుండ, చాకలి చెయ్యని చలువ, వాన కురయని నీళ్ళు.
46. మూడు కళ్ళున్నాయి. ఈశ్వరుని కాని, నీటితో నిండి వుంటాను. మేఘాన్ని కాను.

అక్కడక్కడ వింత ధోరణులు కనిపిస్తున్నాయి. అవి -

అణాకాని మేక దాని ఆతుల్ని నీవు పీక.

కొబ్బరికాయను అంబు, అమ్మాయి, (కుమ్మరి చేయని) కుండ, గుండ్రాయి, గుట్ట, చెంబు, చెరువు, నీటికుండ, నీటిబిందె, నీళ్ళతిత్తి, పక్షి, పిట్ట, బంతి, బావి, బిడ్డ, బుట్ట, ముంత, రాజు, రాణి, యోగిగా; కొబ్బరిపెంకును అడవిగా; మూడు రంధ్రాలను మూడుకళ్ళు, శివుడు, శూలపాణిగా; కొబ్బరినీరును మేఘం, సముద్రంగా; కొబ్బరిపీచును నారబట్టలు, చర్మవస్త్రం, సోమయాజిగా భావించడమైంది.

'మూడు కళ్ళున్నాయి కానీ శివుడనుకాను' అని; 'నేను చెట్టుపైన నివశిస్తాను కానీ పక్షినికాను' అని పంజాబీలో, తెలుగులో ఊహించడమైంది. 'కుమ్మరి చేయని

2323760 - 48



కుండకాదు' అని కన్నడంలో, తెలుగులో భావించడమైంది. 'కుండలో పాత్ర, పాత్రలో శంఖం, శంఖంలో సముద్రం' అని అర్థం వచ్చే పొడుపు కథలు కన్నడం, తెలుగులో కనిపిస్తున్నాయి. 'కడుపునిండా నీళ్ళే, కానీ మట్టికుండనుకాను' అని పంజాబీలో, 'నిండా నీళ్ళుంటాయి కానీ నీళ్ళు మోసే తిత్తిని కాను' అని సింధీలో సమానార్థకంలో ఊహించడమైంది. 'పసుపుబట్టలు ధరిస్తాను సన్యాసిని కాను' అని సింధీలో; 'జుట్టు ఉంది కానీ సన్యాసినికాను' అని పంజాబీలో సన్యాసి లక్షణాలను తెలిపారు. పైవిధంగా కొబ్బరికాయ (భాగాలు)ను పొడిచిన (ఊహించిన, భావించిన) తీరు దాదాపు అన్ని భాషల్లో ఒకేవిధంగా ఉంది. అయితే సింధీలో 'ముళ్ళపంది' అని; 'వాడు పాలిస్తాడు కానీ ఆవుకాదు' అని పొడవటం కొంత ప్రత్యేకత కనిపిస్తుంది.

కొబ్బరికాయను పొడిచిన (భావించిన) తీరు అన్ని భాషల్లోనూ దాదాపుగా ఒకేవిధంగా ఉంది. అందుకే 'Indian literature is one, even though it is written in many tongues' అన్న సర్వేపల్లి రాధాకృష్ణన్ భావన నిజమని పై పొడుపు కథలను పరిశీలించినపుడు తెలుస్తుంది. అంటే ఒక వస్తువును ఊహించడంలో భారతీయ ఆలోచనధోరణి ఒకేలా ఉందని తెలుస్తున్నది.

## ఉపయుక్త గ్రంథాలు

డా.కసిరెడ్డి (1990) తెలుగు పొడుపుకథలు, జాతీయ సాహిత్య పరిషత్తు, హైదరాబాదు

సత్యనారాయణ, గాజుల (సం) (2008), సామెతలు పొడుపుకథలు, విక్టరీ పబ్లిషర్స్, విజయవాడ.

M.K.Jetley (1984), Folk Literature, K.M. George(Ed), Comparative Indian Literature - volume 1, Kerala Sahitya Akademi, Trichur & Macmillan India Limited, Madras.

Balbir Singh Sandhu (1984), Folk Literature, K.M.George(Ed), Comparative Indian Literature - Volume 1, Kerala Sahitya Akademi, Trichur & Macmillan India Limited, Madras.

http://en.wikipedia. org/wiki/ riddle

http://www.answers.com/ topic/riddle

http://www.reference.com/browse/riddle

* * *

# జానపద సరస్వతులు - కొన్ని







ఆంధ్రప్రదేశ్ జానపదసాహిత్యపరిషత్
హైదరాబాదు









